శ్రీరస్తు.

శ్రీమత్పర్వతరాజకుమార వేంకటనాథరాజకవివరవిరచిత

# పంచతంత్రము.

పద్యకావ్యము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారిచే

ప్రకటితము.

1924

# పీఠిక.

## వేంకటనాథకవి.

ఇమ్మహాకవి పంచతంత్రమును బద్యకావ్యముగా రచించి మిగులఁ గీర్తిని జేకొన్న మహనీయుఁడు. ఇతని యింటిపేరు బైచరాజు వారు. ఇతని తాతతాత బైచమాత్యుఁడు. ఇందుచేతనే యీతని కీ యింటిపేరు గల్గెనని తోఁచుచున్నది. ఇవ్విషయము నే పంచతంత్రమున,

"ధీరత రాజమంత్రజలధిం బ్రభవించె మహావివేకధిసం
హారవిహారి సాక్షిపదదాంపుఁడు బైచనృపాలుఁ డద్ధరి
త్రీరమణీమనోహరుని తీవ్రయశస్స్థితికిన్ హరాద్రిగ
హారవసుంధరాధరము లయ్యె సమగ్రవిహారశైలముల్"

ఈ బైచరాజుకుమారుఁడు తిరుమలధరణీనాథుఁడు. ఇతని కుమారుఁడు వీరభద్రరాజు. ఇతనికిఁ బుత్రు లిద్దరు. లింగభూపాలుఁడు, పర్వతరాజు. ఈ పర్వతరాజునకుఁ బుట్టిన ముగ్గురుకుమారులలో నగ్రజుఁడే యీ వేంకటనాథమహాకవి. ఇక్కారణమువలనే యీతనిఁ బర్వతరాజకుమార వేంకటనాథుఁ డనియు నందురు. పై పద్యమును బట్టియే యీతఁడు క్షత్రియకులాన్వయుఁడని తెల్లమగుచున్నది. ఈ కవిశ్వరుఁడు తన్ను గుఱించి,

"అసహాయమసరసకవితా, రసికుఁడ వేంకటనాథప్రభుఁడ గుణ
ప్రసరప్రకాండమనన, ద్భసలాయితవిద్వదళిగంధనృజుఁడన్."

అని తన పాండిత్యగరిమంబును జెప్పికొనియున్నాఁడు.

కవికాలము, దేశము నిర్ణయించుటలో గొప్ప చిక్కుగలదు. పూర్వపుంగవులు తమగ్రంథములలోఁ దమకాలమును దేశమును జక్కఁగాఁ జెప్పుకొనువారు కారు. అట్లు చెప్పియుండినచో, బీఠికాలేఖకుల యూహలకును జర్చలకును నెడము లేకుండెడిది. ఏనను నీతని కాలమును గుఱించి 'బ్రౌన్‌దొరవారు' తమ నిఘంటువునందు క్రీ॥ శ॥ 1500 సంవత్సర ప్రాంతమువాఁడని వ్రాసి యున్నారు. కాఁబట్టి యీకాలమునకుఁ బ్రమాణోత్తరము లగు సమగతి కియ్యదియే యని నిర్ధారణ

చేయక తప్పదు. ఇదియునున్గాక వేంకటనాథుఁడు దాను బూర్వకవులను స్తుతించుచు,

"హృదయప్రస్థారథం బతిప్రియతమం బెక్కింతు జేతోంబురు
త్పదనాస్థానికిఁ దెత్తు మానసనభస్సంచారిఁ గావింతు హృ
ద్విదితక్షీరసముద్రఖేలనమునం దేలింతు నుత్కృష్టప
స్తుతులం బ్రాజ్ఞుల దిక్కయజ్వ నమరేశు న్సోము శ్రీనాథునిన్."

అని శ్రీనాథుని బేర్కొనియుండుటచే నీతఁడు 1450-వ సంవత్సరమునకుఁ బూర్వపువాఁడు కాఁడని స్పష్ట మగుచున్నది. మఱియును నీతఁడు తన జ్యేష్ఠపితృవ్యునిఁగూర్చి చెప్పుచు, 'కుమారలింగక్షోణిపాలుండు యవనసైంధవకాననానలుండు.' అనిచెప్పియున్నందునఁ గవి హిందువులకును మహమ్మదీయులకును యుద్ధములు జరగుచున్న సమయంబున నుండు నని యేర్పడుచున్నది.

ఇతఁడు కవులందఱివలెనే దనకుఁ బ్రబంధరచనాకాలంబున భగవంతుఁడు స్వప్నంబున సాక్షాత్కరించినట్లు చెప్పియున్నాఁడు. ఇయ్యది పూర్వకాలంబునుండి యాచారముగ వచ్చుచున్నది. ఇందలి సత్యాసత్యంబు లప్పరమేశ్వరుఁడే యెఱుంగు.

ఈతఁడు తనకృతియగు నీపంచతంత్రంబును స్వప్నంబున సాక్షాత్కరించిన హరిహరదేవున కంకిత మిచ్చినాఁడు. తద్విషయంబును, నాహరిహరనాథునియందలి భక్తిపారవశ్యంబును,

"ఏ చవవు గలదు హరిహర, సాచివ్యము నొంద నన్యజనులకు మది నా
లోచింపఁ దిక్కయజ్వకు, నాచనసోమునకు మఱియు నాకుం దప్పన్."

అని చక్కఁగ వక్కాణించెను. ఇక్కారణంబుననే యీతఁడు నెల్లూరి మండలనివాసిగానుండ నోపునని యూహింపవలసి యున్నది. కవితా నేమండలమువాఁడైన నేమి యెందుఁ బుట్టిన నేమి యెందుఁ గిట్టిన నేమి యెందు జీవనంబు గడపిన నేమి తనపాండిత్యముచేఁ గీర్తిని గడించినఁ జాలును.

కవితామాధుర్యంబుచే శిరంబు లూపించినఁ జాలు. అతఁడు భారతభూమి నలంకరించినవాఁడే యగు. ఈవిషయ మింతటితో విరమించి యితనికవిత్వముయొక్క శక్తినిగుఱించి కొంచెమాలోచింపవలయును.

ఇతనికవిత్వములో లక్షణవిరుద్ధములగు ప్రయోగము లున్నవనియు, నందుచేతనే లక్షణకర్త లుదాహరణముగా నీతనికృతిఁ గొనకపోయి రనియు నందురు. ఈలక్షణవిరుద్ధప్రయోగము లెల్లగ్రంథంబులయందును గన్పడుచున్నవి కాని యవి కొందఱియదృష్టంబుఁబట్టి సాధువులుగను గొందఱిదౌర్భాగ్యముంబట్టి యసాధువులుగను సాధింపఁబడుచున్నవి. ఇతఁ డీపంచతంత్రంబును సంస్కృతమునకు భాషాంతరీకరణమువలెఁ గాక ప్రబంధశైలిలో వ్రాసినాఁడు. కవిత్వ మెట్లుండవలయునో యీతఁడే యీపంచతంత్రమున,

''ఘనతరఘూర్జరీకుచయుగక్రియ గూఢము గాక ద్రావిడీ
స్తనగతిఁ దేట గాక యరచాటగు నాంధ్రవధూటిచొక్కపుం
జనుఁగవఁ బోలి తేటయును జాటుతనంబును లేకయుండఁ జె
ప్పిన యది పో కవిత్వ మనిపించు నగిం చటుగాక యుండినన్''.

అనుపద్యముచేఁ జెప్పి యున్నాఁడు. తిలకింపుఁడీ!.

కావ్యంబున నొక్కొక్కఁ డొక్కొక్క నరయు చుండును. 'భిన్నరుచిర్హి లోకః' అనునట్లు లోకంబునఁ బలువురు పలువిధంబులగు రుచులు గలిగియుందురు. దీనినే యీ వేంకటనాథుఁడు,

సీ. ''ఒకఁ డలంకారంబునకు వేడుకవహించు నొకఁడు వార్తాసమృద్ధికిఁ జెలఁగు
నొకఁడు శబ్దస్ఫూర్తులకు మాయురే యను నొకఁ డర్థసృష్టికి నుత్సహించు
నొకఁడు రసాభోగతకు మస్తముఁ గదల్చు నొకఁ డుపమానచర్చికకు వలరు
నొకఁడు పదప్రౌఢిమకు నిచ్చలో మెచ్చు నొకఁడు జాతిశ్లాఘ కుబ్బుచుండుఁ
తే. గామి చందానఁ దలపరి కరణి బధిరు, నిల దరిద్రునిగతి వాది పగిదిఁ గనక
కారు చాడ్పునఁ బంగు పైఖరిఁ గుజాతి, జాడ నిందఱి ముదలింపఁ జాలు నెట్లు.''

అని చాటియున్నాఁడు. 'అవిదితగుణాపి సత్కవిభణితిః కర్ణేషు వమతి మధుధారామ్' అన్నట్లు చవిఁ గొనుఁ డీపద్యమునందలి మాధుర్యము!

ఎట్టివానికృతియందును దప్పులుండక పోవు. ఉండినంతనే వాని కృతికిఁగాని యాతనికిఁ గాని కళంక మాపాదింపరాదు. గుణపరీక్షణము చేయవలయుఁ గదా? రసపుష్టిఁ గనుగొనవలయుఁ గదా? దీనినే యీతఁడు,

''ఒప్పులు గలకృతిలో నొక, తప్పున్నను గడమ గాదు దానికిఁ గళలం
జొప్పడు శశికిఁ గళంకము, కప్పురపుఁ దీవి యేమి నిందఁ గావించె నొకో.''

అని వక్కాణించె.

ఇతఁడు కృతిని రాజుల కిచ్చునభిప్రాయమందు విముఖుఁడు. ఒంటిమిట్ట శ్రీకోదండరామమూర్తి కంకితమిచ్చి కీర్తిఁగాంచిన బమ్మెర పోతనామాత్యునియనువునను, బీతికాపురికుక్కుటేశ్వరున కర్పించి తన కృతుల వాసి నొందిన కూచిమంచి తిమ్మకవివడువునను, మఱియు భగవదర్పణ మొనరించిన మహాకవులజాడ ననుసరించియే యీతఁడును రాజాంకితమునుగుఱించి,

"అతికుటుంబరక్షణాపేక్షఁ బ్రాల్మాలి, కృతులు మూఢభూమిపతుల కిచ్చి
చచ్చి నిరయమునకుఁ జనుకంటె హరిహరార్పణముఁజేసి సుగతిఁ బడయరాదె."

అని ఘోషించి యున్నాఁడు, చూచితిరే యీతనిదైవభక్తి!!!

ఈపంచతంత్రమునే దూబగుంట నారాయణామాత్యుండును దెనిఁగించె. పద్యములలో భావసామ్యముండకమానదు. కథ యొకటియే కదా? నారాయణామాత్యుఁడు సులభశైలిని వ్రాసినాఁడు. కాని యందుసైతము లక్షణవిరుద్ధములగు ప్రయోగములు లేకపోలేదు. వేంకటనాథుఁడుమాత్రము తాను గవిత్వ మెట్లుండవలయునని యొప్పఁజెప్పెనో యా చొప్పుఁ దప్పింపక తగినచోటులం దనువయిన వర్ణనములను జేర్చి రచించినాఁడు. ప్రబంధమునం దుండఁ దగిన వర్ణనములన్నియు నెట్టకేలకుఁ గల్పించి రసపోషణముఁ జేసి వాసిఁ గాంచినాఁడు. ఐనను లక్షణవిరుద్ధములగు ప్రయోగము లందందుఁ జూపట్టుచున్నవి. వానినెల్ల నిట వ్రాయఁ బూనలేదు. 'కోటి కొక్కపాట' నోటి కొక్కమాట'యనునామెత మనకుఁ జిరపరిచితంబు కాదే. అట్లే సామాన్యముగఁ బాఠభేదములచే లక్షణవిరుద్ధములగు ప్రయోగములును గలిగియుండునని యూహింప వచ్చును. ఈదోషములను గృతికర్తనెత్తిపై వైచుట ధర్మమార్గమని యేరైన నెన్నఁ బూనుకొనరని నానమ్మకము.

హంసవింశతికర్తయగు అయ్యలరాజు నారాయణామాత్యునివలె నీతఁడును స్వభావవర్ణనములం గడు నేర్పున నలవరించి యున్నాఁడు. కొన్నింటి నీక్రిందనుదాహరించెద. గ్రంథమునందే తిలకింపనగు నని పాఠకమహాశయుల వేఁడెద.

స్వభావవర్ణనములు.

| | పుట. | పద్యము. |
|---|---|---|
| వేసఁగి | 58 | 577 |
| గొల్లచాన | 59 | 586 |
| హేమంతము | 69 | 677 |
| వేఁట | 99 | 166 |
| చోరుఁడు | 122 | 199 |
| సిద్ధుఁడు | 151 | 101 |
| వనము | 196 | 522 |

ఇట్టి వెన్నియేని కానఁగు. ఉదాహరింపఁ బూనిన గ్రంథమంతయు నెన్నవలసి యుండును.

ఈతఁడు శబ్దాలంకారంబులఁ గూర్చుటయందు మిక్కిలి ప్రియుఁడు. అందం దనేకపద్యములఁ గానఁగు. అయినను గొన్నింటిని దెలిపెద.

శబ్దాలంకారములు.

| పుట. | పద్యము. |
|---|---|
| 6 | 100 |
| 17 | 123 |
| 87 | 70 |
| 69 | 676 |
| 114 | 119 |
| 140 | 380 |

ఈగ్రంథము నీతులకుఁ బుట్టినిల్లని వేఱ చెప్పనేల? నీతులను బొందుపఱచి వ్రాసిన పద్యములఁ గొన్నింటి నుదాహరింప మన స్సువ్విళ్లూరు చున్నది. కాంచుఁడీ కవిమహిమము!

"పురుషవిశేషలీల విరిబోఁడియు వాలు విపంచి శాస్త్రముల్
దురగము వాణియు న్నరుఁడు దొడ్డతనంబు వహించు రట్ల కా
పురుషవిశేషలీల విరిబోఁడియు వాలు విపంచి శాస్త్రముం
దురగము వాణియు న్నరుఁడు దొడ్డతనంబువహింప రర్వరల్." ప్రథమాశ్వాసము.

"గజ మంటినట్లు యుఱుకు, నృభుజగము మూర్కొనినయట్లు పొరిగొను ధరణీ
భుజుఁడు నగినట్లు చంపుం, గుజనుఁడు మన్నించునట్లు గొను బ్రాణంబుల్."

మనుజుఁ డెన్నండును స్వతంత్రుఁడు కాఁడు. భగవంతుం డేయేకాలమున నెట్టి త్రిప్పుం ద్రిప్పునో యట్లు తప్పక యనుభవింపవలయు ననుట కీ మహాకవి యెట్లు కథాంశములను వాక్రుచ్చెనో కనుఁగొనుఁడు.

సీ. "ఘనరూపనిధి యనంగునకా యనంగత్వ? ముచితమే బలి కహివ్యూహవసతి?
పాండునందనునకా బహుకాలవనవాస? మిథపురాధిపునకా యేటిచోరత?
యదుకులాన్వయునకా శాపమరణంబు? జాహ్నవీసుతునకా శస్త్రశయ్య?
నలరాజుకా మహానసపాకభజనంబు? నహుషునకా ఘోరనాగమూర్తి?
తే. మతి త్రిశంకునకా పచ్చిమాలతనము?, ద్రుపదనందనకా రాచతొత్తుపాటు?
మనుజుఁ డెవ్వఁడు కర్మస్వతంత్రుఁడనయ?, నీశ్వరుఁడు గాక సమకూర్పనిట్టి పనులు."

ఇందుఁగల యైతిహ్యముల నెట్లు జతకూర్చెనో.

ఇట్లే నీతులుగలపద్యములును, గంటపాఠము జేసి పలుమారులు ప్రస్తావనావశంబునఁ జదువుకొనఁదగిన పద్యము లనేకము లున్నవి. అక్కడక్కడఁ బద్యములలో సామెతలనుగూడ నిమిడించి యున్నాఁడు. భాషయందుఁ బాండిత్యము లోకమునఁ గలిగింపవలెనన్న సామాన్యమునఁ బ్రచారములో నున్నమాటలనే యుపయోగించుచు గ్రంథములను వ్రాయుట యుచిత మనువారికెల్లరకు వందనసహస్రంబులు. క్రొత్తపదంబులును సమాసచాతుర్యంబులును, నలంకారవిశేషంబులును భాషకలంకారప్రాయంబు లని యెన్ని గ్రంథజాలంబులను రచించి మహాకవిపండితులు లోకంబున భాషను బోషింతురు గాక యని నాయాశ.

ఇం దెందైన లోపంబు లుండక మానవు. 'ప్రమాదో ధీమతా మపి' యనువాక్యంబును దమమనంబున నిడి పరిశీలించి దోషంబులఁ బోఁద్రోచి గుణగణంబుల గ్రహింతు రని భాషాభిమానుల నెల్లరను వేఁడుచున్నాఁడను.

ఇట్లు విన్నవించు,
పండితాఖండలమండల పాదసేవకుఁడు,

కావ్యతీర్థ. కవిభూషణ జనమంచి. వేంకటసుబ్రహ్మణ్యశర్మ,
సహాయాంధ్రపండితుఁడు, మునిసిపల్ హైస్కూలు, కడప.

శ్రీరస్తు.

# పంచతంత్రము.

## ప్రథమాశ్వాసము



### అవతారిక.



వృత్తస్తననిస్తులైణమదసంసిక్తం బురోవీథి బా
గై విన్యాణపుఁబుట్టుమచ్చ రవిక న్యాసన్న విశ్వంభరా
దేవీవిభ్రమలక్ష్మిఁ దేటపఱుపం దీపించు త్రైలోక్యర
క్షావర్ధిష్ణుఁడు కృష్ణుఁ డూర్జితమనీష న్మాకు దిక్కయ్యెడిన్. 1

మ. సరసీజాతము లాటపట్టులు నిశాచారారి చంచద్భుజాం
తరమావాసము పుట్టినిల్లు సలిలస్థానంబు దారిద్ర్యభీ
కరవజ్రాయుధకోటిచూపు నిగమాంతప్రోక్త లాళంసినీ
పరిషద్భాగముగాఁ జెలగుజగదంబం బద్మఁ గీర్తించెదన్. 2

చ. తరల కహో యుపాంశుజపదంభమున న్వనజాతపీఠి క
న్నరమొగిడించి సృష్టికరుణాయతి మూలకుఁ ద్రోఁచి భారతీ
చరణశిఖాంతవిభ్రమరసంబులఁ బ్రస్తుతిసేయుధాత మ
న్నిరుపమదివ్యకావ్యపదనిర్మితిఁ బ్రోఁదిరొనర్పుఁ గావుతన్. 3

మ. నవమేఘాళిఘటించు మచ్చికురబంధశ్రీ నిరీక్షించి గో
త్రవరేణ్యంబులఁ జేయువృత్తకుచముల్ దర్శించి భావించి నా
యవలగ్నాంగముఁ జూచి సింహాసృజనం బర్థింపుమంచు న్మనో ధవు
మేలంబునఁ దేల్చువాణి నను నంతర్వాణిఁగాఁ జేయుతన్. 4

ఉ. చేకొని బ్రహ్మమంత్రములఁ జెప్పనహో ప్రతిసీర జాలమై
నాకుఁడు దేవతాళిగళనాదమున న్గదిలించుచోట భూ
షీకృత భోగిదర్శనముచే ధృతిదూలి చలించుగౌరి నా
లోకముఁ జేసి నవ్వు ప్రబలు న్బరమేశ్వరు నాశ్రయించెదన్. 5

ఉ. ఆసవనారిమోవిరుచు లానఁగఁ దఘ్నకంధరావల
ద్వాసుకి భూరిభూత్కరణ వాతకనన్నిటలాంబకాగ్నిఁగం
గాసలిలాప్తినార్చుటకుఁగా వడిదోయిలిసాఁచుచండము
డాసురహంత్రి నన్ను సకలార్థవిధిజ్ఞునిఁ జేయుఁగావుతన్. 6

చ. నడుఁగక బాల్యచాపలమున న్ననపిమ్మటి వ్రేలఁ జొక్కపున్
గడియపుట ట్టటంచుఁ ద్రిజగజ్జను లచ్చెరువందిచూడ న
క్కడపటికొండ సొంపులెఱుఁగం దవిలించినటించుశూలిపె
న్గొడుకు మదీయకావ్యమునకుం గలిగించు నిరంతరాయముల్. 7

ఉ. భూరి విరాడ్వికారగతిఁ బూర్వకుభృచ్చరమాద్రులం బదాం
భోరుహముల్ఘటించుకొని పోకలరాకల మేన్మలంచి వి
ద్యారుచిఁ జొక్కుచోఁ జెవివద న్రవిపోగున కెంపువోలెఁ జె
న్నారమహోన్నత స్మయము నక్షుర నక్షురిపు న్భజించెదన్. 8

మ. ధవమూర్ధేందుపయోధిపర్వశశిచెప్పం జొక్కి పెక్కంద్రకై
దవఖండంబసమగ్రము గ్రనగమంథక్షుభ్యమాణంబు నిం
ధువసారంబు తమస్వమొప్పఁగలచంద్రుండంచు దివ్యామృతం
బవలంబించు భుజంగకోటియగునాగారిం బ్రశంసించెదన్. 9

చ. అతినిశితాశుధారకు మహామహనీయ విచిత్రవర్ణసం
గతికి నిరూఢగూఢసుముఖత్వదసత్యపదార్థసంగ్రహ
స్థితికిఁ బహుప్రయత్ననియతిం జనతాశ్రుతిరత్నకుండలా
యితహితసూక్తియుక్తి నుతియించెద బాణమయూరచోరులన్. 10

మ. హృదయబ్రహ్మరథం బతిప్రియతమం బెక్కింతుఁ జేతోమరు
త్సదనాస్థానికిఁ దెత్తు మానసనభస్సంచారిఁగావింతు హృ
ద్విదితక్షీరసముద్రఖేలనమున న్దేలింతు నుత్కృష్టవ
స్తుదులం బ్రాజ్ఞులదిక్కయజ్వనమరేశ్వు న్సోము శ్రీనాథునిన్. 11

క. వాచావీచీధీకృత, లోచనకర్ణాగ్రయాయి లోకసుధాంధో
నైచికిఁ దలఁతు న్మద్వంశాచార్యుం దిరుమలశ్రియగపతి గురునిన్. 12

మ. రసవిస్ఫూర్తిగొఅంత దీనికిదిపూర్వచ్ఛాయ యుచ్చోటఁ ద
ప్పస దిప్పట్టున నర్థస్ఫృష్టిపసలే దచ్చోట నశ్లీల మ
ద్దెస నాదిక్కునదుస్సమాస మిది సందేహాస్పదంబీడ నం
చుసుమాళంబునఁ బాండితుల్మెరపునీచు న్రోఁత వాక్రువ్వఁగన్. 13

సీ. ఒకఁడలంకారంబునకు వేడుకవహించు నొకఁడువార్తాసమృద్ధికిఁ జెలంగు
నొకఁడుశబ్దస్ఫూర్తులకు మాయురేయను నొకఁడర్థసృష్టికి నుత్సహించు
నొకఁడు రసాభోగతకు మస్తముఁగదల్చు నొకఁ డుపమానచర్చికకు నలరు
నొకఁడుపదప్రౌఢిమకు నిచ్చలో మెచ్చు నొకఁడు జాతిశ్లాఘ కుబ్బుచుండుఁ
తే. గామిచందానఁ దలపరికరణిబధిరు, పలె దరిద్రునిగతి వాదిపగిదిఁ గనక
కారుచాడ్పునఁ బంగుపైఖరిఁ గుజాతి, జాడ నిందజేముదలింపఁజాలు బెట్లు. 14

క. ఒప్పులు గలకృతిలో నొక, తప్పున్నను గడమగాదు దానికిఁ గళలం
జొప్పడుశశికిఁ గళంకము, కప్పేర్పడి చేమినిందఁ గావించెనొకో. 15

ఉ. ఆనుటకీరసంబున నహంకృతిదంశితు లల్పకాకవు
ల్వీనుల నీనిముత్కవిత విద్వదుపాసితగాకయున్నె యా
హీనరభుక్తశేషకబళాహరణక్షమకుర్కురాళికిం
గాని నవాజ్యధారక్రతుకార్యసమాచరణీయగాదొకో. 16

*చ. మృదుగతి మందితావులకు మెచ్చుసదావనిఁ బావనాళి దా
పదిగొనిరోయువంకలను వంచకసంచయ మట్టిదేకదా
చదురుఘటిల్లఁజూచు సదసప్రసవంబులఁ జంచరీకపుం
గదుపులు నిచ్చలు న్వెదకుఁ గాకుణపంబుల నక్కలేర్పడన్. 17

చ ఘనతరఘూర్జరీకుచయుగక్రియ గూఢముగాక ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక యరవాటగునాంధ్రవధూటిచొక్కపుం
జనుఁగవఁబోలి గూఢమును జాటుదనంబును గాకయుండఁ జె
ప్పినయది పో కవిత్వ మనిపించు నగిం చటుగాకయుండినన్. 18

చ. ఎడపక తారుదారె లిఖియించి పఠించి కృతుల్ ప్రతుల్ జగం
బడిగిన నిచ్చి హెచ్చి సకలావసథంబుల దారయై దిశల్
గడచి నటించుకావ్యములు కావ్యములా హరణాఘశాంతికై
విడువక కూలిఁబెట్టి వదివించుకృతుల్ కృతులే వసుంధరన్. 19

వ. అని యిష్టదేవతానుతియును బురాతనకవిస్తుతియు నాచార్యపురస్కృతియును గుకవితిరస్కృతియుం గావించి, యేనొక్కనాఁడుపంచతంత్రంబాంధ్రభాషం జంపూ

---

*చ. మృదుగతి మంచితావులకు మెచ్చుసదావనిఁ బావనాళి దా
వడిగొనిరోయువంకలను వంచకుఁడే ద్దెఅనట్టిదేకదా
వెదకుమహారసప్రసవవిభ్రమసంపదలన్నొజ్ఞ ష
ట్పదములు పూతిగంధకుణపంబుల రోయవె నక్కలెక్కడన్.

ప్రబంధంబుఁ జేయఁ బ్రారంభించి యేతత్కావ్యకన్యకారత్నంబున కనుకూలవల్ల
భుం డే దేవుండొకో యని విచారించి శయ్యాతలంబున శయనించిన. 20

శ్లో. హ్యాన్నిత్యయాచర మయా ప్యమయాప్రభుత్వం
మాళీతుపార ఘృణినా జగతాం గురుత్వం
సందీపయ న్నభసి కోఽపి మహాన్పుమాన్మే
స్వప్నే శుభే సితసితద్యుతి రావిరాసీత్.

క. కలలోఁ దలుపుం దెలుపుం, గలవేలుపుదొర యగణ్యకారుణ్యరసం
బొలయ ననుఁ జూచి ద్రాక్షా,ఘమధురప్రణయపూర్వభాషలఁ బలికెన్. 22

క. నను హరిహరనాథునిఁగా, మనమునఁ దలపోయు నృపకుమారక విద్వ
జ్జనసేవ్యము నీకావ్యముఁ, దనకి మ్మభిమతవరప్రదాతకు భక్తిన్. 23

వ. అని యానతిచ్చి యావేల్పు విచ్చేసిన నానందకందళితపులకదంశితుండనై మేలు
కని. 24

క. ఏచనువుగలదు హరిహర, సాచివ్యమునొంద నన్యజనులకు మది నా
లోచింపఁ దిక్కయజ్వకు, నాచనసోమునకు మఱియు నాకుం దక్కన్. 25

ఉ. సన్నుతశబ్దలక్షణరసస్ఫురితంబుఁ బురాణభారతో
త్పన్నము నైన సాధుపతితం బయి యొప్పదు మర్త్యసేవ్యమై
యున్నప్రబంధ మెప్పటి కహో జగదేకపవిత్రభూమి దే
వాన్నము సారమేయచరణాంకితమైన భుజిక్రియార్హమే. 26

గీ. అతికుటుంబరక్షణాపేక్షఁ బ్రాల్మాలి, కృతులు మూఢభూమిపతుల కిచ్చి
చచ్చి నిరయమునకుఁ జనుకంటెఁ హరిహరా, ర్పణముఁ జేసి సుగతిఁ బడయరాదె.

ఉ. అంగధృతాబ్జు నిశ్చలతరాతను సర్వదు సర్వమంగళా
లింగితు భీషణాశరకులీనజయోన్ముఖపౌరుషక్రియా
సంగతు భీషణాంబకకృశాను నిరూపితవైరిసద్మయో
గాంగయుతాద్యతిన్ హరిహరాకృతి మత్కృతిభర్తఁ జేసెదన్. 28

వ. అని నిశ్చయించి యత్త్రిలోకీకర్త మత్కృతిభర్తఁగా నొనర్చితి మదీయ వంశా
వతారం బభివర్ణించెద. 29

ఉ. ధీరత రాజవంశజలధిం బ్రభవించె మహావిరోధి సం
హారవిహారి సాళ్వబిరుదాంకుఁడు భైచనృపాలుఁ డద్ధరి
త్రీరమణీమనోహరుని తీవ్రయశస్స్ఫూర్తికిన్ హరాద్రినీ
హారవసుంధరాధరములయ్యె సమగ్రవిహారశైలముల్. 30

క. అల బైచక్షితిపతికి, న్బలభిత్ప్రతిమానభోగపరతంత్రునకున్
గలిగె న్నిరుపమలధరణీ, తలనాథుఁడు నిర్భరప్రతాపోజ్జ్వలుఁడై. 31

ఉ. అంబుజనేత్రఁ దిమ్మవసుధాధిపరత్నము గూర్మిఁ బేర్మిఁ ది
ప్పాంబికఁ బెండ్లియై కనియె నప్రతిమానగుణాఢ్యు వీరభ
ద్రుం బరిపంథిరాజకులతోయధిమందరు ఘోరసంగరా
డంబరచుంబిభీషణకటప్రకటద్విప సైన్యసంయుతున్. 32

సీ. అతఁడు తుంపట్లశ్రీపతిరాజవరపుత్రి శృంగారములయిక్క లింగమక్కఁ
బరిణయంబై లింగనరనాయకవతంసుఁ బ్రాభవనిస్తంద్రు బర్వతేంద్రుఁ
గనియెఁ గుమారలింగక్షోణిపాలుండు యవనసైంధవకాననానలుండు
పోరులఁ బెక్కండ్రఁ బొరివుచ్చె నమ్మహాఘవునితమ్ముఁడు పర్వతప్రభుండు
తే. వైరికాంతారదవవారివాహమూర్తి, పోలె ఫలితిమ్మనసుమతీపాలపుత్రిఁ
బుణ్యచారిత్ర వికసితాంభోజనేత్ర, నన్నమాంబికఁ బరిణయంబయి ముదమున.

క. నను వేంకటజనవల్లభు, వినుతపరాక్రముని రంగవిభుధైర్యకళా
కనకాద్రిని శేషాద్రినిఁ, గనియె నిహాముష్మసౌఖ్యఘటనాయతికిన్. 34

క. అసహాయసరసకవితా, రసికుఁడ వేంకటఘరావరప్రభుఁడ గుణ
ప్రసనప్రకాండమదవ, ద్భసలాయిత *విద్వదఖిలబంధువ్రజుఁడన్. 35

షష్ఠ్యంతములు.

క. భువనత్రయస్వాకృతికిన్, బలిపాణిప్రముఖలోకపాలకమకుటీ
దివసమణికి రణవికసిత, సవకరుణాచరణచరణజలజాతునకున్. 36

క. పౌలస్త్యవరదునకు నా, ర్యాలోకచకోరతాపహరణక్రీడా
గ్లాలాలితాస్యునకు నం, హోలుంఠకహృదయమునిజనోపాస్యునకున్. 37

క. వినతానందనగతికిన్, ఘనవరకత్రాసకరణ కరవాలభుజా
భినవాద్భుతసురతతికిన్, జనితప్రహ్లాదవినుతజటిసంతతికిన్. 38

క. బహుభువనవిహారునకు, స్సహజబ్రహ్మాండభాండజటిలఫలాళీ
వహనమహనీయవిగ్రహ, మహితోదుంబరగతశ్రమశ్రీకునకున్. 39

క. తరణిశశిలోచనునకుం, బరమాణువిలోకి యోగమార్గఖురాళీ
పరివిహృతిసనాథునకున్, హరిహరనాథునకు సద్గృహసనాథునకున్. 40

క థా ప్రా రం భ ము.

వ. సభక్తిసమర్పితంబుగా నాయొనర్పం బూనిన పంచతంత్రంబునకుం గథాక్రమం
బెట్టిదనిన. 41

* సకలబంధు పరిషత్కులుఁడన్.

సీ. వనజగర్భకటాహావర్ధిష్ణువరణంబు బలిబహూకృతపుణ్యసలిలఖేయ
మరుణాంశుకలశభాసుర రత్నసౌధంబు కుధరభిద్గృహచుంబిగోపురంబు
ధనదవాక్రీడసద్ధాత్రనిష్కుటకంబు బ్రహ్మనిష్ఠద్విజప్రాంజలంబు
ప్రబలభార్గవశౌర్యబంధురక్షత్రంబు పౌరస్త్యనిధివణిగ్భాసురంబు
తే. పద్మనాయకశుభవిభాధర్త్స్యమాన, విద్వదావాసమండలీవిహరమాణ
భూరిసంతాపతిమిరంబు పొగడ నెగడుఁ, బూర్ణగరిమంబు పాటలీపురవరంబు. 42

సీ. హాలహాలం బిదిగాదె యభ్యమిత్రీయజీ వానిలగ్రాహిప్రాహిపతికి
బలుమదం బిదిగాదె పరుషారివారిజోన్మూలకృత్సాలశుండాలపతికిఁ
జిరతమం బిదిగాదె పరరాజసంరోధి వరణమండలచక్రవాలమునకుఁ
గ్రొమ్మెఱుం గిదిగాదె కుటిలశాత్రవతను క్షతజయుక్ప్రాకారచక్రమునకు
తే. క్షౌద్ర మిదిగాదె ప్రతిపక్షజాతిఁ జెడని, కొమ్మరేకుల గనుపట్టుకోటతమ్మి
కనఁగ జన లోచనోత్సవం బావహిల్లఁ, బరిఘవిల్లుఁ బొగడ్త నప్పురియగడ్త. 43

గీ. మొదలు నప్పులలోఁ గొంత మునిఁగి పిదప, రాసికెక్కిన పెనుమచ్చరాలఁ బెరిగి
పరఁగుతనపెంపుఁ గొమ్మలపాలుఁ జేసి, కోట యప్పీట నుర్వీటుపాటఁదనరు. 44

చ. పురనిధిరక్షణక్షమతఁ బూనిన శుద్ధసుధాసముజ్జ్వలా
వరణ ముకుందభృత్ఫణికి వాలికకొమ్మ లతిస్ఫుటస్ఫటో
త్కరము తదగ్రశీతకరకాంత శిలల్మణులం బురుడ్బిసా
హరణచరన్మరాళపరిఘాంబువు కంచుక మెంచి చూడఁగన్. 45

మ. దివిషద్వాహిని యప్పులం బొరసి యుద్వృత్తి న్విజృంభింపఁగా
నవరోధించినవీటికోట యధమర్ణాచార మేపార వాం
బనకచ్ఛంబునఁ బాఁగుకొన్న యడుగొప్పం బ్రస్తరస్వీకృతి
న్నినసద్రత్నతదాతపోచ్ఛలన వహ్నిం గ్రాఁగు నశ్రాంతమున్. 46

మ. గళబద్ధానిలభుగ్విషస్ఫురిత భూతాకారంబునం గాలుఁ గొం
డలునీ తేరిగురాల నెట్లు చెడకుండం బ్రోతు వన్వప్ర ద
క్షులగారుత్మతశోభఁ బూనిధరియించుం జూడుఁడా యంచు ని
స్తులదత్తోత్తరభాషఁ దెల్పి చను ఖద్యోతుం డుదాత్తాచితిన్. 47

చ. కులుకుకుచంబులానకలుగుల్వడఁ గొమ్మలఁ దొంగిచూచు కొ
మ్మలముఖచంద్రచంద్రికలమవ్వపుఁ దేటగవాక్షచంద్రమ
శ్శిలలస్రవించునీటఁ బడి శీఘ్రగతిం బఱతెంచు మీనకం
దళములయత్నపద్మదళదామకశోభ ఘటించుఁ గోటకున్. 48

ఉ. బంభరడింభఝుంకృతినిబద్ధకటప్రకటప్రదానవ
త్కుంభికదప్రహారముల గూకల ప్రక్కలునైనమిన్నువి
శ్వంభరఁగూలున న్కలఁక సారసగర్భుఁ డొనర్చు సంభృతి
స్తంభములో యనం గనక సౌధము లుల్లసిలుం బురంబునన్. 49

చ. పవనజవంబునం బుగముపై గరుడాగ్రజు గాంఘహయాంకృతిం
బవలు గ్రమించిరాఁగఘృణిమాలి హయాళి పయాధిక శ్రమో
త్సవముఘటించు నౌర దివిషద్వనితాజనతాముఖేందుజ
చ్ఛవినికషంబునం బొడము సౌధనిశాపదృషత్పరివాహముల్. 50

చ. మరకతకుంభము ల్దలల మానసమానవిహీనకేతువుల్
కరములు మధ్యన త్రిరవికాస్తుజరత్నముతారకాసము
త్కరము సరోజదామకముగాఁ బొగడొందినసౌధరాడ్విరా
ట్పురుషుఁడు ప్రత్యహం బమరపూజితుఁడై కొమరొప్పనప్పురిన్. 51

ఉ వన్నియమీఱ వన్నగరివాడల మేడలఁ గ్రీడలం గుఱు
ర్కొన్న మెఱుంగుమిన్నలతకూనలకుం జెలులై నిలింపవి
ద్యున్నిభదేహలిత్తు రలితుంపవిముక్తవితీర్ణభూరుహో
త్పన్నసమగ్రసౌరభనితాంతలతాంతగుళుచ్ఛకచ్ఛటల్. 52

*చ. గురుపురగోపురాగ్రములఁ గూడినభూపసతుల్పతుల్మనో
హరవరదత్తమత్తవిషమాయుధజన్యవిహారఖిన్నల
చ్చరికఘటిల్ల వేసవులసోరునఁ దీరువ మేరుమారుతాం
కురములఁ బ్రోతు రచ్ఛకుచకుంభజవిభ్రమపుష్కరప్లుతిన్. 53

*చ అలఘుసరోజభీమశిశిరాగమకాలకరాళజాతర
జ్వలనశిఖోష్ణజీర్ణవిధివాహకులాయజకోటికిచ్చు ను
త్కలిక నిలింపధామతిమిధామనఘూప్రతిబింబితామిళ
త్కలిత సుగంధచంద్రఘటికాపురగోపురయానతాస్యముల్. 54

ఉ ఆపురిఁ జంద్రికానిశల హాటకహర్మ్యమృగేంద్రమధ్యల
భ్రాపగనీట మజ్జనములాడి యలంకృతిమచ్ఛరీరులై
డాఁపునసున్కిఁజేకొనఁ గడంగుకురింగు నిలింపపుష్పలా
వీపటలార్పితా పహితవృక్షులతోఘగుళుచ్ఛకస్మృతిన్. 55

చ. అలతొలివేల్పురాఁ బగరయాకటిపంటలు వేదబీజముల్
మొలచినచే లుదారగుణము ల్జనియించినయిండ్లు సత్క్రియా

---

* ఈరెండుపద్యములు ప్రక్షిప్తములని తోఁచెడు.

ఫలతరువుల్ వివిక్తశుకపంజరముల్ గళికల్మిధాతతా
తలమననేర్తురౌపరతత్త్వవిధిజ్ఞులు వీటిభూసురుల్. 56

శా. దూరారాతు లుదారధర్మగురుమూర్తు ల్పద్మినీహృద్వికా
సారంభు ల్వసుభూషితుల్ హృదయపద్యాబంధవిశ్వంభరుల్
ధారాసారవిధాయకు ల్ఘనపదాలంకారు లత్యర్థతే
జోరమ్యు ల్రుచిరోదయు ల్శుచివతంసు ల్వాల్తు రచ్చో నినుల్. 57

ఉ. ఉన్నతవైభవు ల్పరివిహారభవుల్ భవనాంగణంబులం
దెన్నఁగఁ గోటికొక్కటిగ నెత్తినపెక్కియము ల్లతాద్విర
క్తిన్నెరయంఘటించు మణిదీప్తములై గగనప్రవంతికా
సన్నఫలాభిరామదివిషత్కుటనిష్కుటవాటి కెంతయున్. 58

ఉ. స్ఫారతరత్వరాప్తి ప్రతిభాలధరాధిపనిశ్చలత్వగం
భీరము మాన్పు వాహినులు పెక్కులు గొల్వఁగ లచ్చిఁ గాంచి యా
పూరితసత్వరేఖపొలుపుం గని సద్ఘనులాశ్రయింప ని
ర్వారణమంద్రు భూరిగుణరత్నసముద్రులు సాంద్రు లప్పురిన్. 59

శా. చూడం జాడ్యకలరాగలక్ష్మి గలిగించు న్మించుఁ దోడ్తోన నా
క్రీడక్రీడనకాంక్ష కర్ణకుహరార్తిం బాపు పాదంబునం
దోడై తీర్చు రమాకుమారుపను లెందు న్వందులంబోలి యొం
తే డాకం బళిరె పురంబుకలకంఠీజాతి యక్రాంతమున్. 60

ఉ. రాగములం బరాగములరాగములంగరఁగింతు రంగరే
ఖాగతి మెచ్చ రచ్చరలఁగాంచినశుద్ధము కల్మి దేశసం
ధాగరిమంబునం దడసినం గడకాల్గ నదల్చి రంభ నే
లాగుననైన గెల్తురు కళావతు లాపురభేదనంబునన్. 61

సీ. వదనాబ్జములె చాలు వలపులఁ బ్రేరేఁప వెలిదమ్ములేటికి విక్రయింప
సోగకన్నులె చాలు సొంపుసంపాదింపఁ గలువలేమిటికి నంగళ్లఁ బెట్ట
మొలకనవ్వులె చాలు ముదముఁ బ్రోదిరొనర్ప నచ్చమల్లియ లేటి కమ్మఁ జూప
గురుకుచంబులె చాలుఁ బరితోషమొనరింపఁ బూగుత్తు లేటికి బుటములెత్తఁ
తే గాయదీధితి చాలు రాగము ఘటింప, బేరమెటఁ గింప నేల చాంపేయములకు
ననుచుఁ బథికులు నర్మోక్తు లాడ నాడ, వేడ్క విహరించుఁ బువ్వులావీజనంబు. 62

సీ ఆలాన దారుబద్ధాంసువుల్ దెగఁ బిఱిందికి నీఁగి ముకుచాయ నిగిడినిగిడి
పక్షభాగములవెంబడికుథంబులు జాఱిపోవ రజల్ ప్రయ్యఁ బొంగిపొంగి

నిర్యాణకోణము ల్నిండి యుప్పరమెక్కి శీధువీచికలపైఁ జిమ్మిచిమ్మి
సృణిఘాతముల లెక్కసేయక చేయిచ్చుకృత్తిసృద్భటపంక్తిఁ గిట్టికిట్టి
తే. హస్తిపకముఖ్యసంహాతు లతులగతుల, మఱువుఁడని చూళికలకోజఁ గఱపికఱపి
వఱలునవ్వీట గర్వదుర్వారవైరి, మారణారంభబలములు మదకలములు. 63

చ. సురసరణిం బడల్పడఁగఁ జూచి కరాహతిఁ దత్పురోపరి
న్నిరవధికత్వరం జనఁగ నెట్టన మావులఁ దూలవై మకో
యరదముఁ బట్టునో యనుభయంబున నేగు నదృశ్యుఁడై విభా
కరుఁడన వీటిదంతులకుఁ గల్గిన యున్నతు లెన్న నేటికిన్. 64

ఉ. రాజిలుపోతుమానికపురాల జిరాలగురాల సారథా
రాజవగౌరవం బడపరా కతిపుష్కరవాహకోటి గా
ఢాజడవీథిఁ దోలువిరియంబడధారలకల్మి మత్సరో
త్తేజితమై హయాంకభృతి దీప్తసమీరణ మూర్జితత్వరన్. 65

శా. వైరూఢారభటీరటన్ముఖధనుర్బాణ ప్రచండాసి భృ
చ్ఛూరుల్ గ్రాలఁ బరోపతాప మొనరించు స్ద్విప్రసంచారరే
ఖారంభంబున సంఘటించుమహికి న్గంపంబుఁ గల్యాణము
జ్జైర న్మాఱు మొగంబుతోఁ బురము తేజీల్ దుష్ప్రభుప్రక్రియన్. 66

మ. పరికింప న్మకుళప్రవాళగతి నభ్రంబంటుమావు ల్సమీ
పరసంగన్నులవిందుఁ జేయు భువనప్రఖ్యాతచక్రభ్రమిం
బరమోత్కృష్టతఁ గాంచి ఖడ్గశరసంపత్తి న్బ్రకాశించి య
ప్పురితేరు ల్మహనీయజంగమనగ స్ఫూర్తిన్నడు న్రాజిలున్. 67

వ. మఱియుఁ గమలాలంకృతంబులై మురవైరియురంబుం బురుడించు సరోవరంబులును ప్రతిపర్వరసోదయంబులై యనారతంబు భారతంబుంబోలు నిక్షువనంబులును వెండియుం బేరుగల వస్తువులుం గలిగి జగత్ప్రసిద్ధివహించిన యారాజధానిం బాలించు రాజేంద్రుండు. 68

సీ. తనరూపమనురూప ధరఘాతి గురుసూతి మఘపూత విభుజాత మర్దిగాఁగఁ
దనదానమినజానఘనగారిపనవారి ధరవాహపరదేహలోపిగాఁగఁ
దనశౌర్య మనివార్యతరకోపపరభూప ఘనసైన్యజనదైన్యకారిగాఁగఁ
దననీతి వినయాతిధనరజ్యవనరేజ్య శతపత్రహితపుత్రసహజగాఁగఁ
తే. దనమహాసత్య మంతికోద్యత్త్రిశంకు, తనయసత్యతపశ్చరిత్రంబుగాఁగ
మనుశుభస్ఫూర్తి నిత్యధర్మప్రవర్తి, తత్త్వవిద్దర్శనుండు సుదర్శనుండు 69

సీ. తనదానగౌరవంబునఁ బుణ్యజనపరంపర చిరస్వాస్థ్యసంపదవహింపఁ
దనమహాహవముపెంపునఁ జక్రవాళాచ లోత్తరతిమిరంబు లడ్డుపడుపఁ
తనఘనావనబలోద్యమమున నతిమిత్రగోత్రకుంజరజాతికుతుకమందఁ
దనమలుంగున దురంతప్రతాపస్ఫూర్తి హవణించునినుఁడునణఁగియుండ
తే. సమధికాదృతిఁబూని విశ్వంభరుండు, తప్ప కెప్పుడుఁ గన్నులఁగప్పకొనఁగ
వాలుమగఁడయి యత్యంతవసుసమృద్ధి, దనరుఁ బ్రియదర్శనుండు సుదర్శనుండు.
సీ. తనయశోనటికి గోత్రావలచ్చతురబ్ధి ఘనతరంగములు రంగములు గాఁగ
దనమహాస్త్రజిహ్వునకుఁ బ్రాజ్యారిరాజ్యములు నిస్తులతరాజ్యములు గాఁగ
దనహేతిశతధార ధారకాశాపకృత్కుమతిగోత్రములు గోత్రములు గాఁగ
దనగూఢసకలహంసమునకు భామామానసములు నిర్మలమానసములు గాఁగ
తే. దనమహాగుణరత్నసంపతికి శాస్త్ర, చతురభాషణకృతు లలంకృతులు గాఁగ
మనును దర్శనుఁ డభినవామ్నాయచరిత, ధర్మతోషితహస్తసుదర్శనుండు. 71
సీ. పరధరాధిపచిత్రపత్రఖండనకేళి దశదిశావిదితప్రతాపరేఖ
యసదనుశాసనవ్యాపారత మహాశరావళిదత్తచిత్తాద్భుతగతి
భువనసంచారయోగ్యవిసితగతిమత్తసారంగరంగదాస్థానగరిమ
నిరుపమాన నిధాన పరిపూర్ణతమనోజ్ఞగుణసమేతార్యానుకూలవృత్తి
తే. బహువితానోన్ముఖుఁడు సమిద్గ్రహణశాలి, సత్యనిధి పుణ్యజనుఁ డతిచండరశ్మి
గంధవాహుండు హృష్టారిగాఢభూతి, యతఁడు దిక్పాలకాంశజుం డగుటఁ దెలిపె.
సీ. అతిశీధుమదవికారత మేనులెఱుఁగని కరటులసఖ్య మగ్రాహ్య మనియుఁ
గుత్తుకవిసము వాకునఁదీపుఁ గలపాపజాతితో నెయ్యంబు జరుగదనియు
గఱుపాటమున ద్రవ్వి కడుపుఁబోసికొనెడి పందితోఁ బొందు నిర్బంధమనియు
నఖిలకంటకసహాయతఁ బెచ్చుపెరిగిన కఠినమూర్తులచెల్మి కష్టమనియు
తే. ధరణి కరి ఫణి కిటి ధరేశ్వరులరోసి, యప్రమత్తు మహావిశుద్ధాంతరంగు
సాదిగర్భేశ్వరునిఁ గరుణార్ద్రహృదయ, విష్ణుసన్నిభు నష్ట్యైవిభునిఁ జేర. 73
శా. సత్యఖ్యాతి నిధానదానజనితస్వాస్థ్యప్రతిష్ఠీకృత
ప్రత్యర్థిం బహువేదశాస్త్రపఠిత ప్రస్థానవర్తిం బ్రజా
ప్రత్యక్షాదియుగభ్రమీకృత కలిప్రారంభుఁ గారుణ్యసం
పత్యాత్యాదృతమిత్రుఁ బోలదె నుతింపం దద్ధరాధీశ్వరున్. 74
మ. బుధసంభావితమూర్తి నిస్తులకళాపూర్ణుండు నిష్పర్వపూ
ర్వధరాధీశపదప్రవర్తి హితసద్రక్షాచరిత్రుండు దా

నధురాధుర్యుఁడు గర్వభాగరివధానందుండు శోభాసుధా
నిధి యారాజిభవైరిపీఠిఁ గొలువుండెం గొల్వుకూటంబునన్. 75

క. ఇనుఁ డుదయాద్రింబలె న,య్యినుఁ డమ్మణిపీఠి మెఱసి యేమని చెప్పం
దనయుల ననయులఁ జెంతం, గనుఁగొని నిశ్వాసవీచికలు గడలెత్తన్. 76

క. చిత్తమునఁ బొగిలి యిట్లను, విత్తము ప్రాభవ మవివేకము వయసా
పత్తిదము లొకఁడొకండో, కెక్కుత్తున నన్నియును గలుగ నేమనిచెప్పన్. 77

క. లేదఁట పాండిత్యము చవి, గాదఁట ధర్మం బదేటికొనుపుడాఁ జూల్
గాదఁట యేనాఁడును బా, లీదఁట యాధేను వేరి కేలా గోలన్. 78

క. సుకృతంబునఁగాంచు నొకొ, నొకఁడు నయవిభూతి కాంక్ష నుత్తము నతిపా
తకునకు లేఁడైన సులాం, తకుఁడు దేవులు విసముసంటితనయుఁడు పుట్టున్. 79

మ. పరమైకాంతికవాస మిష్టము ప్రియాపంధ్యాత్వ మామోదసం
భరలాభంబు ఋతూచితాభిగమన ప్రారంభవై ముఖ్యమా
పరితోషం బబలాసుతాప్తి దగు గర్భస్రావమో వా న్వపుః
పురుషత్వవ్యతిపుత్రు డుత్తమగుణాంభోరాశి లేకుండినన్. 80

ఉ. కావున దుస్స్వభావమదగర్వవికారయుల మ్కుతుమారులం
గేవలనీతిబోధమునఁ గీర్తితమూర్తులఁ జేయువాఁడు లేఁ
డేవిమలాత్ముఁ డొక్కఁడని డెందమునందలపోయ నద్ధర
త్రీవిభుఁజూచి యొక్క జగతీసురపుంగవుఁ డాసభాస్థలిన్. 81

వ. అధీతనీతిశాస్త్రమర్ముం డగు విష్ణుశర్ముం డనునతండు బృహస్పతియునుంబోలెఁ దేజరి
ల్లుచు దక్షిణహస్తంబెత్తి యిలాప్రియదర్శనుం డగుసుదర్శనున కుదారస్వరంబున
నిట్లనియె. 82

క. పరిసముచేతను లోహా, త్కరములఁ గాంచనముఁ జేయుగతి మహోద్బుధా
చరణమున మీకుమారుల, గురుకీర్తి నీతిపారగులఁ గావింతున్. 83

చ. ఇది నిజ మిందు కాఱు నెల లిమ్మడమి ట్లొనరింపకున్న నీ
పదఁ బదమూన కేను వనవాసమొనర్చెద నన్న రాజు స
మ్మదము వహించి యోవిమలమానస యంతటివానిఁ గానెఱుం
గుదు నిను వీరె ముద్దుకొడుకు ల్నయవేదులఁ జేయు మేర్పడన్. 84

వ. అని సమర్పించినం గైకొని విష్ణుశర్ముం డక్కుమారులకొఱకుఁ దంత్రంబు లయిదు
కల్పించి కథాద్వారంబున నీతి గ్రహింపంజేయువాఁ డయ్యె నత్తంత్రనామంబు

లెయ్యదియనిన మిత్రభేదంబును సుహృల్లాభంబును సంధివిగ్రహంబును లబ్ధనాశంబును నసంప్రేక్ష్యకారిత్వంబును నాఁ బొగడనెగడు నందు మిత్రభేదం బారంభించి రాజకుమారుల కతం డిట్లని చెప్పందొడంగె 85

క. సాహంకృతి బహుమృగకో, లాహలహలహలిక వనతలంబున నొకనాఁ
డాహారకేసరివృషభ, స్నేహం బొకజంబుకంబుచే వీడ్వడియెన్. 86

క. నావిని రాజకుమారకు, లావిప్రునిఁ జూచి పలికి రనఘా వృషభం
బావళశాత్రవసఖ్యం, బేవిధమున నక్క చెఱిచె నెఱిఁగింపఁగదే. 87

క. అన నతఁ డిట్లను దక్షిణ, మున మహిళానామనగరమున నీతికళా
వనరాశివర్ధమానుం, డన వర్తకుఁ డొకఁడు మెఱయు నతఁడు నిజాత్మన్. 88

వ. ఇట్లని విచారించె. 89

ఉ. కొంచక లేనిచోఁ బసిఁడిఁ గూర్చుట కూర్చినకాంచనంబుర
క్షించుట రక్షితత్వ మడఁగింపక సొంపెసగం బ్రవృద్ధినొం
దించుట దాని నేమరక తీర్థముఖప్రతిపాదితంబుగా
వించుట లెస్సనీతి రసవేదులకుం బలుమాటలేటికిన్. 90

క. పాలింపనిసిరి చోరుల, పాలగుఁ జెడుఁ గూర్పఁగూడఁబడిననిజస్వం
బీలేమి నిష్ప్రయోజన, మా లేమియు కలిగియున్న నతిలోభులకున్. 91

క. పరికల్పితసస్యపరం, పరకుఁ దటాకోదకంబువలె గూర్పం జే
కుఱినసిరి యర్థులకు నిడు, కొఱకుఁ గదా యనుచుఁ దలఁచుకొని యత్నమునన్.

క. ఆవణిజుఁడు నందక సం, జీవక నామముల నుల్లసిల్లువృషముల నా
నావిధవస్తుధురంధర, మై వెలసినబండిఁ బూన్చి యనుజీవులతోన్. 93

క. ఘనధర్మకర్మసాధన, ధనసంగ్రహబుద్ధిఁ దావు దలరిపురంబుల్
జనపదములు గడచియశో, ధన ధనదాశాభిముఖతఁ దడయక యేగెన్. 94

ఉ. ఆవిధి నేగి యొక్క భయదాటవిలో విషమస్థలంబునం
బోవఁగ వస్తుభృచ్ఛకట భూరిభరంబునఁ బోవ నందు సం
జీవకజానుదేశ మవిసెం బవిసందితశైలశృంగమో
నావడిఁ గ్రమ్మ రక్తమదనస్రోదపో నటు నేలఁగూలినన్. 95

క. కొదవపడియెఁ బని యనుచు, న్మదిజాలిందూలి వర్ధమానుఁడు దానిన్
వదనుండి తునుచునందుల, కు దయాపరతంత్రుఁ డగుచుఁ గొందఱ నిలిపెన్. 96

క. నిలిపి శకటమున నొండొక, బలవద్వృషభమునమర్చి పథమున నవ్యా
కులమానసుఁడై చనియె, న్గలవారలపనికి సేగిగలదే పుడమిన్. 97

ఉ. కావనియుక్తులై యచటఁ గాల్కొనియున్న భటుల్ మతంగజ
గ్రావచరత్తరక్షుభయకంపితులై యటఁబోయి చచ్చె సం
జీవకుఁ డంచు నేలికకుఁ జెప్పిరి చెప్పిన నమ్మువారు గా
కావల నెవ్వరైనఁ గపటాత్ములచిత్తముఁ జొచ్చి చూచిరే. 98

క. భీషణవనమున నాయు, శ్శేషవిశేషమునఁ గుళ్ళి చివుకక యవ్వో
నీషద్రుజలేకమహా, ఘోషవృషంబునను నిరవుకొని కాల్వచ్చెన్. 99

వ. స్వచ్ఛందాహారాదిలాభంబుల హృష్టపుష్టాంగంబున నై యాశాక్వరప్రసరంబు యమునాప్రాంతకాంతారంబునం గ్రుమ్మఱుచుండె నక్కాలంబున. 100

చ. కరటులమేల్మదంబణఁచి కర్కశపంచకధూర్తకృత్యము
ల్సెఱిచి పరోగ్రఖడ్గపటలి న్నెఱవాఁడికిఁ బాపి క్రొవ్వనం
గుఱువులువారుకంటకులఁ గొండగపుల్సొరఁ దోలి పౌరుషం
బఱిముఱిఁ గ్రాలఁ బింగళకుఁడ న్మృగరాజు చరించు నచ్చటన్. 101

క. హరికి మృగరాజ్యమెవ్వరు, కరుణించిరి తనకు దాన కాదా వనకుం
జరభంజనునకు జలనిధి, కురువిక్రమవైభవునకు నొకరీవలెనే. 102

క. ఆకంఠీరవము పిపా, సాకలుషితహృదయ మగుచు సలిలాశన్ స
త్త్వాకీర్ణంబగు కాళిం, దీకచ్ఛంబునకు ద్రుతగతిం జనుచుండెన్. 103

వ. అప్పుడననుభూతపూర్వంబై యకాలప్రళయజలధరగర్జితంబునుంబోని యఖండసంజీవకగర్జనంబు పరిసరధరాధరదరిద్వారంబులం బ్రతిధ్వానంబులం బుట్టించిన నాకర్ణించి యశనిపాతకంపితంబగు నీహారాహార్యశృంగంబునుంబోలె సింగంబు వికలితాంతరంగంబై నిలుకంబడి యిది యేమిటిది యొక్కొ యుద్దిక్కున నేమియొకో యనుచు మందగతిం జనుచుండె నంత నంతయుం గని దమనకుండు కరటకున కిట్లనియె. 104

ఉ. ఈవడఁ జల్లునెండ గళమెండ నఖండతరత్వరం బురో
భూవనదుర్గమార్గవిప్రుత్రికిఁ బోయెడురాజు వెల్వెలం
బోవుమొగంబుతో నిపుడు పుల్గుటితోఁ జనురేవ మెత్తఁగాఁ
బోవఁదొడంగె నేమిగతమో గతమోహ యెఱుంగఁ జెప్పవే. 105

క. అనిదంపూర్వపరాక్రమ, ధనుఁడ సుహృత్కుంజరముల దారుణమదమే
ర్చినయాతఁ డివ్విధంబునఁ, జన నవఘా యిప్పుడేమిచందమొ యనుడున్. 106

క. కరటకుఁ డిట్లను మనకీ, తెరువేటికి నుచితవృత్తి తెరువెఱుఁగనియ
న్నరుఁడు సెడుం భగ్నారస, తరుకీలంబూడ్చి తెగినతరుచరుభంగిన్. 107

క. నావిని కరటకుఁడును నను, గోవిదుఁ డిట్లనియె దమనకుఁడు నీతికళా
శేవధి యాకథ యెటు సెప్పు మా వినియెద ననిన నతని కతఁ డిట్లనియెన్. 108

చ. మితరహితారిమండలసమిజ్జయయుజ్జయినీపురంబున
న్వితతవిలాససంభ్రమణవిశ్రుతవిశ్రుతనామిటారి యా
యతనుకటారి కర్కశకుచాంగజితప్రకటారి నృత్తనం
దితశకటారి వారసుదతీమణి యొర్తు నటించు నున్నతిన్. 109

క. రాగరుచిగలుగుదెస నల, భోగినిమయిమఱుపుఁదిగిచి పొడితెమ్మర తృ
ష్ణాగతిదరలింపఁగ సం, భోగంబొసఁగుం భుజంగపుంగవతతికిన్. 110

చ. దినముదినంబు నిద్రకరుదెంచినవేడుకకానిగుండె ఝు
ల్లన జననిప్రయత్నమున నచ్చెలి వేఁకువ మేలుకాంచి మ
జ్జనవిధిఁదీర్చి సొమ్ములిడి చందనపుందళుకొంద జాళువా
పని నునుగాసెయు న్మైటయుఁ బార్వతిసేవకు బోవుతీవితోన్. 111

ఉ. ఆసఖిచూపుఁదూఁపుగము లంగములం దెరలింప నాసనో
పాసనశాసన ల్గుదిసి పావనభావనధావనంబుల
న్నోసరిలంగరాఁబడినయోగముఁ ద్యాగముసేసి దీర్ఘని
శ్వాసము నించు శీధుసరసాగరజాతహ నించుఁ జూచుచున్. 112

చ. చెలి నెఱిఠీవి దేవిగుడిసేవకువచ్చినవేళ వీటిలో
గలిగినకోడెకాండ్రు సిరిగందము కప్పుర మంబరంబుకుం
చెలుఘృతము ల్సితంబు విరిచెండులు పండులు కానుకిత్తు ర
చ్చలిమలపట్టి కొక్కదివసంబును రా రదిరాక తక్కినన్. 113

చ. నిలివెడు విత్తమిత్తునని నీతిఁజొసినఁగాని పూనియ
చ్చెలి కలనేనియు న్వెలుపుఁ జెప్పెద నీతికిఁ దుచ్ఛజాతికిన్
బలితునకున్ విచారపరిపాకవిమూఢునకుం దురుక్తికిం
బలువకు రోగికిం దురభిమానికి దానికి మద్యపానికిన్. 114

మ. ప్రవసీభూతభుజంగజీవ యాలయాపాజీవ దాక్షాయణీ
భవనక్షోణినటించు షోడశఘటీపర్యంత మంతంత మూఁ
డవయామంబున నొక్కనాఁడు ముకుచాయుం దివ్వెటీ ల్గొల్చిరా
వనధానంబున నింటిద్రోవఁ గలహంసానూనయానంబునన్. 115

క. వడతెంచుచుఁ ద్రోవ బడ, ల్పడఁ ద్రొక్కిన నెగసి యొరబాగయిఫణామే
ర్పడ నచ్చెరువుగ నచ్చెలి, కడకా లొకత్రాఁచుబాము గడఁకం గఱిచెన్. 116

క. తాలువులన్నాలాకీ, లాలంబులు చెమ్మగింప లగ్నత్వ్యోశా
జ్వాలం దూలి శతుక్రతు, నీలతమో నీలవాల నేలంగూలెన్. 117

వ. అట్లు విషధరవిషంబునం గ్రాఁగి కూలినకూతుం గని శోకించి నిమిషంబునుండక.

చ. ధనికులుగాన దానితలిదండ్రులు జాలెలుచించి యర్థకాం
చనము లవారిగాఁగ వెదచల్లి వసుంధర పేరుకీర్తియుం
గని మనువారలం బరమగారుడమంత్రకులం బొరిం బొరిం
గొనిచను దేర వార లలికుంతలచెంతలఁ జేరి నేర్పునన్. 119

సీ. కాటుపట్టున గత్తివాటులువైచి నిర్విషమూఁది మనకున్న విసివె నొకఁడు
ఘటపూర్ణమంత్రపుష్కరధార లెత్తించి గుణముగావకరోసి గునిసెనొకఁడు
కలితంబుఁగను దోయిఁగదియించి బ్రదికించుమ్రోవ దుర్ఘటమైనఁ దొలఁగెనొకఁడు
పసరునెన్నడునెత్తిఁ బ్రామి బెత్తమున నిట్టటుమోఁది పనికిరా కరిగెనొకఁడు

తే. కదియఁబడియున్నదొడలఁ గాలుజొనిపి, పాయఁబడఁజేసి తగుపాటి పలుచనైన
యౌషధీసారములఁ బోసియు విఘులావు, సేయుకుంశిన నొకఁడు లజ్జించి చనియె.

క. అప్పాట విషచికిత్సకు, లొప్పనిపదనములతోడ నొండెవ్వరికిం
జెప్పక వచ్చినచొప్పునఁ, దప్పక పోవుటయు నాసుదతితలిదండ్రుల్. 121

ఉ. కాంచనపుత్రినెత్తుకొని క్రమ్మఱిపోయి శివానివాసమున్
దుంచి నమస్కరించి యడలూఁతఁగ నిట్లనివిన్నవించి రో
పంచముఖప్రియా పడుచు ప్రాణముపచ్చిన మంటపంబుఁగ
ట్టించెదమమ్మ నిన్నుఁ బురుడింపగలేరుగదమ్మ వేలుపుల్. 122

చ. తరువుగదమ్మ మామనవి తావకపాదయుగంబు దేవతా
తరువుగదమ్మ యీపడుచు దక్కకపోయినఁ గన్నమాకు ను
త్తరువుగదమ్మ నీవరువుదానికి నిట్టియవస్థవచ్చు ట
చ్చెరువుగదమ్మ మమ్ము దరిఁజేరుపుమమ్మ త్రిలోకమాతృకా. 123

చ. అని తనువేఁడి పాడి నెగులొందక వారకయేడ్చువారలం
గని గిరిజాతజాత సుముఖత్వమున న్గడకంటిచూడ్కిఁ జూ
చిన నపుడేమి చెప్ప నటఁ జేడియ నిర్విషయౌచు నిద్రమే
ల్కానినవిధంబున న్దెలిసి కౌతుకసంపదఁదేల్చె నా ప్తులన్. 124

క. దేవీవరమహిమంబున, జీవితయగుపుత్త్రిఁగొనుచు గృహమున కానం
దావిలలీలం జని రా, జీవేక్షణ కిడిన మ్రొక్కు చెల్లించుటకున్. 125

గీ. అల్లనర్తకదంపతు లతులమతులఁ, బవనభుగ్భూషగృహిగృహప్రాంతమునకు

వననిజంబుల దెప్పించి రందులోన, స్థూలతరుకీలమగు నొక్కదూల మమరు. 126

ఉ. ఆనగగోపకంఠవనికావనజాతలతాచరన్మహా
వానరయూథ ముద్ధవిడి వచ్చి యొకానొకవేళ దారుణో
చ్ఛానటనంబొనర్ప రభసంబున నందొకక్రోఁతి యంత నా
హా నవలాఘనంబునఁ గృతాంతవశంబున దూల మెక్కుచున్. 127

క. వాలం బల్లార్చుచు నిరు, గేలం బిగియారఁబట్టి కీలము వడి ను
న్మూలింప నిఱికికొనియె, న్వ్రీలినయద్దారు వృద్ధవిడి ముష్కములున్. 128

క. ఇఱికిన విఘృతాస్యంబై, యొఱలుచుఁ బొరలు న్వడంకు నులుకుఁదలంకున్
మఱలుం బడు లేమం గపి, యురిఁ దవిలినపులుఁగువోలె నుడుగనియలఁతన్. 129

క. ప్లవగం బట్లలమటి మే, నవశంబగుటయుఁ ద్యజించె నసువుల నుచిత
వ్యవహారక్రియఁదెలియని, యవివేకికిఁ జేటువొందదా యొందైనన్. 130

క. హారిభుక్తశేషతరసం, బిరువురకుం గలదు చాలు నీపాటివృథా
పరచింతలేటి కన విని, గురుమాయాశాలి దమనకుం డిట్లనియెన్. 131

క. తనవారిఁ బ్రోచుటకు నొం, టనివారి వధించి వైచుటకుఁగా నృపులం
బనిపడికొలుచుట లేక, వ్వని కెద్దడి వుట్టె నన్నవస్త్రంబులకున్. 132

చ. అతివిరసత్వసత్వకుణపాదికపారణసారమేయ మూ
ర్జితజఠరాగ్ని శాంతియొనరించు సముచ్ఛ్రియ కృచ్ఛ్రి సంకుల
స్థితివెగడందియు న్వదకి సింహము మత్తకరింభుజించు నే
గతులబలానురూపఫల కాంక్షులుగా ధర నెట్టివారలున్. 133

చ అనుగతియుం గటీచలనమగ్రపదభ్రమణంబు వాలచా
లనమును భుక్తశేష కబళప్రదుఁగూర్చి యొనర్చు వేఁపి చ
య్యన బుధసాంత్వనోక్తి శతకాయుతసంఖ్యలఁగానిభుక్తికిం
దనకరమీదు కుంజరవతంసము నెట్టన నెట్టకేలకున్. 134

క. తను లోను లభినుతింపఁగ, మనఁగలిగినమనికి నిమిషమాత్రమె చాలుం
దనివిసనం బ్రేతాన్నముఁ, దిని యూరం గాకి బ్రతుకదే వేయేఁడుల్. 135

క. ఘనవిద్యావిక్రమజం, బనఘుండై కుడుచు నెవ్వఁ డతనిదివో భో
జనము పశుశిశు ఖురంబు, ల్దిను గౌశేయకము దానిడియుఁ గుడుపగునే. 136

క. అల్పమున నిండు శశపద, మల్పంబున నిండు మూషకాంజలికయు వెం
చల్పమున నిండుగుపురుషుఁ, డల్పమునం బూర్ణుఁడగు మహాత్ముఁడుగామిన్. 137

క. శ్రుతిశాస్త్రప్రకరబహి, ష్కృతము నయానయవివేకరిక్తము కుక్షి

స్థితిజాగరూక మేయున్నతిఁ జెపుమా మనుజపశువునకుఁ బశువునకున్. 138

క. కసవుదినుఁ గూడుదెమ్మని, కసరదు బరువిడినమోయుఁ గర్మనమునకున్
విసువదు మార్మొడ్డాడదు, పసరమునకుసరియె మనుజపశు వెప్పటికిన్. 139

క. అన విని కరటకుఁ డతని, న్గనుఁగొని యిట్లనియె దమనకా విభునకుగ
ల్గినదండనాథులము దగ, మన కీవ్యాపార మనభిమత ముడుగదగున్. 140

వ. అనిన దమనకుండు. 141

క. పరమస్వతంత్రులయిభూ, వరుసన్నిధి మంత్రులుండవలె నమ్మంత్రుల్
పరతంత్రులయినఁగలవే, పురుషార్థము గౌరవము ప్రభుత్వము యశమున్. 142

క. గ్రావాగ్రమునకు భూరి, గ్రావం బెక్కింప భరముగా దది ధరకున్
ద్రోవఁ బ్రయాసమె యున్నతి, కయిపలెబో టధమవృత్తి కది యేమిటికిన్. 143

క. తనకున్ హృదయము పశమై, యనుచరుచందమున నుండు నది యేమియొకో
మనుజుఁడు గౌరవమొల్లక, ఘనలాఘవదంశితుండుగా నీక్షించున్. 144

క. అనిచెప్పి మఱియు గరటకుఁ, గనుఁగొని దమనకుఁడు పలికెఁ గంటే పంచా
ననసార్వభౌమునకు నా, వనమొప్ప దిదేమికారణము నేఁ డనుచున్. 145

క. అదివిని కరటకుఁడు మదిం, గదిరిన యచ్చెరువున న్మొగము జూచి యహో
యిది నీ వేతెఱుగన నెఱుఁగుదు పన నాయనకు దమనకుం డిట్లనియెన్. 146

మ. మతినేనిచ్చినఁగానిలేదు చన దాత్మశ్లాఘనామానసం
బితరాకారవిచేష్టితార్థముల నూహించు న్ధరిత్రిం బశు
ప్రతతుల్నేర్చు నుదీరితార్థముల దిక్ప్రఖ్యాతమేధాసమ
న్వితుఁడై పల్కలు పండితుం డకట వానిం బోలఁడే చెప్పుమా. 147

క. చతురుఁడుగనుఁ బతిచేష్టా, గతిఁ దెలిసితిననిన నతఁడు కాఁగా నోస
మ్మతిగాదునాకు సేవా, స్థితినీకెఱుకపడుఁ గుశలచిత్తములేమిన్. 148

వ. అని కరటకుండు పలికిన దమనకుం డతని కిట్లనియె. 149

క. భూషింప మెచ్చు లోకము, దూషింపం జంపఁజూచుఁ దుది నదె విద్వ
ద్భాషితుని నన్ను నేలా, దూషించితి వైన నేరుతుం బతిఁగొల్వన్. 150

క. నృపసంశ్రయమున నా కతి, నిపుణతయేపలనలేదు నీవయనియెదో
యిపు డెవ్వరేని శత్రుం, తప యోరిమిలేక యనియెదరో ననుఁ జెపుమా. 151

క. అను దమనకునానకము, న్గనుఁగొని కరటకుఁడు పలికెఁ గాదా మును నీ
పనవసరంబునఁజనవో, కినుక న్నిను విభుఁడు గోపగింపఁడో నెరయన్ 152

సీ. అఁకొని భుజియింప నరుగువేళ నొకింత యొడలికి సుఃఖాత మొందవినపుడు

భూరినిద్రాభరంబున సోలుచెడఁ గులస్త్రీలతో నలిగి విచ్చేసినరతి
రతికి నవ్విభ్యాఱుగతి శరక్షతుఁడైన యవసరంబున వేఁట లాడి యలసి
ధరణీరుహచ్ఛాయ లరయుచోఁటఁ బిపాస సలిలమన్వేషించుసమయమునను

తే. మజ్జనంబాడుపట్టున మౌననియతి, నర్ధమీలితలోచనుండై పురాణ
పురుషు ధ్యానించునకాలమున నృపాలుఁ, జేరరాదండ్రు తద్జ్ఞులు సేవకులకు.

క. మఱచితివే యన దమనకుఁ, డెఱుఁగుదునను జీవధర్మ మిట్టిద భటుఁ డే
తెఱఁగున నేనియు నరవరు, కుఱఁగట రేపగలుఁ గాచి కొలువఁగవలయున్. 154

క. అతి కంటకుఁడైన విసం, గతుఁడైన గుజాతుఁడైనఁ గానీ లతలున్
సతులు ధరిత్రీపతులుం, జితవైరీ యల్లికొండ్రు చేరువనున్నన్. 155

క. కోపప్రసాదచిత్త, వ్యాపారము లెఱిఁగి కొలిచి వర్తిల్లుభటుల్
భూపాలబాహుశాఖా, రోపితులై యుండ్రు చనవు రొక్కం బగుటన్. 156

క. అన విని కరటకుఁడు దదా, ననము నిరీక్షించి పలికె నయ తత్త్వనిధీ
వినవలతు నాదరంబునఁ, దన కిఁక నీవేమిచెప్పెదవు తరువాతన్. 157

క విత్తునవిత్తుంబలెఁ బ్ర,త్యుత్తర ముత్తరమువలన నుదయించు భవ
చ్చిత్తమునీతికళాసం, పత్తికిఁ బుట్టిల్లుగాదె పరికింపఁగాన్. 158

వ. అను కరటకు పలుకు లాకర్ణించి యతం డిట్లను నీతిపోషణంబులు దుఃఖశోషణంబులుగావె భవద్భాషణంబులు నప్రాప్తకాలవచనం బెవ్వరికి నశుభంబుఁజేయదు.

క చతురలవలె నృపసేవా, వ్రతులకు నప్రాప్తకాలవచనంబు బృహ
స్పతియంతవాఁడుబలికినఁ, బ్రతిపీరధ్వంసి హాస్యపదనిరతుఁ డగున్. 160

వ కావున దేశకాలేంద్రియ పరిపక్వంబులెఱింగి యుచితజ్ఞుఁ డగునతండు విన్నపంబు చేసికొని నిజప్రయోజనం బీడేర్చుకొనుచు. 161

క. తనకేవిద్యాభ్యాసం, బునముఖ్యఖ్యాతిలాభములు సిద్ధించున్
ఘనతరముగఁ గులపురుషుం, డనఘుండయి నేరవలయు నాసద్విద్యన్. 162

క. కలగుణరూపప్రజ్ఞా, బలములచే నేమి వానిఁ బ్రకటింపరు భూ
తలపతులు సములు విషములు, దలపోయ నఖర్వపర్వతంబులభంగిన్. 163

క. కావున నవనీవల్లభు, లేవిధమున నుండి రేమిహితబుద్ధిన్నే
వావృత్తినూది వర్తిలఁ, గావలయు నృభటుల కనినఁ గరటకుఁ డంతన్. 164

క. అగు నగుఁ బోపొ మ్మప్పని, మొగమునను న్నాఁడు రాజుప్రోలకుఁ దేర్పం
దగుతతి మేలయ్యెడునో, సుగుణీ నీకనివ నతఁడు సొం పెసలారన్. 165

చ. మొలపునఁ జేరఁ జేరి ప్రణమిల్లి వినీతతి నిల్వఁ జూచి పిం

కరటకుఁడువల్కె నోదమనకా చనుదెంచితివేమి నావుడు
జ్వలమతి నాతఁ డిట్లను భవచ్చరణంబులఁ గొల్వవచ్చితి
న్నెలసము దీనికంటెఁ బరికింపఁగ నెయ్యది నాకుఁ జెప్పుమా. 166

క. సచివకుమారుఁడ నగు నా, కుచితములగు పనులు గలిగియుండుఁగదా నా
వచనము విన దేవరకును, రుచియగుఁగద కార్యతత్త్వరుఁడఁగద మొదలన్. 167

మ. శ్రుతికండూయన రుక్ప్రశాంతియొనరింనుం దంతనిర్ఘర్షణ
క్షితికిం జాలుసఖాగ్రభిన్న యవసచ్ఛేదంబు విశ్వంభరా
పతికార్యంబుల నప్రయోజకుఁడె ప్రాగల్భ్యానచాతుర్యశౌ
ర్యతతోపాయన యాప్రియాలపనమేధాకారశీలుం డిలన్ 168

చ. పరమశుచి న్సమిద్ధ్యుల నపాథమహోమహు నుత్సవక్రియా
స్థిరు నిరసించి క్రిందుపడఁజేసినఁ గ్రిందుపడంగనేర్చునే
కరలి యొకప్పు డేని దలక్రిందుగఁబట్టిన నూర్ధ్వకీలుఁడై
దరికొన కంబుసంభవుఁ డగ్నిశిఖుఁడై నశియింపనేర్చునే. 169

చ. హాలికుఁడు విత్తు చేనఁ బనునప్పు డెఱుంగఁడు చాలు చక్కనై
తలకొనఁ జూచి మంచిదిగదా యనుఁ బిష్టు నట్లు రాజు సాం
పలరఁగఁ గూర్చునప్పుడు భటాలినెఱుంగఁడు ప్రస్తుతంబున
న్నెలసముఁ బూని నిల్వఁ బరికించుఁ బ్రయోజకుఁ డందు నెంతయున్. 170

తే. గీ. అతిశయస్థానయోగ్య నీచాసనమున, ననుమవిశ్వంభరావల్లభునకునింద
మస్తకోచితకోటీరమండనములఁ, గాళ్ళఁదొడిగినయప్పుడ్త్యుఁగఁ గూటియనరె. 171

ఆ. వె. అధమువృత్తి కధికు నమరించుపతి దిట్టుఁ, గుడుచుఁగాదె యారకూటకటక
కలితమణికి నిందగాద పౌనర్భవ, మత్సితుండు నిందఁగుడుచుఁగాని. 172

క. శిరమున మకుటము రశనా, భరణము కటి నూపురంబు పదమునఁ బోలెన్
గురుబంధుభటులనిల్ప న, మరు నుత్తమ మధ్య మాధమస్థానములన్. 173

చ. పురుషవిశేషలీల విరిబోఁడియు వాలు విపంచి శాస్త్రమున్
దురగము వాణియు న్నరుఁడు దొడ్డతనంబువహింతు రట్లకా
పురుషవిశేషలీల విరిబోఁడియు వాలు విపంచి శాస్త్రముం
దురగము వాణియు న్నరుఁడు దొడ్డతనంబు వహింప రుర్వరన్. 174

వ. ఇది సృగాలమాత్రంబు దీనిచేత నేమి యని నన్నవజ్ఞ సేయకుము. 175

క. హరిసూకరరూపంబున, హరిణాదిమృగాకృతుల మహర్షులజంబయి
హరిసుతుఁడు పూజ్యులైయుం, డరె వారలగౌరవంబు గరిమపడియెనే. 176

వ. అశక్తుండయిన భక్తుండును భక్తిలేనిశక్తుండును నప్రయోజకులు త్యాజ్యులు నేను బరమభక్తుండ శక్తుండ నత్యాజ్యుండ నన్ను గౌరవము సేయుము. 177

చ. పతినయదూరుఁ డైనభటపంక్తియు నీతికిఁ బాయుఁ దత్పరిధా
నత బుధులుండరా బుధజనంబులు లేమి నధర్మ మూర్జిత
స్థితిఁగను నయ్యధర్మమునఁ జేసి యఘంబులు పుట్టు వానిచే
నతులవిపద్దశ ల్వొడము నవ్విపదాయతి రాజ్యము జ్జెడున్. 178

వ. అని దమనకుండు పలికినఁ బింగళకుండు నతనిం బ్రసాదపురస్సరాలోకంబుల నాలోకించి. 179

ఉ. వానికి నెన్నికం దగినవాఁడవు రాజ్యము నీనయంబునం
జేసెదఁ గాదె నిన్నడవ సేవకులెవ్వరు నాకుఁ బెద్దవి
శ్వాసము నీయెడం గలదు శక్తుఁడు భక్తుఁడు నిన్నుఁ బోలఁ డో
హో సఖ విన్ననై వదన మొప్పక వచ్చితి వేమి చెప్పుమా. 180

క. నావిని దమనకుఁ డను దే,వా విన్నప మొకటి వారివాంఛ న్వడిగాఁ
బోవుచు నిలిచితి విదియే, లా విన్నని మోముతోఁ గలంగినమతితోన్. 181

వ. అని విన్నవించిన దమనకునకుఁ బింగళకుం డిట్లనియె మచ్చరణ్యం బగు నియ్యరణ్యం బపూర్వసత్త్వాధిష్ఠితంబయి యున్నయది యట్లగుట చిత్తచాంచల్యంబుఁ బుట్టించుటయు దానం జేసి యంగవైకల్య మావిర్భవించె నెట్లనిన విలయసమయసముజ్జృంభమాణ పుష్కలావర్తక విధంబున శబ్దగ్రాహకంబులకు నధికతాపం బొనర్చుచున్న యది యద్దిక్కున నొక్క యపూర్వదుర్వారఘోషంబు వీతేర నాకర్ణించితి మంత్రప్రతిబద్ధశక్తి యగు ఫణాధరంబు విధంబున స్రుక్కితి నీ వాకర్ణింప వొకో శబ్దానురూపబలమహత్త్వం బగుసత్త్వం బచ్చోటఁ గలిగియున్నది మదీయరాజ్యంబునకు హాని వాటిల్లకుండునే యని నిట్టూర్పు నించు నప్పంచాననునకు దమనకుం డిట్లనియె. 182

క. జలముల సేతువు బెడిదపుఁ, బలుకుల భీతుండు చెనటిపాడిం జాతిన్
జెలిమి రహస్య మొనర్పం, దలఁపనిపని చెడు నిగూఢతరమంత్రంబున్. 183

క. నీతెరువ నిలచరన్మహి, జాత లతాఘాతభగ్న సంగరభేరీ
జాతరవశ్రవణమహో, జాతరహ్యాజ్జీర్ణజంబుకము కథ యయ్యెన్. 184

క. నావిని పింగళకుఁడు నయ,కోవిదు దమనకునిఁ జూచి గుణరత్నసము
ద్రా వినియెద నీకథఁ జెపు, మా వాచాపాటవం బమర నా కనుడున్. 185

క. దమనకుఁ డిట్లను పరవి, క్రమవిక్రమసింహపురనికటవటకాంతా

రమున నొకనాఁడు గాఢ, క్రమమున నే నరిగి తిరుగఁ గాఁ గట్టెదురన్. 186

ఉ. జన్యము కాంతసంతపరుషత్విపాతి బృహద్వపాళిరా
జన్యము హాస్తిమ స్తతరసత్కృతజద్రసలుబ్ధదైత్యనా
గ్జన్యము భానుభేది ఘనసాహసపూజనరాజమానప
ర్జన్యముఁ జూపెఁ బర్యుషితసామజవిప్రసమేతవాతముల్. 187

చ. కదన మొకింతచేర వరుగ న్విలుగంబడి యున్న తేరులుం
బ్రిదిలుటలేనియేనుఁగులు బెంటలుఁగొన్న జివాల్గురాలు పె
న్గదురుడివోని నెత్తురులు గాఢపు టెంపుఁ గ్రాఁగి చిక్కనై
పొదలు మెదళ్లు నాంత్రముల స్రోవులుఁ జూచి ప్రహృష్టమూర్తినై. 188

వ. మఱియు నక్కలను సమున్మీలితపుండరీక వ్యాకీర్ణం బగుటఁ గాసారంబును నఖం డఫలకాండమండితంబగుట నారామంబును నమోఘప్రాసవిలాసం బగుటఁ గర్ణా టక ప్రబంధంబును ననంగవిహారయోగ్యం బగుట మధుమాసంబును దష్టకబంధ వాహినీబంధురంబగుటం గ్రీష్మసమయంబును నవ్యక్తతారకవ్యూహం బగుట నహ ర్ముఖంబును బహుద్విజవిరాజమానంబగుట యాగంబును ననాత్మజ్ఞపారంపరీసం పూర్ణం బగుట గంజానిలయంబును విభాగీకృతచరణంబు గావున శ్లోకపతనంబును గర్ణశల్యసైంధవభీష్మదుర్నిరీక్ష్యం బగుట సుయోధనాయోధనంబును బ్రయుక్తశక్తి పాతనిర్ధూతధరాధిపప్రాగల్భ్యంబగుటఁ గుమారసమారంభంబును నసఖండమనో హరం బయి యోషాభాషావిశేషంబును రసాభిసుప్తపురుషోత్తమంబై శరత్కాలం బును ననుకరించె నప్పుడు. 189

క. దూరప్రాణధురీణము, హారణమున నేమిచెప్ప నాశ్చర్యకరం
బయిరోదసితో విను మొక, భేరీనినదంబు కర్ణపిశిత మగల్చెన్. 190

తే. భయము దోఁతోఁడ ముక్కునబంటి యయ్యెఁ
గెరలు జఠరాగ్ని గుములుచుఁ "గింకరోమి
యాగతోస్మికృయాస్యామి" యని యడలితిఁ
బలలపారణకరుగంగఁ బాటుగామి. 191

ఉ. ఎంచినభీతి మే న్వడక నేనొక యించుకసేఁపు బుద్ధిశం
కించి యిదేమి యొక్కొ పరికించెదఁ గా కని చేరి ముందర
న్గాంచితి వాతపోత పరికంపితభూజలతావిహారి న్దిశ
ల్వించుమదనంబునీను నొకజీర్ణసమిద్ధతభేరిఁ జేరువన్. 192

సీ. కనుఁగొని చర్మసంగతదానవుగ నిశ్చయించి మెల్లన నంఘ్రి లిడుచు నరిగి

కదిసి తద్భేరీముఖము వ్రచ్చి లోపల నరయ నిర్మానుషమగుట మేను
పొదలఁ జేసె నామహాభోజనం బని చని వడి మేనుమ్రుఁచి వల్లడలుసూచి
కరట గృధ్రోలూకకంకాదుల శవామిషాదులఁ బోలి సేనాఢ్యలీల
తే. దంతిపలల మశ్వతరసంబు శాక్వర, క్రవ్యముష్ట్రి మాంస ఖండ కాండ
మొలసి యున్న నరులపాలయును దిని గాఢ, కౌతుకమున నుంటిగాఁదె తొలుత.

వ. రనశ్రవణమాత్రంబున నేమి తెలిసికొని నిర్భయుండవు? ఏగుము శబ్దం బేదిక్కున
నాకర్ణింపంబడియె నద్దిక్కునకు నన్నుంబనుపు మంతయుం దెలిసి వచ్చెద ననుట
యుఁ బింగళకుం డట్లచేయుమనియె నట్లు నియుక్తుండై దమనకుండు సకలమృగ
సంచారఘోరం బగు యమునా ప్రాంత కాంతారంబున కరిగి పురోభాగంబున. 194

ఉ. చేవఁజిగుర్చుశృంగములు శృంగములం బ్రకటింప భూరిశో
భావహనైకపాదములు పాదముల న్దలఁపింప జంగమ
గ్రావముభంగి భానుభవకచ్ఛమున న్విహరించువాని సం
జీవకుఁ గాంచి మ్రొక్కి నిలిచె న్మృగధూర్తకుమారుఁ డయ్యెడన్. 195

వ. అట్లు వినీతత్వంబు నెరపి కైవారంబుసేసి యతనిచేత నాగమనకార్యం బడుగం
బడినవాఁడై. 196

చ. హృదయముపల్లవింప నతఁ డిట్లను నెంతయు సమ్మదంబునం
బొదలుచు నీసమాగమము పూర్వము నీ కెనయైనవానితోఁ
గదిసి యఖండసఖ్యమునఁ గాలముతీతముగా నొనర్ప కి
న్నదిదరి నొంటి నుండఁదగునా మృగనాథులులేర మైత్రికిన్. 197

చ. అనఘచరిత్ర పింగళకుఁడ న్మృగరాజిటనుండు నమ్మహా
ఘనుని ప్రధాననందనునిఁగా నను బుద్ధినెఱుంగు నీకు నా
యనకు ఘటింతు మైత్రిసమయం బిదె న న్బనిఁగొమ్ము మారుతం
బనలము గూడినట్లయగు నాతఁడు నీవును జెల్మిసేసినన్. 198

క. అన విని దమనకునిఁ గనుం, గొని సంజీవకుఁడు పలికె గొబ్బున మరలం
జని చెలిమిసేయుమా మా, కనుకూలత మెఱయ మీమృగాధిపుతోడన్. 199

క. పొమ్మన నెమ్మనమలరం, గ్రమ్మఱ మృగధూర్తకులశిఖామణి చింతా
సమ్మూర్ఛితాకృతింబడి, నమ్మేర న్గాంచి వినతుఁడై నిలుచున్నన్. 200

క. కనుఁగొని పింగళకుం డి, ట్లను సనయా మంత్రితనయ యచ్చోటికి నా
యనుమతిఁ గైకొనిపోయిన, పనియేమియొనర్చె తనినఁ బలికె నతండున్. 201

క. పొనపొనఁ గానకు దేవర, పనుపునఁ జని యచటఁ గంటిఁ బ్రళయాంతరట

ధ్వననినదు గోత్రగిరినిభ, తనువభ్రంకషవిషాణధరుఁ గట్టెదురన్. 202

వ. భవత్కర్ణశూలాయమానం బగునప్పటిభయంకరధ్వానంబు నిన్ను నుద్దేశించి చేయు
టగా నెఱుంగుము. 203

క. అలఁతులఁ బోరిఁ గొనరు మహా, బలు లాహో ఘనులఁ గాని పవమానుఁ డిలం
బిలువెఱుకునె బహుశాఖా, కులగగనస్పంది వృక్షకోటులుదక్కన్. 204

క. ఈదృశబలవంతుని నీ, పాదముల కుపాయనంబుఁ బట్టెద లేదా
నాచెసనిచ్చిన నిర్మ, ర్యాదప్రేమమున సింహ మాతని కనియెన్. 205

క. నీ వనఁగ నంతవాడవె, కావా సంరావభీదురఘాతంబున దై
ర్యాళినగల్చిన యబ్బలిఁ, దే వేగమె యనిన నతఁడు దెచ్చె న్వచ్చెన్. 206

క. వచ్చినసంజీవకునకుఁ, బొచ్చెములే కలమృగాధిపుఁడు సౌహార్ద్రం
బచ్చుపడ నెదురుసని కొని, తెచ్చి సద్వృషాసనప్రతిష్ఠితుఁ జేసెన్. 207

తే. తనువుఁ బ్రాణంబువిరియునుదావిభాను, డాతపముఁ బోలె నలమృగాధ్యక్షుఁ డతఁడు
పాలునీరును గూడిన పగిది నుండి, రతిశ యస్నేహమునను నయ్యడవిలోన. 208

వ. ఇట్లు పింగళక సంజీవకు లన్యోన్యప్రసన్న స్నేహప్రవర్ధమానులయి యొరుల కవ
కాశంబీక యేకగ్రీవంబయియుండ ననుజీవులు పొలపెట్టులేక యాఁకట నారట
నొంది యొండేనియుం బోవ దానదిపడిన నచ్చెట్టమసంతం జింతిలి దమనకుండు కర
టకుఁ జేరంబోయి నిట్టూర్పునిగిడించి తలవంచుకొనిన నతం డతని నాలోకించి.

చ. దమనక యోపలేనని దప్పునె యిప్పను జెట్ట నీనిమి
త్తమున జనించెగాదె పతిదండకు ని న్నొరు లేగుమంచు హ
స్తముఁ దెమలించిరో కుడిచి సమ్మతినుండఁగ దైవమిచ్చునే
సమకొని వీరి కిద్దఱికి సఖ్యము సేయకయున్న సాగదే. 210

ఉ. యెవ్వ రెటుండి రేమి మన కేమి ప్రయోజన మంచు మున్ను నే
నవ్వలఁ జూటిమోపి పతి నారయునప్పుడు నీకుఁ జెప్పనే
యవ్వచనంబు లిప్పుడు యథార్థములాయెగదా భుజించువా
రెవ్వరు నీవె కాక మఱి యేమనలేక స్వయంకృతాగమున్. 211

క. చేసినయంతయుఁ దడయక, చేసేతం గుడువుమనినఁ జింతానలకీ
లాసంతాపితుఁడై మే, ధాసంగతుఁ డతనిఁ జూచి దమనకుఁ డనియెన్. 212

క. కృతకేతరవచనంబుల, గతి నీపలుకులు యథార్థకథనంబులు నా
కతమున నకటా యీదు, స్థితివుట్టెం దీని కేమి సేయఁగవచ్చున్. 213

ఉ. ఈతఱి నక్క వెక్కసపు టేఁడికకయ్యముచేతఁ దొల్లి చే

నేతఁ బరిగ్రహించి యతిశిష్యునిచే నొకనేఁతకానిచే
దూతికనొచ్చె నాత్మకృత దోషమునన్నద నావు డుల్లస
త్కౌతుకపల్లిపల్లటిలఁగా నతఁ డాతనిఁ జూచి యిట్లనున్. 214

క. అది యెట్లు వి స్తరింపం, గదె యాకర్ణింతు సకలగాథాబోధా
స్పదహృదయ యనుడు వికస, ద్వదనుండై కరటకునకు దమనకుఁ డనియెన్. 215

క. యువనాశ్వ నగరమునఁ గే, శవశర్మ యనంగ నొక్క సన్యాసి మఠం
బవలంబించి యశిష్య, ప్రవరుండై యుండె భైక్ష్య భక్షకుఁ డగుచున్. 216

క. కల దాసన్యాసికి బహు, కలధౌత సువర్ణపూర్ణ కంథసదా యు
బ్బలుగుయతి మరపు మోసము, గలనేనియు లేక దానిఁ గని రక్షించున్. 217

తే. స్నాన మొనరించునప్పుడు జపము సేయు,నపుడు కరపాత్రమున భిక్ష మడుగునపుడు
పండునపుడును బొంతపై నుండు మనసు, బీదగతిచినబూరె యబ్భిక్షునకును. 218

క. చిరకాల మివ్విధంబున, నరిగిన నాషాఢభూతి యను ధూర్తవరా
మరసుతుఁడు నేరి కంథా, హరణేచ్ఛ న్యతికి శిష్యుఁడై సేవించెన్. 219

ఉ. ఆయతి యొక్క నాఁ డొక గృహంబునకుం దగ భిక్షచేసి రాఁ
బోయిన వాఁడు వెంబడి నెపోయి భుజించి మఠంబుఁ జేరి యా
చాయ నిజోత్తరీయపరిషక్తతృణాగ్రము గాంచిపట్టి నా
రాయణ కృష్ణయంచు గురుఁ డద్భుతమందఁగ మ్రొక్కి నెవ్వగన్. 220

క. వెలవెలనిమోముతో మఱి, యొలుఁగొందఁగ గురునిఁ జూచి యెవ్వరి కొందుం
గలుగనికలుషము నా కిద, గలిగె నయో యెట్టిపాపకర్ముఁడ నొక్కో. 221

క. అని మడమలు మోపక పడిఁ, జని కపటవిచారశీలుఁ జపలాత్ముని శి
ష్యునిఁ దిరుగఁ బిల్చి మదిఁ గి, ల్కొనినమహాద్భుతముతోడ గురుఁ డిట్లనియెన్.

క. నిను నేకలుషము వొదివెన్, జనఁ గారణమేమి సరభసంబున నాతో
వినిపింపు మనినఁ దత్పద, వనజంబులవ్రాలి యతికి వాఁ డిట్లనియెన్. 223

క. గురునాథ నిన్ను భిక్షా, గరిమంబునఁ జాలఁ దృప్తుఁ గావించినభూ
సురునింటిపూరి పసనో, పరిదవిలెం దీని కంటెఁ బాపముగలదే. 224

గీ. మగుడ నీపూరిపుడకఁ దన్మందిరమునఁ, గూర్చి క్రమ్మఱ నిష్పాతకుండ నగుచు
వచ్చి సేవింతుఁ ద్వత్పాదవనరుహముల, భక్తి నామీఁద గలదేనిఁ బనుపు మటకు.

క. పావనుఁడఁగాక యేవిధి, సేవించెద నిన్ను నోవిశేషవిధిజ్ఞా
నావుడు యతి విస్మయసం, భావితుఁడై వానిఁ జూచి పలికెం బ్రీతిన్. 226

చ. కలుషములేదు పూరిపుడకన్ ధనమో కనకంబో చీరలో

వలదటుపోవ నిల్వు మన వాఁడు కృతాంజలియై కనుంగవం
జలజలనశ్రువుల్దొరుగ సన్నుతిఁజేసి యతీంద్ర యివ్విధిం
బలుకకు మెట్టులేనిఁ దృణభంగమునేఁ డట వైచివచ్చెదన్. 227

క. నావిని యతిబంధువుఁ డతి, పావనుఁగా వాని నగచి పనిచె నతండున్
వేవేగ నరిగి తృణమొక, చోవైచి భజింపఁ దొంటిచొప్పున వచ్చెన్. 228

వ. ఇట్టి యుపాయాంతరంబుల సంత్యక్తపరద్రవ్యయస్థితికి విప్రపత్తిగలుగకుండఁ గొండొకకాలంబు నమ్మఁదిరిగిన నెళవెఱుఁగక నేయిపూసినకత్తి యగుటఁ దెలియక గోముఖవ్యాఘ్రంబగుట వివరింపనేరక యత్తులువం బరిగ్రహించి వసుగర్భయగు కంథఁ జేతికిచ్చి యలుఁగులఁదిరుగుట గజంబును నరువులఁ బెంచుట మారుతభుగ్దష్టుని భువనవికారంబగుట నగజారమణుని విలాసభాసమానంబగుట వెలయాలిని దుర్గాభైరవ పాలితం బగుట నవిషుస్థలంబును సరసం బగుట విద్వత్ప్రబంధంబును ననుకరించి యచ్చెరువుసేయు చెరువునకు ననుష్ఠానార్థియై చనియె నయ్యవసరంబున. 229

క. అప్పాపజాతి మస్కరి, యెప్పుడు దనచేతికిచ్చె నేమటి మఱి వాఁ
డప్పుడపోయె ఘనంబుగఁ, గప్పినతమి కంథనొండుగంత న్గొనుచున్. 230

క. బొంతగొని నిజనివాసము, పొంతకు నాషాఢభూతిపోవుట మదిలోఁ
జింతింపక నికటతటా, కాంతమునకుఁ జనిన యతని యతిఁగన్గొనఁగన్. 231

సీ. కఠినశృంగాగ్రసంఘటితలోహపలాశఘుళిఘుళోత్కృతులనక్రములు బెదర
నన్యోన్యసంపాతహతి ప్రస్ఫాలభాగమున శోణితము బ్బి కరుడుగట్టఁ
జించికాంగారరోచిర్ధురా ఘోరేయ నేత్రాంతముల గొప్పనిప్పు లురుల
ఖురశిఖాటంకసంక్షుభితగోత్రోత్థితస్థదవనిరేణువుల నీరసలుగాఁగ
తే. గళవినిర్గతఘోరభూత్కారనినద, మమితకేదారచరపతంగములఁదఱుమఁ
బరమగర్వోన్నతములురభ్రములు రెండు, చెఱువుకొమ్మునఁగయ్యంబు సేయుచుండె

క. తిరుగక విఱుగక యాభీ, కరమేషము లాహవంబుఁ గావింపంగా
సరిరంటినడుమనెత్తురు, దొరిగెం బ్రవహించె నిలిచె దొప్పలుగట్టెన్. 233

క. ఆనెత్తురానుతమి న,చ్చో నొకజంబుకము నడుమఁజొచ్చి తదీయా
మానవిషాణశిఖాహతి, చే నెమ్ములువిఱిగి సొరిగి జీవమువిడిచెన్. 234

క. జంబుకము మేషయుద్ధము,నం బడుటయనంగ నిది జనస్తుతవినుము
ల్లంబమర మఱియుఁ జెప్పెదఁ, బంబినతాత్పర్యమేరుపడ సన్యాసీ. 235

వ. అట్లు స్వాపరాధంబున మేషవిషాణసంపాతసంఘాతంబునఁ గొలెమ్ములువిఱిగి కాలమ్ముసేసిన సృగాలమాత్రమ్ముం జూచి యిట్టిద నావివేకంబు స్వాపాద్యవస్థలయం

దును మోసపోవక రక్షించిన చిరకాల సంచితార్థంబు శిష్యునిచేతి కిచ్చి వచ్చితి శంకాయత్తం బై చిత్తంబు తత్తరించుచున్న యది యేమియగునొకో యనుచు ననుష్ఠానంబునకుం బోసి యబ్బడుగుసన్న్యాసి నిప్పుఁ ద్రొక్కినక్రోఁతిపడువున మడిమ లూఁదక మఠంబునకువచ్చి. 236

క. తానకమున నిజశిష్యుం, గానక యాషాఢభూతిగా రారా తే
రా నాసొమ్మనిచీరు, న్దీనత నోరెండ యతి యతివ్యథతోడన్. 237

చ. వెలవెలనై మఠాలయమువెల్వడుఁ దాపనిషక్తకంఠుఁడై
కలఁకులఁజూచు భూమిసురగేహము లారయు నేఁడు భిక్షుకై
తెలతెలవేగి శిష్యుఁ డరుదేఁడుగదా కనుఁగొన్నఁ జెప్పరే
కలుషవిదూరులార పనిగ ల్దను నుస్సను నూర్చు హాయనున్. 238

క. తప్పెనుగార్యం బను నిఁక, నెప్పుడువీక్షింతునను నిఁకెక్కడనున్నాఁ
డెప్పుడు చేదొరికెం ధన, మప్పుడె కపటాత్ముఁ డరిగె నని తలయూఁచున్. 239

క. అడిగినవారిం గ్రమ్మఱ, నడుగంజనుఁ జనిన కడకు నతఁ డార్తుండై
గుడిగుండమునక పల్లియ, పడుసరనాకరయుఁ జెఱిచి పఱచినశిష్యున్. 240

క. ఈగతి యతి వేసటలే, కాగడపుంబోక శిష్యు నారసి యచ్చో
శేగుఱుతునుగానక యా, భోగతరశ్రాంతి నొక్క పురమున కరిగెన్. 241

ఉ. స్నానము మొనర్ప దీమసముచాలక నోంకృతి నోరఁ బేర్కొనం
గానక భిక్షుకుండు దిరుగం జరణంబులురాక ద్రవ్యకం
థానసుఁబాసితే యనుచుఁ దాపభరంబున మిన్నులింప లో
లో నడలూన రేయుఁబగలు న్విలపించు నతండు దీనతన్. 242

ఉ. గాసిలి పట్టుఁగోల్పడిన గాలిపిశాచమువోలెఁ గష్టస
న్న్యాసి దురంతతాపమున నారటమందుచు నార్జితార్థకం
థాస్మృతివాడలం దిరుగుఁ దాంతదశంగృశియించి యచ్చలో
వేసరి నిల్చె సంజకడ వేఱొక సాలియవానిలోఁగిటన్. 243

క. నిలిచి యతి కొంతచింతం, బలవించుచుఁ బంచ తిన్నెపైఁబడి పలకే
ల్దలక్రిందంజేరిచికొని, వెలవెలనై నిద్రలేక వేఁగునునుండెన్. 244

వ. అంత. 245

ఉ. వెంగలిపోకఁ బానగృహవీథికి నెక్కఁటి నేఁతకాఁడు వో
వంగనుజూచి దూతిపిలువం దలవాకిటిఁబాసి పల్లవా
లింగనకాంక్షఁ దన్మహిళ లేఁగనుముబ్బునఁ దక్కఁబెట్టి తు

చ. ఉడుగనివంత నింతతడ వ్రాఁటలేక పరాకువోలె మే
నడిచిపడంగనున్కఁ గహనాంతరచింత జనించె నంఘ్రులి
వ్వఁడకున నూదసైఁపవు కృపానిధి మందరకాంకు డుండు న
క్కఁడకరుదెంతు నింకడరఁగా ననుఁదోడ్కొని పొమ్ము నావుడున్. 74

వ. లఘుపతనకుం డిట్లనియె. 75

ఉ. కాదన నేలవచ్చెదవుగాక సఖా వెఱఁ గావహిల్లె ని
ర్వేదము నీకు నెట్టులొదవె న్వివరింపుము నావు డాత్మసం
పాదిహిరణ్యకుం డనియె బల్కఁగ కిందెడలేదు నెవ్వడిం
బోదము పోయి యావిపినభూమి సమస్తముఁ దెల్పిచెప్పెదన్. 76

క. నావుడు దత్తప్రతిభాషావర్గం బగుచు వాయసస్వామి నయ
శ్రీవిభవు మూషకాగ్రణి, వే వాతన్గఱచుకొని దివిజమార్గమునన్. 77

వ. కఱచి యగాధశరంబగుతత్సరోవరంబున కరిగితీరంబున హిరణ్యకు నునిచిలఘుపతనకుం డుదారస్వరంబునం బిలుచుటయు సందర్శనకుతూహలంబునమందరకుండచ్చోం దమ్మికోలఁకు వెలువడి ప్రత్యుత్థానం బాచరించి వారిచరతిరసాహారంబున విముక్తమార్గశ్రములంగావించిస్వాగతాదికార్యంబులు వేఱవేఱనడిగినలఘుపతనకుండుకమఠపరివృఢునాలోకించి. 78

చ. అనుదినదూరితాఖిలశతాకమతా యితఁ డాఖుఁలేఖరా
జనుఁగుసఖుం డుపాయసఖుఁ డార్తిశరణ్యుఁడు పుణ్యుఁ డిట్టియి
మ్మనుపథవర్తి వంత నదుమంబొడమం బొడవేఁది యుల్లవీ
డ్కొనియిటకేగుదెంచె నినుఁగూర్చి సుఖస్థితినుండు నాతఁడై. 79

క. క్షణభంగురములు కపట, ప్రణయంబులు ప్రాణపతనపర్యంతంబున్
గుణవికలత శశశృంగము, ప్రణుతమతీ యిట్టిసాధుపథగాములకున్. 80

క. నావునకుఁ బాపెఁ జిత్ర, గ్రీవుని నిటువంటిపుణ్యకృత్యము లాహా
యేవేళ నెన్నిసేసెనొ, కో వేడుక నీహిరణ్యకుఁడు మందరకా. 81

వ. అని లఘుపతనకుం డుత్కర్షించిన నాశ్చర్యధుర్యుండై కమఠవర్యుండు హిరణ్యకున కిట్లనియె. 82

చ. వినులనీచరిత్రములు వింటిఁ గృతార్థుఁడనైతి సత్యభా
షానిధి యోగిమానసముచాడ్పున నిర్మలమైననీమహా
మానస మెట్లు దుఃఖగరిమ న్భజియించె విచిత్ర మివ్విధం
బే నిటవిందుఁ జెప్పఁగదవే యన నాయన కాతఁడిట్లనున్. 83

ఆ. అనఘ సఖ సఖుండవె యగునీవు మామక, వ్యధనకథన మభినయం బొనర్చి
సరసతావకాశ్వాసనభాషితంబుల, గాఢసమ్మదంబుఁ గాంతు నేను. 84

సీ. విను మహిళారోప్యమనుపట్టణము సర్వసౌభాగ్యవిలసనాస్పదము గలదు
దానిచెంగట వసుంధర బొక్కయొనరించుకొనియేను గౌరవంబున సుఖింతు
నటకుఁ జూడాకర్ణుఁ డనుతుచ్ఛసన్యాసి చనుదెంచి యేనుండుమునికిలోను
గాఁ గట్టిమఠము భిక్ష మనుదినము ధరాత్రిదశులవీఁటఁబెట్టుదురు గాన
తే. నెట్టుకొని పెద్దగాలంబు నిలుపవాని, స్నానమొనరింపఁ డోంకారజపముఁ దడవఁ
డాంతముగఁ జూడఁ డంతవేదాంతవిద్య, కడుపుకైలాస మగయ నక్కష్టయతికి. 85

క. కుక్షింభరుఁ డగునలయా, భిక్షుఁడు వేసరక తిరిగి భిక్షించినయా
భిక్షము భక్షింపుదు ర, క్తాత్ముండై కేలఁ గోలవదలింపంగన్. 86

క ఆయతికూరిమిసఖుఁడు క, థాయుతశతపారగుఁడు బృహస్ఫికనువాఁ
డాయెడ కేతెంచె నతా, మ్నాయా యొకనాటిమిట్టమధ్యాహ్నమునన్. 87

క వచ్చిపురాణోక్తకథల్, నెచ్చెలి విను మనుచు నాతనికి రసభారల్
పిచ్చిల వినిపింపఁగ విన, కచ్చెనఁటి పరాసుఁబోలె నటు మొగమయ్యెన్. 88

క. అగుటయుఁ గథకుం డాయతి, మొగమూరని పలికె మాఱుమొగమైతివయో
తగునే నీతో రసపు, ష్టిగ నేరుపు మెఱసి కథలఁ జెప్పుచునుండన్. 89

శా. నాకీచందముఁ దెల్పిచెప్పు మని విన్నంబోయినం బల్కెఁ జూ
డాకర్ణుండు సఖా సుఖంబెఱుఁగ కింద్లం భిక్ష భిక్షించి యాం
టాకుంబాత్రికఁ బెట్టి తెచ్చి మఠమధ్యం జేర్చితిం జూడు నేఁ
డీకొండాటపుటెల్క యుల్కుఁగ కిల్లేపార భక్షించెడున్. 90

క. నా కెక్కడిదిపరాక, స్తోకంబగు నలుక నెలుకఁ జూచెద నని చూ
డాకర్ణుఁడు పల్క బృహ, స్ఫి కాకర్ణించి యుల్లసిల్లుచుఁ బలికెన్. 91

క. ఇక్కలుఁగున నిమ్మూషక, మెక్కటి మెలఁగుటకు వలయు హేతువుగలుగన్
బొక్కలగములై యుండుట, నిక్కమిట్లొంటినుండు నేయుందురువుల్. 92

క. ఒలువనితిలలను నొలిచిన, తిలలీ వత్రాణివసుమతీసురభార్యా
తిలకము నం దొకకార్యము, తిలఘాతిని యూహ సేయదే పూర్వమునన్. 93

క. ఆకరిణి జాంగలంబున, నేకాకితఁ దిరుగు నెలుక యెడ నూహింతుం
గాక యొకకార్యమనఁ జూ, డాకర్ణుం డనియె నాదృఢప్రజ్ఞునకున్. 94

క. ఒలువనితిలలకు నొలిచిన, తిలలీవతాళివసుమతీభార్యా
తిలకమునం దేకార్యముఁ, దిలఘాతిని నిశ్చయించి దెలుపవె యనుచున్, 95

వ. బ్రాహ్మణి కిట్లనియె. 96

క. తొలుత నొకానొకభూసుర, నిలయమున కతిథి యగుచు నివసించితి న
న్నిలయపతి ప్రొద్దుపొడుపునఁ, గులభామం బ్రీతిఁ బిలిచికొని యిట్లనియెన్. 97

క. బాలా బుధసంతర్పణ, కాలం బిది యదనుగూడఁ గావింపు శుచి
త్వాలంకృతివై చరువన, లీలావతి పతికిఁ గొలుచులే దనిచెప్పెన్. 98

క. చెప్పిన యజమానుఁడు సతిఁ, దప్పకవీక్షించి పలికెఁ దన్వి గృహమం
దెప్పుడుఁ దఱుగగు కొలు చి,ట్లొప్పునె లేదని విలాసయుక్తులు నెరపన్. 99

క. సంచయ ముచితంబగు నతి, సంచయ మనుచితము సర్వజనులకు నెందున్
సంచయలోభంబున నొక, వంచక మారూఢచాపవశమునఁ దెగదే. 100

క. నావిని వాతెరపై నొఱ, పై విన్నాణంపునగవు లత్తమిల న్ల
జ్జావతి పతిఁగనుఁగొని తన, కావిధ మెఱిఁగింపు మనిన నతఁడిట్లనియెన్. 101

చ. అవహితబుద్ధి విన్ము మధురాధర యామిషగంధచిక్కణం
బవు నొకపక్కణంబున మృగాహృతిలిప్సుఁడు క్రూరపుల్కస
ప్రవరుఁడు గ్రాలు నాతఁడు ప్రభాతమున న్మృగఘోషభీషణా
టవి చొరఁబాఱి చేరి యుచటం గిరివేషము సేసె నెక్కటిన్. 102

క. వాలికతూపుల నేలం, గూలిన యలకొండగొఱియఁ గొని తనియక నా
శాలంపటుఁ డొక్కఁడయా, భీలాటవిలోన నిర్లపితుఁడై తిరుగన్. 103

వ. ముందర నొకశాద్వలంబున. 104

ఉ. క్రమ్మి చతుష్ఖురిం జమురు కాలువలై ప్రవహింప రోమపుం
గుమ్మలఁ బార్శ్వభూజములు గూకలు వ్రత్తులుగా ముఖంబునం
దుమ్ములు రేఁగ మైమఱచి దున్నుచు ముస్తలఁ దెల్చి కుంజముల్
గొమ్ములఁ జిమ్ముదాని నొకఘోరవరాహముఁ గాంచి యాత్మలోన్. 105

క కలముం బోలిన యీరే, కలము మదాహారమునకుఁ గా దైవంబీ
పొలమునఁ జూపెఁ బొమ్మని, యలరుచు వాఁ డప్పుడమ్మహాకిటి నేసెన్. 106

ఉ ఏసిన బద్ధరోషమున నేకల మెత్తెఱఁ దూఱి పుల్కసా
గ్రేసరు మోర నెత్తి తలక్రిందుగఁ ద్రెళ్ళఁగ వైచి వజ్రధా
రాసునిశాతదంష్ట్రికల వ్రచ్చి యచేతనుఁ జేసి నొప్పిచే
గాసిలి ప్రాణముల్ విడిచెఁ గన్నరమూసి ధరిత్రి నత్తఱిన్. 107

వ. ఇట్లున్న మృగనరశవంబుల గాలివాఱఁ గాలప్రేరితంబై దహ్యకనామధేయం బొక్కజంబుకంబు వచ్చి కొండగొఱియ రెండుదినంబులకు నేకలంబు పదినాళ్ళకు

నరుఁడు నాల్గువారంబులకుం జాలుఁ గృతసుకృతవిశేషంబునం గాక యీబహు సంచయం బెవ్వరికినని తలంచి హాలాహలాభంబగు లోభంబునఁ గొంచెపడునని యెంచి యందేమిటిని గంటిపెట్టంజాలక పండ్లయాటలు ద్రావుచుఁ గొండొకతడ వుండి మందుదండియాఁకటిచిచ్చునకుం గాక యబ్బక్కనక్క యెక్కిడిన శరాస నంబుఁ గదిసి నేఁడీధనుఃప్రతిబంధంబునఁ బ్రొద్దుఁ బుచ్చెదం గాక యని నిశ్చయించి.

క. ఆపిసినినక్క చాపము, కోఁపంగిట నిఱికి నరముఁ గొఱకినరభసం
బేపార మిడిసి మర్మ్మని, రూపఱ మొనరింప నక్క రోఁజాముఁ గూలెన్. 109

క. అతిసంచయపల మిదిపో, రతిబోటీ పలుగు దాఁపురంబన నగుచుం
బతికి సతిపలికె దాఁప, న్గతమేమీ ధాన్యమొదుఁగు గాలేదింటన్. 110

గీ. ఓలఁదిలలు గ్రమ్మి తైలంబుఁ దివిచిధూర్తౌఘవిసరకృసరమాచరింతుఁ
బుడమి వేలుపులకు నిడుమన్న నవ్విప్ర, సింహుఁ డబల నట్లచేయుమనియె. 111

క. నూనియఁ దివియుటకై తిల, లానీరజనయన దెచ్చునప్పు డొక కాల
జ్ఞానిహాలికాలయాగ్ర, స్థానంబున నుండి చేట జడియన్ వ్రాలెన్. 112

క. వ్రాలినఁ జెల్లాచెదరై, నేలందిలలొలికె నంతనివ్వెఱఁగున న
న్నీలాలక చూచునెడన్, వాలింపక సతికిఁ బ్రాణవల్లభుఁ డనియెన్. 113

క. కలికి యున్నట్టి యీక్రియ, నొలికినతిలలెత్తి దంపు మోర్పున నన న
క్కలకంఠి యట్లచేసె, న్నలి భీతిప్రీతులగ్గలములై పెరుఁగన్. 114

క. ఆమహీసురశరణమునకుఁ, గామందకి యనఁగ నొక్క గాము లది సుతుల్
నేమింపఁ బేసగంపం, గోమలగతి నువ్వులమ్ముకొన నేతెంచెన్. 115

క. ఏతెంచినఁ బలుకులసరి, నాతీ ముడినువ్వులిత్తె నా కని విప్ర
స్త్రీతిలకము ముదలించిన నాతిలలది యంటువడియె ననియూహించెన్. 116

వ. అట్లు బుద్ధికౌశలంబున నేను నియ్యుఱియ యెలుకచోట నిక్షేపంబు గలదని నిశ్చయించితినని చెప్పి ఘాలకుద్దాలంబుల నా మెలంగు కలుఁగుఁ ద్రవ్వి నా చేతఁ జిరస్థాపితంబగు ధనంబుఁ బుచ్చుకొనియె నది మొదలు పొదలుటలే కచ్చోటనాహారోపపాదనంబునకుం గాక వితాకుండనై మందు నాకఁటికి మిడికినడిఁకి యునికి పొసంగక మఱియు మఱియు భిక్షాపాత్రంబు వలగొనుచుండితి నట్టి నన్నుంగనుంగొని చూడాకర్ణుం డుపాలంభగంభీరభాషితంబుల నిట్లనియె. 117

క. అతిరక్షితార్థమంతయు, నితరులపాలయ్యెఁ జెడుగు టెలుకా నీయు
ద్ధతిచూన వీఁకనిదేమీ, గతవిభవులు సాధుతరులు గారా పుడమిన్. 118

క. ధనముడిగిన నుడుగదునీ, తనుజనితంబైనదుర్మదము నేఁడనుచున్

గన లునికిఁ గనికరంబఱి, తనపదిలినకోలచే నతఁడు ననువేసెన్. 119

క. వ్రేసిన వ్రేటు గురుతర, త్రాసంబున నోహటించి తప్పించుకొనన్
రోసంబున న న్నాస, న్యాసి నిరీక్షించి మఱియు నపు డిట్లనియెన్. 120

క. అర్థమునఁ బండితుండగు, నర్థమునం బలసమగ్రుఁడగు నర్థమునన్
బార్థివుఁడగుఁ బుణ్యుండగు, నర్థమునను భువనపూజ్యుఁడగు నరుఁ డెందున్. 121

గీ. అన్వవాయవృద్ధు లాచారవృద్ధులు, శౌర్యవృద్ధు లిద్ధసత్యవృద్ధు
లాగమార్థవృద్ధు లఖిలార్థవృద్ధులు కొలుతురర్థవృద్ధుఁ గోరి వేడి. 122

చ. వినఁ డని రోయ రంధుఁడనిపేఁగరు తుందిలుఁడంచు గేలిఁ గాఁ
గొనరు వికర్ణుఁడంచుఁ దగఁగూయరు వామనుఁడంచుఁ బోరు దు
ర్జనుఁడనిపాయ రజ్ఞుఁడని మానరు నిష్ఠురరోగపీడితుం
డనరు మనిష్ఠుఁడంచుఁ జెడనాడరు భోగిను లర్థవంతునిన్. 123

చ. కనకముఁ గూర్చి యొన్నఁబడుఁ గాదె సమస్తగుణంబు లర్థమె
వ్వనికి వసుంధరం గలదు వాఁడె కులీనుఁడు వాఁడె పండితుం
డనఘుఁడు వాఁడె వాఁడె సకలార్థవిధిజ్ఞుఁడు వాఁడె వక్త వాఁ
డె నయపరుండు వాఁడె ప్రకటప్రియభాషణుఁడుం బ్రసిద్ధుఁడున్. 124

క. కలవానికిఁ జుట్టంబులు, గలరు హితుల్గలరు భటులు గల రఖిలంబున్
గలదు మఱి లేని యట్టిది, కలవానికి నీడుజోడు గలదా జగతిన్. 125

క. చిట్టడుగులేనియిల్లును, జుట్టంబులు లేనిచోటు శూన్యము శూన్యం
బెట్టును దుర్జనహృదయము, కట్టా మదిసర్వశూన్యకము లేమి సుమీ. 126

క. ధనహీనుఁ డధముఁ డల్పుఁడు, ధనహీనుఁడె మూఢుఁ డప్రధానుఁడు ధర న
ద్ధనహీనుఁడు తలపెట్టిన, పని గ్రీష్మసరిజ్జలంబు పగిది నడంగున్. 127

వ. అని భిక్షుకుండు నన్నధిక్షేపించిన రోసి నివాసత్యాగంబు చేసివచ్చితి నిన్నుం
డాసితి. 128

క. త్రిదశవిమానారోహణ, మొదవిన నవమానధరణి నుండుట కష్టం
బదియెఱిఁగి నీతివిద్యా, విదుఁ డభిమానస్థలంబె వెదకుం బుద్ధిన్. 129

క. యమయాతన యవమాన, క్షమబాధ యిఁకెద్ది దానిఁ గడచనవిద్యా
గమశాఖ్యాగమవిత్తా, గమశూన్యంబైనచోటఁ గాదు వసింపన్. 130

క. పరదేశం బెఱుఁగక తను, గరగరిక న్వీడువనుడువఁ గలిగి నడుమఁ జే
దరికము వాటిలి తిరియ, న్దిరిగిన ననుబోఁటి కమరనే యింతైనన్. 131

ఆ. వెల్లివిరిసెఁ బెంటివిద్యలు మగవిద్య, లడుగుపట్టెఁ గ్రిందు పడిరి బుధులు

హీనజాతిపురుషు లెచ్చిరి యాచింపఁ, బోవు కెట్లు నేఁటిభూమిపతుల. 132

శా. ఏల ల్తుందనతాన లేమయినలేవే యంచు బోధించు నే
నూలంబెట్టఁగఁ జాల మూఢనృపుఁ డోహో నామహాసాహితీ
శూలంబు ల్సెవులాడసొమ్ముసిలునొచ్చుంజచ్చుఁదత్కల్మషం
బేలా యంజలిచేసిమ్రొక్కెదఁ బదార్థచ్ఛానిశాచారికిన్ 133

క. అనుచితభాషణముఖరా, వనులమొ విటగాయకులమొ నటులమొ గాఢ
స్తనసంభరనమ్రవధూ, జనులమొ మమ్మేం రాజు సంభావించున్. 134

ఉ. కోరినగద్యపద్యముల గూరిచి యిచ్చెద నంటినేని ని
స్సారము లంచువిత్తమిడఁ జాలక కేరడమాడులోభి యా
నేరుపు నేర్పుగాదు తనునిందలఁబెట్టు రసజ్ఞుఁడైనయు
ర్వీరమణుండుగల్గినఁ గవిత్వము సర్వఫలంబు లీదొకో 135

చ. పలుకులశబ్దసగ్గళితపత్రభవంబులు జాతపరముల్
బలుకడుపుల్ నిరుక్తికలు ప్రజ్ఞ లనర్థకము ల్విచారముల్
వలవనిశీవినవ్వఁ బెఱవారి నెఱుంగకతిట్టికూళతే
పొలుపునఁదప్పులొప్పులనఁ బోదురొకో సుకవిప్రబంధముల్. 136

చ. మెఱసి బహుప్రబంధతను మెచ్చుట మెచ్చుట యొచ్చమంటి పా
పఱిమఱి నెన్ను టెన్నుట నిరక్షరకుక్షు లధీరశిక్షితుల్
కఱటులు భూరుహాశ్మపశుకల్పు లమత్కృతిఁ బ్రస్తుతించినం
గఱగఱఁబోపనాడినసుగల్గవు నామదిమోదఖేదముల్. 137

క. పరిహాసకులకు నటులకుఁ, దరుణులకును లంజెదారితమ్ములకుం గా
పురుషులకు గాయకులకుం, బొరయింతురు రాజు లీరుసో సతసులకున్. 138

ఉ. ఏపున సంచితార్థము పరేంగితభావ మెఱింగి యీఁగి మే
లై పొగడొందనిచ్చి నెఱయన్నలచు న్నెఱదాత యిట్టిచో
దాపయిత్వప్రభోధవశతం బొరయుంచి యనంతరంబు సం
తాపమునొందువాఁ డధమదాత వృథాలపితంబులేటికిన్. 139

ఉ. దాతలుదాత లం ద్రదియతథ్యము లోకమునందులేఁడుపో
దాత యతండుగల్గినను దాతృతదాసకలార్థులందు నే
లాతులతూఁగకుండు నచలస్థితి నింతయెఱింగి యే నహో
దాతబుణాను బంధముగ దాయనిచిత్తమునందలంచెదన్. 140

క. తలలెత్తి మాపవెఱతురు, నెలవెలనై మాఱుపలుకవెఱతురు నెఱయం

జలియించిపఱతు రిస్సీ, కొలప గతులు గారె యాచకులు లోభులకున్. 141

క. చరణములువడఁకు భీతిం, బరవశమౌనొడలు రాలుపడు నెలుఁ గాహా
మరణమున నెట్టి చిహ్నము, లరయ న్యాచకుఁడుదాల్చు నచ్చిహ్నములన్. 142

వ అట్లగుటఁ జింతించి యాచకత్వంబునకుఁ జిత్తం బొడఁబాటుగాదు దారిద్ర్యం బునం బ్రజ్ఞాహైన్యంబు వాటిల్లుఁ బ్రజ్ఞారాహిత్యంబున సత్వక్షీణంబగు సత్వభ్రంశనంబునఁ దిరస్కృతివొడముఁ దిరస్కారణంబున నఖర్వనిర్వేదనం బావహిల్లు నిర్వేదనంబు శోకంబుదెచ్చు శోకింబుబుద్ధిబాధకంబగు బుద్ధినాశకారికావున నిర్ధనంబఖిలవిపదాస్పదంబని పలికి మఱియును. 143

చ సముచితభాషణంబులకుఁజాతురిసాలక యున్నమౌన ము
త్తమము పరాంగనాగమనతత్పరుఁడయ్యెడు దానికంటె షం
డమతము మేలు చాడికినొడంబడియుండెడిప్రత్తికన్నఁ జా
వుమిగులలెస్స యాన్యవసువుల్గొనుకంటెను భిక్షమొప్పగున్. 144

క. దీపమునఁ దమము రోగ, వ్యాప్తిఁ జెలువంబుహరిహరాఖ్యానము చేఁ
బాపమువలె యాచ్ఞావిధి, వేపాయుగురుత్వ మతులవిజ్ఞాననిధీ 145

చ. అలఘుఘుత్వమూలమగునర్థిత కంజలిఁజేసి మ్రొక్కి వీ
డ్కొలిపి నృపాలుగంగొలిచి కూర్చెదభూరితరార్థమంచు నేఁ
దలఁచితి నేని పట్టియులఁతంబడుటొక్కటి నిర్దయుల్ఖలు
ల్దిలుపలు హీనమర్త్యఫలదుల్నరవల్లభు లీరు విత్తముల్. 146

క. తానీఁగొఱమాలినహా, హీననరాధిపుఁడు భాగ్యహీనుఁడను న్స
న్మానార్హులసుభటులవి, ద్యానిధులన్హాలహాలాభమగులోభమునన్. 147

వ. అట్లగుటరాజసంశ్రయంబును గూడదు ప్రేష్యభావంబు మృత్యుద్వారంబు రోగియుఁ జిరప్రవాసియుఁ బరాన్నభోక్తయుఁ బరగృహశాయియు జీవన్మృతులని చెప్పి హిరణ్యకుండు వెండియు. 148

క. సంతుష్టివర్షసంగు, స్వాంతఃకరణునకువెఱచునతిశయతృష్ణా
కాంతములుభీతిచింతా, సంతాపక్లేశరుజలసంపాదింపన్. 149

ఉ. వీతఖలీనమై యతులవేగమున న్మనగాలు ద్రొక్కు తృ
ష్ణాతురగంబు నెక్కి యలసస్థితిఁజేట్పడకుండు వానికిం
జేతెడునేల మేరుగిరి సింధువువత్స్పదంబు దూరతృ
ష్ణాతిమఁడైనవానికి నిజాంకగతార్థము దవ్వు పెద్దయున్. 150

క. ఆశాశృంఖలఁబడినా, నాశాభూములఁజరించునదిపో యసుఖ

శ్రీశోభితుఁడై నిలుచును, ధీశరధీ మనుజుఁ డొక్కఁ దెసయరుదేరన్. 151

క. పొట్టకుఁగా బట్టకుఁగాఁ, జెట్టాడుం దెలివిలేని జీవి నిజంబా
నొట్టపు శపథంబవుఁ దనుఁ, బుట్టించిన దేవుఁ డిచ్చుఁబో కర్మగతిన్. 152

క. కూరలు నారలు చాలవె, పూరింప న్నెట్టిమేల పొట్టకు మఱి యే
నీరైనఁ జాలదే ప్రస్న్నరేటికి నింగిఁగిల్కొనినచిచ్చార్పన్. 153

ఉ. ఊయెలమంచము ల్పనిఁడియుప్పరగ ల్గపురంపువీడెము
ల్మాయనిపట్టము ల్రుచిరమండనము ల్గడలేని క్రొవ్విరు
ల్గాయనగాయనీమధురగానసుఖంబులు గన్నగాని సీ
పాయదె యన్నమాత్రమునఁ బ్రస్తుతజీవికిఁ జక్రవర్తికిన్. 154

చ. ఒకరునికిమ్ము నిచ్చి తిరియు న్మఱియొక్క తతిన్మహోగ్రుఁడై
యొకరునిఁ జంపుఁ జంపిపొలియు న్మఱియొక్కనిచే బలాఢ్యుఁడై
యొకరునిఁ ద్రోయుఁ ద్రోచి మఱియొక్కనిచేఁ బడు నేలు నొద్ద నొం
డొకరునిఁ గొల్చు మానవుఁ డహో సుఖవృత్తి విపత్తివృత్తులన్. 155

వ. అట్లగుట మేలుగీళ్ళు దేహధారులకుప భోగ్యంబులుగ దాయని తెలిసి మదింబదిలంబు సేసికొని యిచ్చటికివచ్చితినని హిరణ్యకుండు చెప్పినమందరకుండతని నాలోకించి

క. నెలవునఁ బూజ్యంబులు నఖ, ములు దంతంబులు శిరోజములు గాలకతిన్
నెల వెడలియుఁ బూజ్యంబులు, పులిగోళ్లును దంతిదంతములు చామరముల్. 157

క. హరి పెంపువడయుఁ గరి పె, ద్దరికముఁ గను సజ్జనుండు తగఁ బూజ్యుండౌ
నిరవెడలియు నిరవెడలినఁ, గరటము దెగుఁ గుజనుఁ డీల్గుఁ గడచనుమృగముల్. 158

క. అరివిదళన పరుషుండగు, పురుషుం డెచ్చోటనయినఁ బూజ్యుఁడు గాఁడే
ఖరనఖరవిజితకరిహరి, తిరముగ మృగరాజ్యమేలదే పెఱయడవిన్. 159

క. కదలనినీటికిమీనము, లెగు రెక్కనెయుఁ జిదిఁ బాలు నేటికిఁ బోలెం
బదవి నిరుద్యోగులఁ బొం, దదు సోద్యోగులనకాని ధార్మికముఖ్యా. 160

క. తనపుణ్యపాపవశమునఁ, దనివిసనన్వచ్చు సంపదలు నాపదలున్
ఘనతకు నుబ్బక హీనత, కనుతాపం బందకుండునది సుజనునకున్. 161

క. శకటగతచక్రభంగి, న్నకరములై తిరుగుచుండు సుఖదుఃఖము లిం
తకు ఖేద మంద నేటికి, నకటా సంతోషయుక్తుఁ డగు టొప్పుఁ గదా. 162

మ. సతతోత్సాహపరుం గ్రియానిపుణు భాస్వద్దీక్షు సూత్రుం గృత
జ్ఞతము న్సత్యధురంధరు న్మధురభాషావేది సౌహార్ద భా
సితు నారంభవిజృంభమాణుఁ గరుణాసింధు న్శుచి న్శాంతు ని

ర్జితకాముం దనుఁదా వరించు సిరి నిర్నిద్రానురాగంబునన్. 163

క. అవివేకి నలసు విగత, వ్యవసాయున్ హీనుఁ గుటిలవర్తను నఘుం
గువిచారుఁ జేర దిందిర, యువతీమణి వృద్ధుఁ గవయునొల్లని భంగిన్. 164

క సరసప్రజ్ఞోత్సాహ, స్ఫురితుఁడ వీ వెచటనున్నఁ బూజ్యుఁడవు గుణా
కర మూషకకులశేఖర, యురగేంద్రుఁడుఁ గాను నిన్ను నుత్కర్షింపన్. 165

చ. అడఁగని లేమిఁ బొట్టుపొలయ్యును ధీరుఁ డొకానొకప్పుడున్
విడిచి చరింపఁ డుగ్రపదవిం గృపణుం డసమానసంపదం
బొడవయి యుండియుం దనయఁ బోఁడదియెవ్వరికేది మార్గ మా
నడనడి వా రొకింతవిడనాడరుగా గడతేరునంతకున్. 166

క. ధనవంతుఁడనని మదమున్, ధనహీనుఁడ నని విషణ్ణతం బొందవు హా
స్తవిహతహేలాకందుక, మనఁ బాతోత్పాతములు జనావళికగుటన్. 167

సీ. జలధరచ్ఛాయయు ఖలమైత్రియును నవసస్యంబు యువతియు జవ్వనంబు
సంచితార్థంబు నీషత్కాలభోగ్యము ల్గావున వలవంత గా దొకింత
తెలు పంచగమికి నెమ్ములకుఁ జిత్రతి కీరములకుఁ బచ్చదనంబు గలిగె మొదల
నేవేల్పువలన నద్దేవదేవుఁడు పోషకుఁడు నువ్వో మది నేల కుతిలపడఁగ
తే. జనుఁడు బ్రతుకునూఱు సంవత్సరములంత, కాల మెవ్వఁడుండు మేలుతోడఁ
గౌతుకమునఁ గొంతకాలము చను మహా, కష్టవిష్టిఁ గొంతగాల మరుగు. 168

వ. దానతుల్య యాగువిధియును సంతోషసమం బగుసుఖంబును శీలసదృశం బగుభూ
షణంబును నారోగ్యసదృశం బగులాభంబును లేదుగదా! యిమ్మాటలటుండె
మదీయ స్నేహంబునఁ గాలం బపనయింతురుగాక యని మందరకుండు హిరణ్యకు
నాశ్వాసింపుచుండె నప్పుడు లఘుపతనకుండు. 169

క. శమితశరాకమతాని, ర్గమనప్రమదంబు హృదయగతచింతాశ
ల్యముఁ బెఱికివైవ నీమై, త్రి నునోజ్ఞ విశల్యకరణి ధృతినూహింపన్. 170

క. ధరలో సత్పురుషులు స,త్పురుషాపద్ధరణ హేతుభూతులు గారే
కరులుబ్బలిలోఁ జిక్కినఁ, గరులెత్తఁగఁ జాలియుండుఁ గాదే పుడమిన్. 171

క. నిధిసాధకుఁడు ఘనాంజన, విధినిక్షేపంబుఁ జూపువిధమున సుజనుం
డధికాపదార్తులకు హిత,మధురోక్తి నఖండసౌఖ్యమహిమ ఘటించున్. 172

మ. కనకేరుహామర్థిపాఁపఁ బ్రతిపత్రస్తుఁడై వచ్చి కా
తరబుద్ధి న్ననుజొందు మాటుసార నాస్థన్నిస్తులార్థాభయా
చరణప్రక్రియలం గృపామతిఁ దధాశాభంగవైముఖ్యముం

బోరయుం గోరనివాఁడువో పురుషుఁడో ప్వ న్నావిఁ గీర్తింపగాఁ. 173

చ. విటపసమృద్ధిభూజముల వీవలుల న్వ్రయుల న్మరందలి
ట్వలివియత్ప్రిదేశమునఁ బత్తులు వారిమరాళమండలం
బెటువలె నాశ్రయించి బలమెవ్విధిఁ గైకొను నేము నిట్టిన్
నటువలె నిన్నుఁజేరి ముదమందెద మోకమతాన్వయాగ్రణీ. 174

వ. అని లఘుపతనకుం డనేకప్రకారంబుల మందరకు నుత్కర్షింపుచుండె నాసమయంబున. 175

మ. చకితస్వాంతముతో మహామహీరజశ్ఛన్నప్రతీకంబుతో
వికసద్వక్త్రముతో బృహద్గతిజనిర్వేదైకనిశ్వాసవీ
చికతో బమ్మెరపోకతో నటకుఁ గశ్చిల్లుబ్ధకక్షోభ మొం
డొకకాంతారమృగంబు భిన్నఖురటంకోదగ్ర మేతెంచినన్. 176

క. మాత్రినికిఁ బోటియకు సలిల, స్థానమునకుఁ గాక విసరసజ్జలచరముల్
లో నెరసినభీతిఁ బసిం, దానిఁ గనుంగొని యథాయథముగాఁ బఱచెన్. 177

క. క్షితిజాంతాగ్రస్థితలఘు,పతనకుఁ డద్దిక్కు లెల్లఁ బరికించి యుప
స్థితమైనది కించిద్భయ, మతిభయ మిచ్చోటఁ గలుగదని తెలుపుటయున్. 178

వ. హిరణ్యకమందరకులు బహిర్నిర్గమనం బొనర్చి వెగడుపడియున్నమృగంబు నూఱడించి యాతిథ్యం బొనరించి చిత్రాంగనుం డనునామం బిడి ముఖ్యసఖ్యంబున వలరించి భీతికి హేతువెద్ది చెప్పుమని యడిగిన నది మృగయువృత్తాంతంబని చెప్పె నమ్మువ్వురు నతం డొక్కరుండునుం గూడ నలువురై యన్యోన్యస్నేహవ్యామోహంబునఁ గొంతకాలంబు గడపి రట నొక్కనాఁడు. 179

సీ. ఆహారవాంఛఁ జిత్రాంగదుం డడవికి బఱచి యొండొకకుంటఁబడియనోట
నలఘుసుధీవరయంత్రవాగురఁ దగుల్కొని భీతినంగము ల్వడఁక గోడు
గుడుచుచుఁ దోసిద్దుకొనుచు శుష్యద్గ్రీవమై వచ్చుచుండ వృత్తాగ్రవర్తి
యగుచు దూరమున వాయసనాథుఁ డచ్చోటఁ గని సుస్రిక్కి యొటువంటికష్ట మొదవె
తే. నేమిసేయుదు ననుచు నహీనవేగ, కలన ఱెక్కల పటపటాత్కార మెసఁగ
నరిగి బాష్పనిరుద్ధాక్షుఁ డగుచు సఖునిఁ, గదిసి యిట్లనుఁ గంఠగాద్గద్య మడర.

మ. చెలికాఁడా పదబంధ మేపఁనవచ్చెం జెప్పుమా నివ్వెఱం
గలఁగ న్మానసమన్న నాతఁడను బల్కుం దాల్మితే చింతయుం
దలియం జెప్పెదఁ బిమ్మటం బ్రతుకుఁగంటేఁ గ్రమ్మఱం బోయిని
ర్మలహృద్ధాము హిరణ్యకుం బిలిచి తెమ్మా బంధవిచ్ఛిత్తికిన్. 181

చ. మనుపఁ బ్రియంబయేనిఁ జనుమా యన నాయన నిర్భరత్వరం
జని నిరవద్యహృద్యగుణసారు హిరణ్యకుఁ జేరి చూచితే
చెనఁటివిధాతచేత మునుఁ జిత్రమృగాగ్రణికృత్తివాగురా
భినిహతపాదుఁడయ్యె నినుఁ బిల్వఁగవచ్చితిఁ దత్ప్రశాంతికిన్. 182

క. నావిని మూషకపతి దుః, ఖావేశితహృదయుఁడై సఖా పోవలయుం
బోవలయు జాగుసేయక, వేవేగ న్నన్నుఁ జేర్పవే నీవచటన్. 183

వ. అనిపలికిన నతని మృదురీతిం గఱచుకొని చని వాయసకులవల్లభుండు నికటంబున నిలిచిన రుగ్ణునకు నౌషధంబును దృషితున కుదకంబును క్షుధార్తునకు మృష్టాన్నంబును నగాధజలపతితునకు నోడయు దరిద్రునకు నిధానంబునుంబోలె నుపస్థితుం డైన హిరణ్యకుం జూచి చిత్రాంగుం డిట్లనియె. 184

క. మృగయుభయంబునఁ జీకా, కగుచున్నది మది భుజంగమాకృతిఁ గాలం
దగిలినయురిగోలికి భయా, ర్తగచిత్రగ్రీవుఁబోలెఁ దగు ననుఁ బ్రోవన్. 185

క. మందరకుండును గరటపు, రందరుఁడును నేను నీపరామర్శ న్నే
లం దెదమని తలపోయుదు, మందెక్కడిశంక నీదయకుఁ బాత్రంబుల్. 186

క. విచ్చలవిడి వాగురికుఁడు, వచ్చినఁ బ్రాణములమీఁద వచ్చును గృపనేఁ
డిచ్చొట్ట మాన్పు మనవుడు, నచ్చకితునిఁ జూచి మూషకాగ్రణి పలికెన్. 187

క. వెఱవకు వాగురదునియుం, గొఱుకుటయన నెంత నీతికోవిద నీకే
తెఱఁగున నీదుర్దశ దెప్పరమై చనుదెంచెఁ దేటపడఁ జెప్పవనా. 188

క. అనిన నిది నేఁడ కాదట, మునుగలదన నతనిఁ జూచి మూషకరా జో
యనఘా నీతొలుతటికథ, విన నిష్టంబయ్యెఁ దెలుపవే నాకనుడున్. 189

ఉ. రంగదుపాయపారగుహిరణ్యకుఁ గన్గొని యొప్పఁ బల్కెఁ జి
త్రాంగుఁ డిత్తెఱంగుఁ దెలియ న్వినుమాఱవమాస మేగుచుం
డంగ సుగంధనై జననిడాఁపునఁ బర్వి యఖర్వపర్వత
ప్రాంగణశాద్వలస్థలులఁ బచ్చికమచ్చికమేయ నాయెడన్. 190

చ. నరమతకీర్తియాత్కలమునాఁ గటకంబునఁ బుష్కరుండు భా
స్కరకులుఁ డొక్కనాఁడు తెలిగన్నులయన్నులొయార మొప్పఁ జా
మరము లిడంగ దివ్యమణిమంటపమధ్యమృగేంద్రపీఠి నం
బురుహవిరోధి పూర్వగిరిఁబోలె రహిం గొలువుండె నుండఁగన్. 191

మ. తుటుమై యొక్కటఁ గూడి గూడెపుఁగిరాతుల్ నను వీక్షింపఁగా
నటకాలోన హుటాహుటిం బఱచి పచ్చాకుల్ దృషత్సానము

ల్గిటిదంష్ట్రి ల్గరిదంతము ల్సవరము ల్జేగ ల్కివాళ్ళంగముల్
చిటుకలై వ్రచిన మ్రోఁగువారువములుం జేకానుక ల్సేయుదుణ్. 192

గీ. మ్రొక్కి చేమోడ్చి మాయున్నచక్కిఁ జెప్పి, యెన్ని హరులెన్ని యేనుఁగులెన్ని పందు
లెన్ని పులు లెన్ని మనుబిళ్లు లెన్ని లెళ్లు, చెప్పఁజిత్రంబు వేఁట విచ్చేయుమటను 193

సీ. కొసవెంట్రుకలఁబట్టి కూపెట్టసింగంబుఁ బట్టి తేకున్న నీబంటఁగాను
నెలవారసిలసొమ్మసిలవైచి శరభంబుఁ బరిమార్పకున్న నీబంటఁగాను
గండ్రగొడ్డటన వక్త్రంబుఁ జించి గజంబుఁ బడఁద్రొక్కకున్న నీబంటఁగాను
గండభేరుండపక్షుల నెత్తుట భూతబలిఁ జల్లకున్న నీబంటఁగాను
తే. గబ్బిబెబ్బులిడాకాల ద్రొబ్బి విరియఁ, బ్రామి రూపార్పకున్న నీబంటగాను
లావిగవిఁ జొచ్చి యచ్ఛభల్లములగముల, బడలువాపకయున్న నీబంటఁగాను. 194

వ. అని మృగారాతు లక్కిరాతులు పంతంబులు పలికి మృగయావినోదంబునకు
మోదం బాపాదించినం బుష్కరుం డలరి వేటసన్నాహంబువీటఁ జాటించిన. 195

సీ. అపఁగించుఁబో యిమ్మహాసారమేయంబు జముఁ డెక్కు కాసరస్వామినైనఁ
గూల్చుఁబో యమ్మహాకుర్గురం బద్ధిశుముద్గులాయము కాఱు మొసలినైనఁ
గఱచుఁబో యిమ్మహాకౌలేయకము విశుగ్రీవు పేరెకిరింతగి త్తినైనఁ
బట్టుఁబో యిమ్మహాభషకంబు తొలుసంజ గన్నమానిని వాల్మికంబునైన
తే. నవఁగఁబులిగాఁడుచిలుకుటమ్మచ్చపచ్చి, మిరియమురిద్రాడుకాత్రేఁడు మెఱుపుదీగ
పిడుగుకిలగూరగంపసు పేళ్ళనలరు, నిడుదకుక్కల పట్టుపట్టెడలఁబట్టి. 196

గీ. పరుసుకరసానఁ దీటినపందిపోట్లు, భూరిభుజపీఠములయందుఁ బొంగుపఱిచి
పరికరంబులఁ గొనుచు భూపాలునగరి, యేలుబడి వేఁటకాండ్రు మున్నే చినడప.

క. ఏలలఁ బాడుచుఁ దగ విలు, గోలలఁ గొని నల్లప్రజలు గుములై నడప
న్నీలాంబరుఁడై విభుఁ డు, ద్వేలాశుకశావిరాజి తేజీ నెక్కెన్. 198

క. ఎక్కినఁ ద్రొక్కనిచోటులఁ, ద్రొక్కుచు గుఱ్ఱంబునడవ దూరము ఱగుమా
యిక్కలకు వచ్చె నరపతి, పక్కణవాస్తవ్యసమితిపథ మెరిఁగింపన్. 199

తే. వచ్చి మాయున్నపొలమెల్ల వల్లెవైచు, చందమునఁ జుట్టుకొనినఁ బోసందులేక
చలితచరణంబులును బరాసన్నదృష్టి, గలిగియుండిరి మచటఁ గాకవులకరణి. 200

వ. అంత. 201

క. పవికల్పప్రదరంబున, నవనీపతి దుష్పిదుష్పూరనఁ బడనేసెన్
నవలాఘువ మేర్పశ రా, రవబాధకు మొదలుగారె రాజులు దలఁపన్. 202

క. శిఖిధూమశ్యామలములు, ప్రశరగరుద్వాసరభానురము లుద్యజ్జ్వా

ముఖరితములు రాజశిలీ, ముఖములు బహుపుండరీకముఖముల వ్రాలెన్. 203

క. తారలుచెద నుడ్డీనో, దారగతుల్మెఱపి గగనతలమున జవన
ద్భేరుండము లాస్యముల న,పారముగాఁ గొనియె రాజబాణఫలంబుల్. 204

క. తులలేని శైత్యములఁ జెఱు, బిలముల బురుడించుకొనలఁ బెరిగిన శరముల్
పొలములు లాఘంబులగళ, ములు మోవగఁ గుండషండములఁ బూరించెన్. 205

క. నిరవధిక దానవిద్యా, పరఘనుఁడాఘనుఁడు దాత ప్రజ్ఞాని వసే
చరమృగచరజాంగళముల, శరధిపృషత్కముల సరభసంబునఁ గప్పెన్. 206

క. సమయించె ఖడ్గముల ఖడ్గములం గ్రూరాచ్ఛభల్లగణముల జగతీ
రమణుఁడు దుర్గాహవన, క్షమఁ గ్రూరతరాచ్ఛభల్లగణములఁ గప్పెన్. 207

వ. ఆయ్యాఖేటనంబు శానితపక్షప్రకరంబు గావున యజనవాటంబును ధ్వనిప్రధానంబు గావున సుప్రబంధంబును భంగదుర్నిరీక్ష్యంబు గావున బయోనిధానంబును నఖండ ధర్మసంపన్నంబు గావున కృతయుగంబును నిరూఢబుల్యశృంగంబు గావున విభాండకాశ్రమంబును శిథిలీకృతాచ్ఛభల్లంబు గావునఁ బ్రభగ్నసంగ్రామంబును గుంతీష్టవిహారయోగ్యంబు గావునఁ బాండురాజార్జనంబును వష్టసింహబలంబు గావున భీమసేనోత్సాహంబును నపాస్తసింధురాజంబు గావున ఫలితార్జునప్రతిజ్ఞయు నికుంచితపంచకంబు గావున రాజనగరంబును నిశ్చేష్టితగవయంబు గావునఁ గుంభకర్ణసంరంభంబును సప్రకాశితపుండరీకంబు గావున శిశిరకాలంబును ననుకరించె నప్పుడు. 208

క. పొలములఁ వెదకి పక్కణ, పాలురు తఱుముటయుఁ దల్లి ప్రజ లుద్ధురజం
ఘాలురు గావునఁ బరచిరి, పోలేకం దగులుపడితిఁ బో వారలకున్. 209

క. నను నంతఁ జిత్రవర్ణుఁడు, గనిఁ జంపక తెచ్చి పతికిఁ గైకానుకగా
నొనరించిరి శబరసుతు, ల్వాను రా జవ్వేటమీఁద విరిగి న్దిరిగెన్. 210

వ. తిరిగి మహామహీశాకటకం బగుకటకంబునకు వచ్చి రాజు యువరాజునకు నన్నిచ్చె నిచ్చిన నచ్చెలువుండు నన్నుఁ గన్నవందనుకంటె నగణ్యకారుణ్యంబున రక్షించె నట్లు కుక్షిద్రక్షితుండనై యుండి యంతఃపురంబున వాసగృహంబున యువరాజొక్కరుండు పవ్వళించియుండ నేనును దత్సమీపంబున నుండితి నయ్యర్ధరాత్రంబున. 211

క. ప్రతిగర్జత్కేసరియై, యతికంపజ్జంతు హృదయమై నిర్భిన్న
శ్రుతిహృత్పుటమై విద్యు, ద్ద్యుతివాంతధ్వాంత మగుచు నొకయుఱుము మాతిమెన్.

ఉ. తనకర్ణంబుల కెంతయాఘననినాదం బూర్జితామోదకం
బొనరింప న్సుఖమెత్తి వానతఱి యయ్యోగ్యపర్వతాధిత్యకా

వనుల నసద్వనులం గులప్రభులతో వర్తింతుఁగా యందు బా
ష్ప నిరుద్ధాత్ముఁడనై సఖా మనుజభాషం బల్కితిం బల్కినన్. 213

చ. విని యువరాజు త్రాసరసవిహ్వలుఁడై సదనంబు నద్దెస
ల్గనుఁగొని యేను నీమృగముకాని యొరుల్వ్యహరింప రింపుఁజె
ప్పను వినఁగూడు నే మనుజభాషల నిప్పుడు నద్భుతధ్వనిం
బనివడి ప్రోసి వేగి తెలుపందగునీ తెఱఁగెల్ల వారికిన్. 214

క. అనితనువు వేఁగ వేగినఁ, దన కాపుష్కరవరేణ్యుతమ్ముఁడు నెమ్మిం
గనుఁగూర్కి వెఱచి యొకలా, గున నంతయు దైవచింతకుల కెఱిఁగించెన్. 215

క. ఎఱిఁగించి మృగములెక్కడ, తరి నేతన్మనుజభాషితము లెక్కడ నే
తెఱఁగో యే యుత్పాతమొ, వెఱఁగయ్యెడు ననిన నవ్వి విద్వత్సింహుల్. 216

క. యువరాజుఁ జూచి ధరణీ, ధవనందన యేల వెఱచెదవు మృగజాతుల్
పవలూరకుండి నిశనవ, నవభంగి మ్మనుజభాషణంబులఁ బలుకున్. 217

క. నరసంచారవిహీనో ర్వర నని చెప్పుటయు భయము వదలి నృపాలా
వరజుఁడు ననువిడిపించెను, గరుణాపరుఁడై దురంతకాంతారములన్. 218

క ఇది నాకు నేఁడ కాద, మ్మొదలం గలదనుచుఁ దెల్లముగ మృగము జగ
ద్విదితుఁడగు నెయ్యునకు నా, ర్తదశం దడిలేని నోరఁ దనకథఁ జెప్పెన్. 219

క. అతివేలచింత నంతట, నెతమదిలో నెరసి సగసి వెలువడి మంద
స్థితి చాయఁ జూచుకొని యు, ప్రతిమదయాశరధి మందరకుఁ డేతెంచెన్. 220

క ఏతెంచిన భీతి విని, ఘ్రాతహతిం ధృతినగంబు ప్రయ్యలుగాఁ జిం
తాతంతుబద్ధమానసుఁ, డై తత్తర మెసఁగ మూషకాగ్రణి పలికెన్. 221

చ. అరయ నుపాయపారగుఁడ వయ్యు నయోదధివయ్యు సంతత
స్థిరమతివయ్యుఁ గానిపనిఁ జేసితి వన్మసఖా మృగంబు ని
క్కరటము నేను నెప్పటికిఁ గాల్గలవారము చిక్క మేరికి
ట్లురుగతి నీకులే దిచటికుద్ధురుఁడా మృగయుండు వచ్చినన్. 222

చ. అతివిశాలాత్ముఁడైన సఖునందును బెంపొనరించు ధారుణీ
పతివరునందు భూరిగుణబంధుర మైనకళత్రమందు ను
న్నతనయతత్త్వశాలి యగునందనునందు మనంబు సొన్పి యా
గతబహుదుఃఖము ల్దొలఁగుఁగాదె విచారధురీణుఁ డుర్వరన్. 223

చ. అను నెడ వేఁటకాఁడ దయఁ దప్పఁ డుపస్థితుఁడై వధైన్యమా
వనమున మోసులెత్త మృగనాథుఁడు జెగ్గిలినన్ హిరణ్యకుం

దనునయవాక్యము లెఱయ నాత్మను మంత్రిపరీతవాగురం
దునియలు సేసి మందరకు దూఱి యథాయథలయ్యె నయ్యెడన్. 224
క. జలచరుఁడు గనవరత్వర, నిలబోవం జేవలేక యొప్పటిచో ని
గ్గళితగమనేచ్ఛఁ గచ్ఛప, కులనాథుఁడు శిరము ముడుచుకొని యుండుటయున్.
క. సరిసరికిఁ బాసి గాఢ, త్వరఁబఱచినమృగముఁ జూచి దారుణచింతా
పరితప్తుఁ డగుచు మృగయుఁడు మరుగుచు నచ్చో ముహూర్తమాత్రము నిలిచెన్.
వ. అట్లుండి ముందర మందరకుం గాంచి పట్టుకొని త్రాటంగట్టుకొని వింటికొప్పునం
బెట్టుకొని విన్ననైన మొగంబునం దిరిగి యరుగుచుండె నప్పుడు హిరణ్యాక లఘుప
తనక చిత్రాంగదు లంతంత ననుసరించి చనుచుండి రందుం దుర పురందరుండు
తనలోన. 227
ఆ. అంబురాశిపారమైనను గనవచ్చు, నిశ్చయింపవచ్చు నింగిపొడవు
బ్రహ్మ మిట్టిదనుచుఁ బలుకంగనగు సుహృ, ద్విరహ మింతయనుచుఁ దెలియరాదు.
తే. అదియ సువ్యక్త మది నిజప్రాణతుల్య, మదియ నిర్వాచ్య మట్లుగాదయ్యె నేని
జననిపైఁ భార్యపైఁ దనూజన్ములపయిఁ గలిమిపై మైత్రిపైఁ బోలెఁ గలదె మమత.
సీ. కర్మచేష్టితములు గాలాంతరావర్తితము లగు మేలుగీళ్ళమర నైనఁ
గనుఁగొంటి మరిసమాగమవియోగములేల చెనఁటివిధాత సృజించె మొదలఁ
బృథులశోకారాతిభీతిఘాతిప్రమోదసంపాదిప్రీతివిస్రంభభాజ
నము మఱిరెండక్షరములఁ బూర్ణంబైనమిత్రశబ్దము మేర మెఱసి విడిసి
తే. యెట్లునిలువఁగూడు నెబ్భంగి రుచియించుఁ, గూడు కంటికెట్లు గూర్కు వచ్చు
నని హిరణ్యకుండు దనలోన దుఃఖించి యపుడు పలికె వాయసాధిపతికి. 230
క. ఈ యధముఁ డెంతదూరము, పోయెడునో యెంతదవ్వు పోదము సర్వో
పాయములఁ గానలోపల, నీయెడ విడిపించుకొంద మిమ్మందరకున్. 231
క. నా వినిని లఘుపతనకుఁడును, లావుపసం బోర నలఁతులము మందరకుం
డేవడువున విడివడు నీ, చేవినికి దిక్కు చెప్పవే వెరవనినన్. 232
సీ. అశ్రుమిశ్రితనేత్రుఁ డైనహిరణ్యకుఁ డనియె నిప్పాపాత్ముఁ డరుగుత్రోవఁ
గలదు చెందామరకొలను దత్తటమున మృగముఖ్య చచ్చినపగిది నుండు
నేమించి యొదల నిలిచి లోఁ జెవులను ముకుగోళ్ళఁ బొడుచున ట్లొకట గన్నుఁ
గ్రుడ్లూడ్చి మెసవులాగున నుండు ముండినవాపూఁట కచ్ఛపనాథుఁ బ్రోవ
తే. వేగఁ గెడించి యస్సీచు వెనుకఁజేసి, యరుగుమచ్చక్కికనికూర్చి యనుచుటయును
ఖగమృగాధ్యక్షు లరిగి రాఘునులపజ్జ, నంత నంతట దాను నరుగుచుండె. 233
సీ. చిత్రాంగదుండు చచ్చినవానిగతిఁ బురస్సరణసరస్తీరధరణినుండె

వానిమ స్తకమున వ్రాలి వాయసకులాగ్రణి కను గ్రుడ్డులు గటిచి పెటికి
కొని తినువానిలాగునఁ గావుకావున నఱచుచు మ్రుటియించునంతలోన
నరుగుచున్న కిరాతుఁ డగ్రభాగమునఁ జిత్రాంగుఁ గని మేనుపొంగ నురక
తే. కలిగెఁ దకతేర నేతన్నగం బనుచును, మందరకు డించి కాకి బల్మిఁ నదల్చి
కొనుచుఁ జనుచోట మూషకకులవిభుండు, కూర్మవల్లభుబంధము ల్గొరికెనెపె. 234
క. కొరికిన మందరకుఁడు దె, వ్వరపుఁపడింబఱచి సరసిఁబడె మూషకరా
జారికె మృగవాయసంబులు, తెరఁగొప్పఁగలేచి రెండుదిక్కుల కరిగెఁ. 235
తే. అట్లు విఫలప్రయత్నుఁడై యడవిఁబాసి. విన్నబాటునఁ జనియెను వేఁటకాఁడు
కమఠమూషకమృగమహాకరటవిభులు, గాఢతరమైత్రిఁ బొదలి రత్కంఠనందు.
వ. సుహృల్లాభంబున సాధింపరానికార్యంబులు గలవేయని సుదర్శనకుమారులకు విష్ణు
శర్మం డెరింగించె నెరింగించిన. 237
క. విని రాజకుమారకు లన, ఘ నయాంశవిలాసదివిజగురు నిజగురునిఁ
గని మూఁడపతంత్రము పొ, యునిధీ మాతోడఁ జెప్పుమని యడుగుటయుఁ. 238
మ. అతికారుణ్యకటాక్షసర్వభువనా శాధ్యక్షరాధాసుత
ప్రతిపక్షప్రియచర్యకల్పకనిశా రాద్ధుర్యచక్రత్రిశూ
లతిరోభూతరవిప్రభూతశుభలీలా పూతరూఢాంధకా
హిత తేజోవిభవప్రచారణదయాహృష్టస్ఫురద్వారణా. 239
క. మాయాతీతమహానిత, కాయఘటీకృతమరున్నికాయతపస్వి
ధ్యేయ నిజభక్తరక్షో, పాయ విభూతిప్రధానపాండిత్యనిధీ. 240
మాలిని. నిరుపమితమహాత్మా నిశ్చలానందతత్త్వా, నిరతసుఖితలోకా నిత్యపుణ్యావలోకా
గరుడవృషపతాకా ఖండితానన్యశోకా, మరణజననదూరా మానిచేతోవిహారా.
గద్యము. ఇది శ్రీవేంకటనాథ కరుణాలబ్ధ సరససాహిత్య నిత్యకవితావిలాస సకలసు
కవిప్రశంసా భాషణోల్లాస రాజకులపారావార పర్వశర్వరీరమణ నీతిశాస్త్రమార్గప
రిశ్రమణ ధైర్యపర్యాయ ధిక్కృతనీహారపర్వత పర్వతరాజకుమార నిస్సహాయ
ప్రబంధనిర్మాణ భోజభూదార సుధామధుర భాగతీసనాథ వేంకటనాథప్రణీతం
బైన పంచతంత్రంబునందు సుహృల్లాభం బన్నది ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

# శ్రీరస్తు.

# పంచతంత్రము.

## తృతీయాశ్వాసము.



మద్వ్రపాకపాయీ
రామాసాపత్న్యరోషదసక్రత్వరతో
భూమాముకుటివ్యోమధునీ
వ్యామిశ్రకటాక్షవీక్షహరిహరనాథా. 1

వ. దేవాసంధివిగ్రహాభిధాన తృతీయతంత్రం బాకర్ణింపు మధీతనీతిశాస్త్రమర్మం డగు
విష్ణుశర్మండు సుదర్శనకుమారుల కిట్లనియె. 2

క. ఆకడ వీరుం డగున, స్తోక ప్రతిపక్షుఁ బెనిచి తుది రాజుచెడుం
గాకంబుఁ జేర్చుకొని నత, లోకబలోద్రేక మొకయులూకము చెడదే. 3

క. నావిని రాజకుమారకు, లావిప్రుని జూచి చిత్రమది చెపుమా భూ
దేవకులోత్తమ మాకును, దావహాముగ ననినవారి కతఁ డిట్లనియెన్. 4

చ. మధురనభోమణిద్యుతిసమంచితరత్నవిరాజమానధా
మధురవిలాసినీశ్రవణమంగళరాగపదీరితేక్షుహృ
న్మధురదురంతసంప దభిమానతృణీకృతరాజరాజది
ఙ్మధురచెలంగుఁ బాండ్యమహీమండలిఁ దన్నికటాయతాటవిన్. 5

చ. ఘురుచివిద్యుదర్చిఁ దెలుపం బలిభుగ్రుతు లుగ్రగర్జలై
రొలయఁగ బెల్లుగా డిగినయూడలు పుష్కరవర్షధారలై
నిలువఁగ వార్షికాభ్రసరణిం గగనస్థలచుంబియై దళ
ద్దళములకల్మిఁ గార్కొనుచు నుదగ్రవటం బొకఁడొప్పు నున్నతిన్. 6

చ. నటన ననేకకాకపృతన ల్ప్రతివాసరము న్భజింప న
వ్వటమున మేఘవర్ణుఁ డనువాయసవల్లభుఁ డుండు వాని క
త్కటభయకంపనంబు లెసఁగ న్నికటప్రకటాటవీకుటీ
ఘటమునఘూకసేన గొలువం బెనుగూబయొకండు నెప్పుడున్. 7

ఉ. ఆయరిమర్దనుండు మది వచ్చలమెచ్చఁ గృతాంతవాలసా
లాయుధకంఠఘోర తిమిరాకులమౌ నొకనాఁటిచీఁకటిం
బాయనిఘూకసేనఁ బనుపం బెనుపొందినమత్త్రి కేడ్తిఱం
బోయి యజాగరూకబలిభుక్పటలిం బరిమార్చి పోయినన్. 8

క. ఆచెంతిఁ గరటవిభుఁ డొక, కోటరగర్భమున నణఁగికొని యుండుట నా
చేటోదవదయ్యె వానికి, నాఁటికి నదిపోయె మఱుసు నాఁ డుదయమునన్. 9

వ. హతశేషానుజీవకోటిం గూడుకొని యతనిమంత్రు లుద్దీపియు సందీపియుఁ బ్రదీపియు నాదీపియుఁ జిరజీవియు నను వారేవురుం గలసి రంత నందఱం గలయం గనుంగొని మేఘవర్ణుం డిట్లనియె. 10

ఉ. మ్రాఁకున నిద్రవోవ నరిమర్దనుపంపున వచ్చి ఘూకముల్
గాకముల న్వధించె నిది కర్కశపుంబని నిర్వహించుటె
ట్లీకడ నీతికార్యపరు లిందఱు వోలినభంగిఁ జెప్పఁడా
నాకిపుడంచు రాజడిగిన న్వినయవ్యతిషంగచిత్తుఁడై. 11

వ. ఉద్దీపి యిట్లనియె. 12

క. ఈదృశబలవంతులతో, వాదులకుం దించి బ్రతుకవచ్చునె యొండేఁ
బోద మఱి స్థలకిది మర్యాద వృథా పాలిసిపోవ నగుఫలమేమీ. 13

క. అనువచనంబులు వాయస, జనపతి విని యానతిచ్చె సందీపికి నీ
వును నొకకార్యముఁ జెపుమా, యను డాతఁడు విహితహృదయుఁడై పతికొగి మై,

క. ఇది యొకపక్షమున మంచిది యగు నగుఁగాక యేమి చిరవిక్రమసం
పద గలరాజున కుచితమె, సదనత్యాగంబు మానుషమ్యతిగాదే. 15

క. స్థానంబు సకలఫలసంధానం బొనరించుఁబతికిఁ దగనజకంఠ
స్థాన స్థనమిడునె యథా, స్థాన స్థనభంగి మధురతరదుగ్ధంబుల్. 16

క. చేవఁగలభూమిపతు లటు, గావునఁ గోరరు విదేశగమనము దేవా
నీవెఱుఁగని కార్యములుం, ద్రోవలు మఱియెవ్వరెఱుఁగుదురు లోకమునన్. 17

వ. అనుమాటలు విని రాజు ప్రదీపి నాలోకించి తోఁచినకార్యంబుఁ జెప్పుమని యడిగిన నతండు. 18

చ. తడయక బాలవృద్ధవనితాజనతాదులవైరికోటికిం
గడువడిఁ జంపు మంచనిదుకంటె నయంబున సంధిసేయు టే
ర్పడ నుచితంబు వైరుల నపాయబలాఢ్యులు రాత్రిచారు లె
ట్యెడఁ దగదీరసంబు బలహీనులకు న్వనబోటివారికిన్. 19

క. ఈవాలువచ్చి తేవం, జావంగా నున్నవారిఁ జంపెద రహితుల్
దేవా సంధి యనూనతఁ, భావహ మొనరింపు మస్మదాదేశమునన్. 20

వ. అనుభాషితంబు లాకర్ణించి యధిపతి యాదీపనడిగిన నతం డతని కభిముఖుండై 21

క. సంధికిఁ జనుఁడె ట్లరులు దివాంధులు బలదుర్నిరీక్ష్యులయ్యును దుస్సం
బంధ మిది గాదె మనము ని, శాంధుల మెట్లమరు దూత కరుగం దిరుగన్. 22

క. అటుగనుక సంధికార్యం, బెటువలె నొడఁగూడు రాత్రు లెదిరికి నెల వి
ప్పటికి మనకదను పగలు, త్కటగతిఁ జని సంహరింపుదము పగవారిన్. 23

వ. అని యుద్దీపి ప్రదీపి సందీపి యాదీపులు తమకుఁ దోఁచినట్లు చెప్పిన విని మేఘ
వర్ణుండు చిరజీవి నాలోకించి. 24

క. ఈతం డితఁ డితఁ డీతఁడు, చేతోగతిఁ దోఁచినట్లు చెప్పిరి పథ్యం
బై తోఁపదు కించిత్తుం, దాతా నీవేమి చెప్పెదవు నాతోడన్. 25

క. నీసద్బుద్ధిబలంబునఁ, జేసెద రాజ్యంబు నేఁ డకేయదివాంధ
త్రాస ముదయించె నీకిది, పోసమయము ప్రాప్తకాల ముపదేశింపన్. 26

క. హరిపరిణామమునకు ని, ర్భరనీతిపయంబు గురుఁడు బలె నాభద్రం
బరయుటకు నీవె కాక, యెవ్వరు నాఁ జిరజీవి మేఘవర్ణుని కనియెన్. 27

క. అఘునయవినయనిధు లీ, నలువురు విన్నపముఁ జేసినా రిమ్మతిమం
తులకంటెఁ గార్యనిశ్చయ, బలమున నధికుఁడ నె యంతపాండితి గలదే. 28

తే. వీరు నీకుఁ బరమవిశ్వాసఘుటకులు, వీరినీతిరీతి వినుట యొప్పు
నైన నాకుఁ దోఁచినంతయు వినుపింతు, నేకతంబువలయు నింతదడవు. 29

క. హితుఁడని యొకనికిఁ జెప్పిన, నతఁడును దనకూర్చుసఖుని కది దెలుపు నర
క్షితమై నృపమంత్రం బీగతిఁ బలువురు వినుటఁ జే విఘాతత నొందున్. 30

క. అతిగుప్తమయ్యు మంత్రము, హితనికరశ్రుతము చేత నివురంబడు ని
కృత యొత్తిఁగి ప్రాంతిజనసం, గతి రాజు రహస్య మొసఁగి కావఁగవలయున్.

వ. అని యేకాంతంబు వడసి చిరంజీవి మేఘవర్ణునకు సంధివిగ్రహయానాసనద్వైధీభావ
సమాశ్రయంబు లనుగుణంబులుం బ్రారంభోపాయపురుషద్రవ్యసంపద్దేశకాలవిభాగ
వినిపాతప్రతీకారంబు లనునంగంబులు సామదానభేదమాయోపాయంబు లనుచతు
రుపాయంబులుఁ బ్రభుమంత్రోత్సాహశక్తుల విచారించి యం దుచితం బగుదాని
నంగీకరింపుము నాకుఁ దోఁచినకార్యం బొక్కటి ప్రతిశత్రు లుదగ్రసత్త్వద
ర్పులు మనకు సమరసామర్థ్యంబు చాలదు దేశకాలంబులు విచారరమణీయంబులు.

క. హానొదవునంతకుం జనఁ, గానక బకముం డుకరణి ఘననీతిధనుం

డైనయుతఁ డూరకుండుం, దానహితుఁడు చిక్కువడినదను కలిశాంతిన్. 33

క. తనసత్వ మెదిరిసత్త్వముఁ, గనుఁగొన కెవ్వాఁ డఖర్వగర్వమునం బో
రునకుఁ దుదఁ గాలు ద్రవ్వు, న్వాను మమ్ముష్కరునిఁబొందు విపదోఘంబుల్. 34

చ. సురియఁకరంబునం గొనక శూరుఁడు నీతి కళావిలాసభా
సురుఁడు వధించువైరి విసుం దవుదవ్వులఁ జెంతనుండియున్
సురియ ధరించియు న్మగువచొప్పున నేమియుఁ జేయలేఁడు త
న్నెరలఁగఁ జేయుమానవనికృష్టుఁడు మాటలు వేయునేటికిన్. 35

క. తాలిమియు ధృతియుఁ బ్రజ్ఞా, శీలతయుఁ బరాత్మగుణ విశేషజ్ఞతయుం
గాలోచితశౌర్యము గల వాలుమగం డేలువార్ధివలితధరిత్రిన్. 36

క. సిరిపొందును పాయకశా, పరిణతుఁ డనుఁ దానపాయపారగుసభయుం
బరుషోక్తిఁ జేరరాదిం, దిరకేలం గురులఁ బట్టి తివిచినయినన్. 37

క. గృహపేటినుండునుం త్రో, త్సహనాథ్యునకు న్రమాభుజంగినుమంత్ర
గ్రహణవిమూఢున కదిదు, స్సహభీతి ననారతంబు సంపాదించున్. 38

క. మతిమంతుఁడు శాంతుఁడు వి, శ్రుతగుణసంసిద్ధుఁడు న్విశుద్ధుఁడు నీతి
ప్రతిరహితుఁడు బలసహితుఁడు, గతభయుఁ డనఘుండుఁ గార్యఘటకులుసుమ్మీ.

వ. విశేషించి యిట్లుచెప్పవలసి చెప్పితిఁ గాని యుద్ధ మిప్పటికి నకరణీయంబు. 40

సీ. కోశమంత్రములు దక్కువలు గాకుండినఁ గలుగులెక్కలకు నగ్గలము బలము
శాంతులు నిర్మలస్వాంతులు విక్రమోదయులు నిర్భయులును ధర్మమయులు
కఠినశాత్రవుని సాగావిత్తవంతుని వేల్పుగాఁ జూచి సేవింతు రెపుడుఁ
బ్రభుతసహాయనిబంధనం బనిచెప్ప విందుము నీవును వింటివట్లు

తే. కులము గుణము రూపు చెలువంబు మురిపంబు, మానధర్మవిక్రమక్రమముల
వానిఁ జూడ దబ్జవాసిని నిరపాయ, శూరసంగ్రహంబుఁ జూచినట్లు. 41

క. ఏరీతి జైత్రయాత్రా, ప్రారంభము సెల్లుఁ బతికిఁ బ్రజలేమి నభి
శ్చారత గూడునె పక్షికి, భూతిబలాఢ్యత్వపక్షములు లేకున్నన్. 42

క. ఘోరారివీరపారా, వారం బెప్పాట దాఁటవచ్చు సహాయా
ధారతతి తారఁ గోరక, పౌరుషసంపన్నుఁ డగునృపాలాగ్రణికిన్ 43

క. ధనమంత్రసహాయంబుల, నొనరినభూవిభునకన్నియును గలవట్ల
య్యనుసమరముకరణీయము, చననేరదు సంధి సహజశత్రుల మగ్గుటన్. 44

వ. ఘూకంబులకుఁ గాకంబులకు సహజవైరానుబంధంబుననకాదె వాక్పారుష్యం బెవ్వ
రికిఁ జేటుఁజేయదు. 45

క. భీషణశార్దూలతనూ, వేషము దన కమర దొల్లి విశ్రుతసస్యా
న్వేషణతత్పరమతివా, గ్దోషంబున నొక్క ఖరము గ్రుంగదె పుడమిన్. 46

క. నావిని వాయసపతి చిర, జీవికి నిట్లనియె నీతిశీలా యేలా
గీవిధము దేటపడఁ జెపు, మా వినియెద ననిన నతని కతఁ డిట్లనియెన్. 47

క. ఒకపురి నొకచాకలవాఁ, డొకదిక్కున నొకనిచేత నొకగాడిదె ని
ల్వకఁ బుచ్చుకొనియెఁ జౌక, ప్రకరపటీభృతికి మేనుబటువై యునికిన్. 48

క. వలువలు చలువలు సేసెను, నెలవునఁ బగలెల్ల నిలిపి నిశి యగుటయు న
ప్పులుగాకి చాకి పెనుగ్రో, ల్పులిచర్మము గప్పి సస్యముల కగవిడుచున్. 49

క. అది కడుపుకొలదియును దిని, సదనమునకు మగిడివచ్చు సరిప్రొద్దున ని
ట్లుద నరసి యరుగఁ దిరుగం, బోదిచెడియుం బైరు గొన్ని పూఁటలు చనియెన్ 50

క. పొల మరయు కర్షకులు మదిఁ, బులి గాఁ దలపోసి భీతిఁ బులిపులి యనుచున్
దలసాలవెడల రందొక, హాలికుఁడు శరచాపహస్తుఁడయి నిశ్శంకన్. 51

క. నెలవోడిచినధూసరరుచిఁ, గలగొంగడిముసుఁగుఁ దిగిచి కడువడిఁ దనయి
ల్వెలువడి చని కని తనముం, గలబొంచినవానిఁ జెండి గాడిదె యనుచున్ 52

క. మెందుగ నుత్థాపించిన, దండము గమనమున కగ్గుఁదలఁపఁగ వీనుల్
బెండువడ నొండ్రపెట్టుచు, దుండగపుఖరంబు దన కెదుర్పఱ తేరన్. 53

క. హాలికుఁడు నీవాయనుచుం, జలివిడిచి ప్రహాస మెసఁగ శయములఁ గాళ్లం
బిలపిల నెదురుగఁ బఱచిన, నలగాడిదెయుం గువాళినజతికివచ్చెన్. 54

వ. వచ్చిన. 55

క. తగిలి తనపైరు మేసిన, పగ యగ్గలమగుటఁ గినిసి పటుముష్టిని వి
ల్దిగిచి ఘనతరశరంబునఁ, దెగ జేసిన గార్దభంబు ద్రెళ్ళెం బుడమిన్. 56

· ఇది వాగ్దోషఫలంబని వెండియు. 57

క. అనిచెప్పిన చిరజీవిం, గని వాయసరాజు పలికెఁ గౌశికములకున్
మనకు న్బగ వాగ్దోషం, బునఁ బొడమె నంటి విదిచెపుము వినవలతున్. 58

వ. అనినఁ జిరంజీవి మేఘవర్ణున కిట్లనియె. 59

చ. అపరిమితానురాగమొలయ న్వలయాద్రిపరీతభూపత
త్రిపటలిమంత్రగూట మొనరించి మదాంధదివాంధము న్మహో
త్కుపితముఁ బక్షిరాజ్యమునకుం బతిగా నొనరింపఁ బూనియు
న్నపు డొకవృద్ధకాక మటకై యరుదెంచినఁ బుల్గులన్నియున్. 60

క. ఖెడవెడ నొండొకకొండొక, తడవు విచారించి సమతఁ దమలో ననియెన్

జెడకిడి బహుకాలంబులు, గడపినయడిగాన యుచితగతి నెఱిఁగించున్. 61

వ. కార్యాలోచనంబున నిందఱ మసమర్థులము కార్యనిర్ణయసమర్థం బగుదీని నడిగి చూతమే యనుచు నాతిథ్యం బాచరించి పరివేష్టించి తమయభిప్రాయంబుఁ జెప్పిన నప్పక్షులకు వాయసాధ్యక్షుం డిట్లనియె 62

సీ. కర్ణహృత్పుటసూచికాయమానోత్తాలవికటఘోషము విన్న నెగటుగాదె
కాలకాళోదరోగ్రస్ఫుటాస్ఫుటముఖం బాలోకనముసేయ నళుకుగాదె
భ్రమదుల్ముకభ్రాంతిభాగవీక్షణదృష్టిసరణిఁ ద్రిమ్మరుచుండ జాలిగాదె
కర్కశవ్యాయామగరుదమంగళమరుత్ప్రీతతిసోఁకినఁ బీడవట్టుకొనదె

తే. దారుణాకార మప్రియదర్శనంబు, ప్రకృతిరౌద్రంబు క్షుద్రం బపక్షమంబు
ఘూక మేయూఁగు పికశారికాకలాప, కీరికాముఖభరణ మేయూరు చెప్పుఁడ. 63

క. దారుణదృష్టివికారా, కార మతిక్రూర మహముఁ గానదు కరుణా
దూరం బెట్లయ్యెడు రక్షారంభం బెఱుఁగఁ జెప్పుఁడా వినవలతున్. 64

క. వ్యపదేశక్రియ మెఱసిన, నృపు నింపెసలార నాశ్రయించినఁ గలుగున్
విపులసుఖ మమృతకిరణ, వ్యపదేశతఁ గుశలమంద దాశశ మడవిన్. 65

క. అనుకాకమునకుఁ బులుఁగులు వినయంబునఁ బలికెఁ దెలుపవే శశకం బ
వ్వనజరిపుని వ్యపదేశం, బున భద్రముఁ గనుట గరటముఖ్యా మాకున్. 66

వ. అని యడిగిన వాయసపుంగవం బవ్విహంగంబులకు నిట్లని చెప్పందొడంగె. 67

మ. అగళద్దుర్భరతీక్ష్ణభాస్వదభిషువ్యాఘాతపాతక్షుర
న్మృగ మస్తక్షతజంబు పల్చబడుమగుద్వృద్ధత్రిధామజ్వల
న్మృగ మంతర్జలనిర్ఝరంబు మృగతృష్ణావాహినీ సంచితా
ధ్వగ ముష్ణాగమమయ్యెఁ దొల్లి పురజిత్ఫాలాంబకాభీలమై. 68

వ. అక్కాలంబున. 69

చ. జలధరము ల్దరాస్థలికి జాఱెనన న్దిననాథరశ్మికిన్
దొలఁగ కహో బయల్త్మెఱసెనో తిమిరంబులు నాఁగజంగమా
ద్రులగతి గండకంపితగిరు ల్దరులారయ లెక్కకెక్కుఁడై
యలఘుమృగేంద్రభీతిరహితాటవిలో విహరించు నేర్పడన్. 70

క. ఏకసరోవర మగునల, భీకరగహనమున నిలువ బెగడి పిపాసా
వ్యాకులితమానసము లపు, డాకరు లిట్లనియె యూథపాధ్యక్షునకున్. 71

క. ఇచ్ఛోటిసరము శరముల్, నిచ్చలుగొన నివిరె మేఁపునీళ్ళకయో ని
ష్పచ్చరమై యెవ్విధి మన, పచ్చ నవారిగఁ బ్రవారివలె మాకౌనన్. 72

క. ఆపాతాళగభీరప, యోపూర్ణమహాప్రమాణమైనను గూపా
రాపరిమితసరమైనం, జూపుము విఱువిఱుకపోవఁజొచ్చెం దనువుల్. 73

వ. అని పదనోదకంబులఁ జూపి విన్ననయి యున్న నన్నిచదళపశావల్లభుం డరసి నిమి
షంబునం దడయక యప్పటికి సత్వక్షీణంబులు గానివానిఁ గొన్నిగజంబులం
బిలిచి యనుజీవులారా యప్రతిహతమనోరథంబుల గహనఘంటాపథంబులం బఱచి
యగాధతరం బగుసరంబుఁ గనుంగొని రండు పొండని నియోగించిన. 74

సీ. మదవనేచరవధూమధురగానధ్వానవివశకుంజక్రోడవిషధరములు
పరిపక్వఫలవిలుబ్ధస్వర్ధరోమ దంష్ట్రాటంకభిన్నగోత్రారుహములు
ధరచరత్పవనబాంధవదవ వ్యాప్తధూమధూమాకల్పితమేఘదుర్దినములు
చరమదిఙ్ముఖపతజ్జరఠకాసరవిరక్త వ్యాఘ్రభీతఖడ్గవ్రజములు
తే. సవనతరసరసస్తేయసారమేయ, దశనదంశనిష్పాణితరుణహరిణ
నాభిసౌరభ్యదశదిశాంతస్థలములఁ, ఘోరకాంతారములు కొన్నికొన్ని గడచి. 75

క. సరిసెరసి మెఱసి బిలములు, దరిసి ధృతు ల్బెరసి దొరసి దంతావళముల్
వరశిఖరం బగు నొకమల, సరస న్సరసాతసరసి సరసి న్గనియెన్. 76

వ. తత్సరోవరం బావిష్కృతి పుష్కరంబు గావున యాదవస్థానంబును మత్స్యకూర్మ
విలాసభాసురంబు గావున యోగిరాజును బ్రకాశితాహిమకరంబు గావునఁ బ్రాతః
కాలంబును నధిగతబ్రహ్మరథంబు గావునం బర్యాప్తవితానంబును నారాధితారి
కులంబు గావున నపారబల సంపన్నంబును బకవిహారయోగ్యంబు గావున నేకచ
క్రపురంబును నూర్మికాభిరామంబు గావున నలంకృతుం బురుడించి యొప్పుచుండు.

క. కని యనురాగరసాబ్ధి, న్మునుము నోలాడి భిన్నముఖకమలవనీ
ఘనపరిమళగుణచిక్కణ, వనజాకరవారిలో నవారిగ నాడెన్. 78

ఉ. ప్రావృతచూతపోతమృదుపల్లవపారణకారణంబునన్
లావుపహించి సొంపు వొదల న్బొదలం బదలాఘవంబునం
బోవఁగఁ ద్రోయుచు న్మరలిపోయి సరోవరలాభవార్త యా
క్రేవఁ జరించుయూథపతికి న్వినిపించె గజంబులన్నియున్ 79

ఉ. చెప్పిన నప్పు డుల్లసిలుచిత్తమునం గరిరాజు గౌరవం
బొప్ప మహాహితద్విరదయూథముఁ దోకొనిపోయెఁ బోవ నా
చొప్పున దాఁటిపోవ నొకచోటును గానక తత్పదాహతిం
జిప్పలు గుల్లలై పొలిసె శీఘ్రమె పెక్కుశశంబు లచ్చటన్. 80

సీ. అచ్చోటఁ జూచియు నంతశిలీముఖుం డనుశశరాజు దైన్యపడంచి
ఘనుగుచు మంత్రుల కిట్టులనునీతివిధులార యద్ధికి వారివాహములకో లె

సరమున కలఘుతృష్ణాభరంబున నేఁ డవారణ నీదారివారణములు
పఱతెంచుచున్నవి పరికింపు మల్లవె కుందేళ్ళు వీని త్రొక్కుళ్ళ మడిసె
తే. ద్రాసకర మైనయీశశప్రళయమునకు, నకట యెబ్భంగి శాంతికార్యంబు దొరకు
నేమి సేయుదు ననునంత నెదుర నిలిచి, వివితనీతికళాశాలి విజయుఁ డనియె. 81

క. దేవా నేఁ గలుగఁగఁ జిం, తావారిధి నేలమునిఁగెదవు శశములకుం
గావించెద శుభ మిథముల, రావిడునం జూడు నాపరాక్రమ మనుడున్. 82

క. పలికె శశరాజు గాఢో, త్కలికన్నయనిధి దేశకాలవిభాగం
బులు నీక తెలియు నిట నీ, కలిమిఁ గ్రియాసిద్ధి యెట్లు గాలేకుండున్. 83

క. ఆలస్య మకర్తవ్యము, కాలం బారంభమునకుఁ గరుబుదరుల౯
దోలి శశప్రాణంబులఁ, బాలింపుము నీయుపాయపాటవ సుమర౯. 84

క. అని యాజ్ఞాపించిన నయ, వినయపరాక్రమవిధానవిజయుఁడు విజయుం
డనిలరయంబున నెదురుగఁ, జని యూథపుగాంచి మానసము గలఁగుటయున్. 85

క. గజమంటినట్ల యడచు, న్భుజగము మూర్కొనినయట్ల పొరిగొను ధరణీ
భుజుఁడు నగినట్ల చంపుం, గుజనుఁడు మన్నించునట్ల కొను బ్రాణంబుల్. 86

క. కావునఁ గరినికటమునకుఁ, బోవం గార్యంబు గాదుపో యిపుడు మహో
భావనమున నుపకంఠ, గ్రావాగ్రం బెక్కి ముఖ్యకరిఁ బలికింతు౯. 87

చ. అనిగిరి నెత్తమెక్కి శశ మగ్గజవల్లభుఁ జూచి యిట్లనుం
గనలున నీకు రాఁబోలముగాదిది నిల్మిలు చందమామ న
న్ననుపఁగ వచ్చితిం బయనమై యలజాబిలిలో శశంబుగా
మనమున నన్నెఱింగికొనుమా యన దంతి పతంసుఁ డిట్లను౯. 88

క. ఏమినిమిత్తము శశక, గ్రామణి నిన్నిటకుఁ బంపెఁ గైరవమిత్రుం
డామాట తేటపడఁ జెపు, మా మాకన విజయుఁ డగ్గజాగ్రణి కనియె౯. 89

క. హేతులు పైఁబడునప్పుడు౯, దూతలు సత్యంబుఁ బలుకుదురు తద్భాపా
వ్రాతమునకుఁ గలఁగరు ధా, త్రీతలవల్లభులు నగగు తెగ రెప్పటికి౯. 90

క. అలనెల తనమాటలుగా, నలవున నీతోడ నాడుమని నన్ననుప౯
దలమోఁచి చెప్పవచ్చితిఁ, దెలియ న్విను యూథపతిలక యప్పలుకుల్. 91

ఉ. చారువిచార యిక్కొలను చంద్రసరోవర మిందుఁ దారకా
ధారుఁడు చంద్రుఁ డిష్టవనితాజనతాయుతుఁడై యభీష్టసం
చారవినోదము ల్సలుపు సంతత మున్నను మట్లుగాన నె
వ్వారికిఁ బోవరా దెఱుఁగవా యిట కిత్తెఱఁ గింతవింతయే. 92

చ. నిరతము నీయరణ్యధరణీసరణిం జరియించునీశశో
త్కరములు నాకుఁ జుట్టములుగాఁ బరికింపుము చంద్రనీరజా
కర మతిభీకరంబు తడగాఁ జను నా విహితోపదేశ మా
దరమున వీనుల న్జొనుపు దవ్వుఁ లవాఁడవుగాక నీతికిన్. 93

చ. సరసికి మీరఖండశరభసంబున రాఁ బరికించి యాసుధా
కిరణుఁడు నేఁడు మేరుగిరికేసరుల న్మిముఁ జంపఁ బంపఁగాఁ
పరశువు గోరఁబోవుపనిషట్టున నేమిటికంచు మాన్చియీ
తెరువున మిమ్ము నిల్పఁ జమదెంచితి నీతిపరుండఁ గావునన్. 94

క. చావక నోవక యాదల, పూ వాడక నానియోగమున నెందైనన్
బోవుట శోభన మన దం, తావళ మిట్లనియె శశవతంసంబునకున్. 95

సీ. ఆదిచంద్రకాసారమాసారమానసతారలు దారలై తనుభజింప
జలవిహారం బందుసుఖపునె నిలుపునె యొరులెవ్వరిటకు రాకుండ విధుఁడు
పంచాననముల మాపైఁ బంప ననుకంప మాన్చి యేతెంచితె మమ్ముఁ గావ
నీవంటి కారుణ్యనిధి యున్నభవములం గలుగు నీకతమునఁ గలిగె బ్రతుకు

తే. మగిడి పోయెద మనుచు నమస్కరింపఁ
బ్రత్యయమువుట్ట నక్కరి ప్రవరుఁ గొనుచు
విజయుఁ డారేయి కొలనిలో వెలుఁగువానిఁ
జంద్రు ననుబింబితుని జూపి జరుగుమనియె 96

వ. అవ్విజయు నియోగంబున దంతిపతి వనాంతరచింతం బఱచె వంత శిలీముఖప్రము
ఖశశంబు లానందించె గజంబులఁ దిరుగఁ ద్రిప్పుట శశంబుల ప్రళయంబు మాన్చు
టచంద్రవ్యపదేశంబునం గాదే యట్లగుటఁ బ్రసిద్ధుం డగు రాజు నాశ్రయింప
వలయు దాన సుఖలాభంబులు దుఃఖక్షోభంబును నగు నీయులూకంబు ప్రసిద్ధం
బగురాజ్యంబున కర్హంబు కాదని చెప్పి కాకంబు వెండియుం బులుఁగుల కిట్లనియె.

క. సముచిత మెఱుఁగక క్షుద్రుం, గ్రమరహితు గుఱించిపోవఁ గడుఁగీడొదవున్
దమలో నొంటక మార్జా, లముడగ్గతి శశకపింజలంబులు దెగవే. 98

క. నావిని విహగములను నయ, కోవిద యారెంటికేల గొదగొదపొడమెన్
జావేఁబచ్చె నోతువు, చే వానికి నింతపట్టుఁ జెపుమా తెలియన్. 99

చ. అని తను వేఁడుకొన్నఁ గరటాగ్రణి పక్షులఁ జూచి యిట్లను
న్వినుఁ డలవింధ్యభూమి నొకవీరమహీరుహమూలకోటరం
బునికి యొనర్చి యుమ్మనికినుండుఁ గపింజల మప్పతత్రితో
నెనసి కుజైకదేశమున నేనును నుండుదు సఖ్య మేర్పడన్. 100

చ. తగ గగనప్రచార మవితారవిభాకరుఁ డస్తమింపఁగా
ఖగము నగంబుఁ బాసి పలుకందువల న్బనుమంద పెంటలం
జిగి నిగుడం జడత్మెదలు చేఁ డెలపండిరపూరి వాయలం
బొగసినపాళ్ళ మేఁపుఁగొనఁబోయి హుటాహుటి రాకతక్కనన్. 101

ఉ. డేగకుఁ జిక్కెనో యురువడిం ధృతి గాడ్పడి దవ్వుపోయెనో
లాగము దక్కి మచ్చువలలం బడెనో వెరవేదిపాది నెం
దేగెనొ పుట్టలెక్కి కర మేమఱి పాములచేతఁ జచ్చెనో
యేగతియుంచునో తెలియ దింతయు రాఁడు పయస్యుఁ డక్కటా. 102

క అని బాష్పవారిధార, ల్గనుదోయిం జెమ్మగింపఁగా నలుదిక్కుల్
గనుఁగొనుచు విశోకుఁడనై, చన నేరక యుంటి నన్నిశాసమయమునన్. 103

శా. ఆహా కృచ్ఛపలావిలాస మఖిలప్రాణిశ్రుతివ్యగ్రగ
ర్జాహంభావసమగ్ర ముగ్రరయనద్యంబూత్థితాంభోనిధి
వ్యూహం బాహతకాననజ్జ్వలన మోహో మింటితో ద్రేలఁ గా
లాహిం గట్టినచాడ్పునం గురిసె ఘోరాసార మచ్చీఁకటిన్. 104

క. అలజడి యాలజడిచేతం, గలఁగి మహాశకము దీర్ఘకష్టం డనువాఁ
డలఘుకపింజలకోటర, నిలయంబున నంఘ్రులూఁది నెమ్మదినుండెన్. 105

క జడిగొన్నవాననేనుం, దడిసితి నాలో నొకింతదపవు కాన
వ్వడి సడలె నడఁగె నుఱుముల్, నిడిమించులు మాసె వెలుఁగు నిలిచె న్వాలిచెన్.

ఉ టెక్కునఁ బ్రాంతపక్కణకుటీశిఖరంబుల టెక్కలార్చుచుం
గుక్కుటకోటి మ్రోసె నెసగూరుమిటారులపుట్టినిల్లు గ
బ్బెక్కువమబ్బుతెరలగుచు లీఁగె దిశ ల్వెలుఁగొందె నిక్కలం
జక్కవజోళ్లు గేరె జలుఁ జాతహితుం డుదయించెఁ దూర్పునన్. 107

క పొలమున మేఁపాడి కపిం, జలమత్తతి మరలివచ్చి శశము నివాస
స్థలిఁ గనుఁగొని యదలింపుచు, నంఘుతరక్రోధహృదయమై యిట్లనియెన్. 108

శా ఓరా కన్గొన మెంచు నీతగవు లెస్సాయెం బురేయెవ్వరి
ట్లూరం బుట్టనివింత యన్యగృహమందుండ న్విచారింతురే
రాహాపు ల్గాఁబిగాపు నేఁటి కొకనేరం బోర్చితిం జాల మో
రోరీ యెచ్చటికైనఁ బోయెదవొ పాపో యింతక్రొవ్వేటికిన్. 109

క. ఇది నాయది నాకేళీ, సదనము నీకిందు నిల్వఁజను నె దురాత్మా
మదటతన ముడిగి యుంతేఁ, గదలుము లెమ్మనిన దీర్ఘకష్టం డనియెన్. 110

చ. బిరుసులుపల్కి నన్ను వెఱపింపఁదలంచెదొ కట్టిపెట్టు నీ
గరువము వెట్టి యీశకశిఖామణిముందర నేడ నెవ్వరె
వ్వరు పనియించి యుండి రది వారిద కాననభూమిజాతకో
టరముల నాఁపువెట్టెనె యొడంబడి పక్షుల కుర్వి చెప్పుమా. 111

క. చెఱువులు బావులు గృహములు, తరువులు వృత్తులు ననారతము గాచినయా
వరుసయది యనుచు మనువుత్తర మొసఁగఁడె తొల్లి దేవతా సంతతికిన్. 112

క. బలవంతుఁ డైనధరణీ, తలభర్తకుఁ బోలునిట్టితగ వకటవకటా
పులుఁగులకును గుందేళ్ళకుఁ, బలుకులు వేయేల చెల్లుబడి గాదుసుమీ. 113

క. జగతీరుహవివరమునకు, ఖగనాథా నీకులేదు కారణ మేలా
తెగిపోర నాకు నీకుం, దగ వెక్కడికేని నరుగుదము ధర్మనుడున్. 114

వ. మదీయమైత్రిమంజాలం బక్కపింజలం బిట్లనియె. 115

క. ఒప్పింతి నిటఁ దగ వెవ్వరు, చెప్పెద రతిఁగింపు మతనిఁ జేరఁగ నెడలే
కిప్పుడ యరుగుద మనవుడుఁ, గప్పినతమకమున దీర్ఘకర్ణుం డనియెన్. 116

సీ తపనజాతటమున దధికర్ణుఁ డనుమహావృద్ధమార్జాలంబు విహృతిసల్పు
నది రుద్రచాంద్రాయణాదికార్యంబులఁ దనువు సన్నముఁ జేసికొని విరోధి
షడ్వర్గ మణఁగించి శాంతిసత్రిలుబహువ్యవహారదర్శి నయాంబురాశి
యది నేర్పుమన దిక్కువదలింపఁ బెనుజోలి ద్రవ్యాక నిమిషంబు దడయకటకుఁ
తే. బోదమా వాద మాఱడి బోకపోవు, నని ప్రబోధించి శశ మమ్మహాకపింజ
లంబుఁ దోకొని చనుచుండె లాఘవమునఁ, దలలు వడుచోటికీగుపాదములు గాదె.

క. ఏను గపింజలుఁ జెరమై, త్రినిధి విడనాడలేక వృత్తులతో గ్ర
స్థాని విడనాడి యెపుడెం, తేనెవ్వడిఁ గూడిపోయితిం జెలికానిన్. 118

మహాస్రగ్ధర. చని కంటిం బ్రాంతకాంతక్షమనిరవధికశ్లాఘ్యసౌరభ్యసంప
ద్వనజాతవ్రాత రోధోవనవమధుమధువ్యగ్రమత్తాళిగీతన్
జనితశ్రద్ధానిమజ్జజ్జనఘనహరణోచ్చండకాండప్రపూతన్
వివిధ క్త్రబ్రహ్మనిష్ఠద్విజహితసికతాస్వీతఖద్యోతజాతన్. 119

తే కని తదంచితమణివాలుకావితర్దిఁ, జరణములు మోఁపి నిర్గతశ్రముఁడ నైతిఁ
గంఠపర్యంతపరిమిళిగ్రాసమంద, జపనపన నాభిగమసమాచారకలన. 120

సీ. మనికిచో టిదిగాదె యనువాసరాచాంతఖచరజీవిత మరుత్కాశిసునకు
నాటపట్టిదిగాదె యరిపధాగతగోపవేషబృందావనత్రివిష్ణువునకు
నిష్టమజ్జనగృహం బిది గాదె రాసనృత్తాక్రాంతకాంతానతంసములకు
హాలహాలంబిదిగాదె హాలోద్ధతప్రలంబారిలాంగలలేఖ హానమునకుఁ

తే. ప్రతిదినము ప్రోల నిది గాడిదావిగాదె, కృతకకృత్కారినందగోబృందమునకు
క్షేత్ర మిదిగాదె దివసకృజ్జలజమునకు, నని నుతించిరి సంవిదాయమునయమున.

సీ. అచటఁ గపింజల మావృద్ధమార్జాలపతిఁ జూచి చిత్తంబు పల్లటిలినఁ
గదియఁగూడక దీర్ఘకర్ణుఁ జూచి నిజాలతగవరి యని వీనిఁ బొగడితీవు
కుటిలమానసుఁ డతిక్షుద్రుండు కేవలజఠరపూరకుఁడు మార్జాలజాతి
బెడిదుండు వీని నమ్మెడిదెట్లు గొయ్యాది యొద్దికిఁ జనఁ జిత్త మొప్పకొనదు

తే. తగవు దయ్యావె యుంగు నీతగవుపట్టు, ప్రాణమేటికిఁ దెక తేరఁ బాపికొనఁగ
ధర్మమునకొండుకడ కేగుదము దురాత్మ, మగుడు మనుటయుఁ గనలి యున్మదట శశము

చ పలికెఁ గపింజలంబున కపారకృపానిధితుల్యదర్శికే
వలపరిశుద్ధుఁ డార్తజనవత్సలుఁ డుత్తముఁ డబ్బిడాలభూ
తలపతి యిట్టిధర్మపరతంత్రుఁడు నమ్మినవారిఁ జంపఁ గాఁ
దలఁచునె యేమిపల్కితి పతత్రిపసంశయ మొప్ప దియ్యెడన్. 123

చ. ఇన్నియుఁ జెప్పనేమిపని యింకిట నీవది నంతసాధ్వసం
బున్నబిడాలముఖ్యుకడ కొక్కట నిద్దఱ మేగి సర్వమ
చ్ఛిన్నమనీషవిన్నపముఁ జేయుద మూరకవత్తు మంచు ము
న్వెన్నను గానలేక పిఱుబీకులు నేయ ఖగంబు బీరమై 124

వ. యౌగపద్యాభిమానంబున శశకపింజలంబులు డాయంబోవుచుండె నప్పు డారం
టికి నిత్యప్రత్యయం బారాధించుటకుఁగా దధికర్ణుండు ధర్మవాక్యంబు లుచ్చ
రింపం దొడంగె. 125

క. ధర్మంబు తన్నుఁ బెనుచున్, ధర్మం బభివృద్ధిఁబొంది తను బ్రదికించున్
ధర్మము శర్మకరం బని, ధర్మం బేమఱరు సంతతము దత్త్వజ్ఞుల్. 126

ఉ. ఉపగతులై భజించుతనయు ల్సహజన్ములు గూర్మిచుట్టము
ల్విపులతరైకదుఃఖముల వేగుదు రింతియ రారు వెంబడిన్
నిపుణులకేల తన్మమత నెట్టన దేహి శరీరమూడ్చి చ
న్నపుడును ధర్మమొక్కఁడ సహాయము దానిఁ ద్యజింపవచ్చునే. 127

క. పురుషార్థపరున కిహముం, బరముం గలదండ్రు సత్యపరతంత్రు సురా
సుర లర్చింతురు గావునఁ, బరహితసత్యములు విడువఁబడ దెప్పటికిన్. 128

తే. ఆత్మవత్సర్వభూతాని యనుపురాణ, వచనమూని బహుప్రాణివత్సలుఁడయి
సుఖము దుఃఖము సమముగాఁ జూచికొనుచు, దేహి పరలోకచింత వర్తింపవలయు.

చ. సొలవక మేను కంటకము సోఁకినఁ గొండొకశోణితంబు పి
చ్ఛిలి తనకెంతనొప్పి యగుఁ జెప్పెడి దొండొకఁ డేమిదేహముల్

గలిగినవారి కివ్విధముగాఁ దనువేదనలంచు నేరిపై
నలుగుటలేక హింస కడరైు చనఁగాఁ జనుసద్వివేకికిన్. 130

క. అనుదధికర్ణునిపలుకులు, విని నిర్భయవృత్తిఁ గొంకువీడ్కొని కదియం
జనితనతన వాగ్వాదము, లనుదానికి శశకపింజలంబులు సెప్పెన్. 131

సీ. చెప్పిన నప్పు డాజీర్ణోతు వారెంటి కనియె మీరేమనియెదరో వినము
తెగనిచాంద్రాయణాదివ్రతంబుల దేహ మతికృశం బొనరించుకతనఁ జెవులు
తానకసూక్ష్మశబ్దస్వీకృతిం బాటిగావు గావున నీవు నీవు నిపుడ
శ్రవణము ల్గదిసి యుచ్చైస్స్వనంబులఁ బల్కుఁ డేర్పడ మీసుద్దులెల్లఁ దెలియఁ
తే. గదవె మమువంటిమునులకుఁ దగవుదీర్ప, వేవురుండంగ మము మీరు విశ్వసించి
దూర మరుదెంచితిరి కానఁ ద్రోవరాదు, జాగుపనిలేదు మాకనుష్ఠానవేళ. 132

క. అరుదెండని నికటంబున, కరిగినదధికర్ణుఁ దంష్ట్రివాతి నారెంటిన్
దొరకుపడఁ బట్టుకొని కం, ధరవిరియం గొఱికి చంపి తగభక్షించెన్. 133

సీ. క్షుద్రాశ్రయంబు నొచ్చుటకు జచ్చుట కాదికారణం బనిచెప్పి కాక ముఖ్య
ఖగములఁ జూచి ఘూకంబేడఁ బక్షిసామ్రాజ్యాభిషేకసంరంభమేడఁ
బనిగానిపని మానుఁడన రోసి కూడినపులుఁగులు చదలఁ బేరెలుఁగులెసఁగ
వెసఁగన్న దెసలకుబ్బెసలారఁ బఱచినదర్పాంధ మద్దివాంధంబు గవలి
తే. పసపుజేగురుకొఱకచ్చు మిసిమిదేర, మిట్టకనుగ్రుడ్లు మిడిమిట్లు మిడిసిపడఁగఁ
గంఠఘూత్కారములదిశ ల్గలపరింప, గర్వదుర్లోకమునకుఁ గాకమున కనియె. 134

క. ఏమినిమిత్తము కుటిలా, త్మా మత్స్వామితకు నెగ్గుఁదలఁచితివే నీ
కేమిదురితం బొనర్చితి, నేమంటి భవద్విరోధినే యిదితగవే. 135

క. శైలవనవహ్నిశిఖలం, గాలిపొదల్పొదలఁ బరశుగతిఁ ద్రవ్వి మనుల్
సాలములు సత్క్రియాప్రతి, కూలవచోదగ్ధముసురుకొన దింతైనన్. 136

ఉ. కచ్చితమేమిగూడు సమకూడినరాజ్యము వీటిఁబుచ్చఁగా
వచ్చినలాభమేమి మఱవంబడదా తరువాత నిట్టినీ
యొచ్చపుఁజేఁత సౌఖ్యమున నుందుదుగాకని పల్కిపోయె న
వ్వెచ్చఁజుమీ విరోధ మొదవెం గరటాలి కులూకజాతికిన్. 137

క. నావిని వాయసపలిచిర, జీవికి నిట్లనియె నీతిశీలా హితసం
భావన కిఁక నీతడవే, లా వేగము తెలుపు మనిన నతఁ డిట్లనియెన్. 138

వ. సంధివిగ్రహంబు విచారణీయం బాసనము బలిష్ఠునయ్యు నుపస్థితరిపుస్థానం బగుట
నదియుం గూడదు యానంబునకు లావు చాలదు స్థానత్యాగంబు లాఘవమూలంబు

ప్రత్యాసన్నవిరోధికులం బభావంబగుట ద్వైధీభావంబు పొసంగదు సంశ్రయం
బన్నిటికిం గర్తవ్యంబు విను శరీరపతనపర్యంతంబు నీకార్యంబునకేఁ బాటుపడఁ
గలవాఁడ. 139

క. పలువురుకృతవైరులు మతి, బలధుర్యులు విమతులున్నఁ బరకార్యంబుల్
పొలిసిపడుం జెడు మునుధూ, ర్తులు మేఁకం గుక్కఁ జేసి తొలఁగ విప్రున్. 140

క. నావిని వాయసపతి చిర, జీవికి నిట్లనియె నీతిశీలా యేలా
గీవిధము తేటపడఁ జెపు, మా వినియెద ననిన నతని కతఁ డిట్లనియెన్. 141

సీ. చెవఁటి యాకులపాటుచే నలంగినసాధుతరుల కుబ్బుసఁగు నాదరణమూర్తి
భీమతీవ్రాంబకాభిహతిస్రుక్కిన మహావధురధర్మునినొప్పి మాన్పువెజ్జు
ఫలభంగమున మాటపట్టుజాతిన పికమునకు సత్యోక్తు లిచ్చినసుదాత
హాలినున్మత్తచండాలుర మాధవార్చనధురంధరులఁ జేసిన ఘనుండు
తే. కాలగతిఁ బేర్చు నలజళ్ళఁ గలఁగఁబడిన, సరసులకు నిర్మలత్వంబు సంఘటించు
సౌఖ్యసందాయకుండు సాక్షాత్కరించె, సన్నుతానంతుఁ డవనిపసంతుఁ డంత 142

సీ. ముక్తపత్రవ్యాజమునఁ జీరసడలించి కళికలఁ బులకల గలుగఁజేసి
పొలిపోనితావులఁ బూవుదండలఁ జుట్టి కడలేనిమధుసాత్త్వికమునఁ దేల్చి
రణదళిఝుంకారమణితము ల్పుటియించి దీవిచక్కెరలూటలు మోవియాని
సరవినున్నతఫలస్తనములఁ గబళించి కళదేఱుతనువల్లి గాఁగిలించి
తే. కలికిరాచిల్కపల్కుఁబల్కుల నేర్చి, సురభికర్పూరరజముల సొంపొనర్చి
కలితవనలక్ష్మిఁ గూడి రాగము వహించె, మాధవుఁడు వ్యాప్తనిఖిలమాధవుండు.

వ. మఱియు నవ్వసంతంబు కళికాభిరామంబై యుదాహరణంబును శుకసూక్తి సందర్భ
గర్భితంబై భాగవతంబును గలకంఠీకలాపదీపితంబై రాజావరోధంబును ప్రకాశిత
ప్రవాహంబై సముద్రతీరంబును సందృష్టశారికాజాలంబయి వీణాయంత్రంబును
బురుడించు నక్కాలంబున. 144

చ. కలఁ డిల ముగ్ధభూసురుఁ డొకానొకఁ డాయనయధ్వరార్థమై
బలిసినమేఁకపోతు మెడ పగ్గమునం బిగియించి యీడ్చికొం
చలవున నింటికై యరుగ నప్పుడు గొందఱు ధూర్తు లిచ్చలోఁ
పలఁ దలపోసి యయ్యజముఁ బాపఁదలంచిరి దుర్ణయంబునన్. 145

క. తలఁచి యొకఁడొకఁడ చని లో, కులు నవ్వ న్విప్రుకడకుఁ గొనిపోయెదు నీ
కులశీలంబులు పఱదం, గలపితి వేఁకనేమియని వికావికనగుచున్. 146

క. ఈగతి నందఱు నాజన, చ్ఛాగముఁ గుక్కఁగముఁ జేసి చనుచుండంగా

నాగరిక మేదివిప్రుఁడు, వేగమున నిలిచి భ్రాంతి వికలుం డగుచున్. 147

క. ఒకరిరువురు గా కందము, నకటా ఛాగంబుఁ గుక్క యని పోయెద రే
టికి బ్రమసి వేఁపిఁ దెచ్చితిఁ, దుకతుక నను నవ్వకుందురె తత్త్వజ్ఞుల్. 148

వ. అని విహారణస్థలదత్తభాగం బగుభాగంబు విడిచి విప్రుండు పూర్ణశరం బగుకాసారంబునకు స్నానార్థియై చనియె నప్పుడు ధూర్తులు ప్రహాసభాసమానాననులగుచు నొండొరులకరంబు లప్పళించుకొనుచు నయ్యజంబుం జంపుకొని భక్షించి రట్లు ప్రజ్ఞాశౌర్యధైర్యాదిగుణంబులు గలవారలు పరులకార్యంబుల విఘాతంబు సేసి స్వకార్య ముద్ధరింతురని మఱియుఁ జిరంజీవి మేఘవర్ణు నాలోకించి. 149

క. తనలావుఁ జూచి మృతకా, కనికాయశరీరరక్తకణములు మేనన్
జినికివసుతతటమునందిడి, చనుఁ డుపహతిరహితభూమిజాతంబులకున్. 150

క. అరిమర్దనుండు సరిద్రా, ద్దరుదెంచుం గరలి తరలి హతశేషరట
త్కరటవ్యాతికటభజింతున్, హరుఁ డాపగవారిఁ బోలె నాపగవారిన్. 151

వ. భజించి నీకార్య మార్యసమ్మతంబుగా నిర్వహింపం గలవాఁడనని పలికిన మేఘవర్ణుండు లుంఛితగరుజ్జాలుం గావించి విస్రం బగు కాకజఠరాస్రంబుఁ జినికి యచ్చిరజీవిని న్యగ్రోధాగ్రకోటరంబునం బెట్టించి సపరివారుండై నిరుపహతిస్థానంబున కరిగె నాసమయంబున. 152

చ. అరుణగభస్తిబింబ మపరాద్రిఁ దిరోహితమయ్యెఁ బన్నగా
భరణి శిరోధిహాలహాలభంగి నిఱు ల్నెరసె న్విరోధిభీ
కరగతి వంతగాఁ బరిగాఢమహీధరభూజదుర్గకో
టరములు నిర్గమించి వికటప్రకటాననము ల్మిడింనుచున్. 153

క. అరిమర్దనుఁ డనుపబల, స్ఫురణోల్లోకములు ఘూకములు వటకరటా
హరణేచ్ఛఁ గదలి బహుపా, ద్ధరణీరుహ మాశ్రయించి తద్విటపమునన్. 154

క. కాకములు మెదలకున్నన్, ఘూకంబులు కర్ణఘోరఘూత్కారహతా
శాకులము లగుచుఁ గ్రమ్మటి, పోకను వటాద్రిడుచున్నపుడ భూజమునన్. 155

క. మతివిదులకు నుచితమనూ, ద్యతనము సారంభుఁడయ్యు నాకృతకార్య
స్థితిఁ గడఁగనియునికి మహో, న్నతియని మను వానతిచ్చినాఁ డట్లగుటన్. 156

క. అనితలఁచి నిలిచి తీవిం, బనివడి చిరజీవి యేయపడ నొకసెట్టిం
బొనరించినఁ గ్రమ్మటి పరి, మునుమై యుత్తోలులఁ జొట్టుముట్టె న్బట్టెన్. 157

క. పట్టుకొని చంప నొంపం, గట్టాయితపడక యరుగుఁ గావున నతనిం
జుట్టమువలెఁ గొనిచని పతి, కట్టెదుఱం బెట్టి కౌశికంబులు నిలిచెన్. 158

క. దూరితగరుడుత్కరువి, స్ఫారుణఘనలోహితాక్షతాకృతి నతనిన్
దేరికొనఁ జూచి గర్వస, మారంభోక్తుల విరోధిమర్దనుఁ డనియెన్. 159

క. ఓరీ నీవెవ్వఁడ వీ, తీరేమిటికైతి వనిన ధృతిపెంపున నా
పేరు చిరజీవి యనిన య, పారగుఁ డాయన యులూకపతి కెఱిఁగించెన్. 160

క. ఎఱిఁగించిన మించిన ని, వ్వెఱ నిట్లను ఘూకలోకవిభుఁ డిట్లనుచే
తెఱఁగు చిరజీవి నిన్నల, మఱి కాకరాజు మన్నించుఁగదా. 161

వ. దివస్పతికి బృహస్పతియుంబోలె మేఘవర్ణునకు ముఖ్యప్రధానుండవు నీతిపథికుండవు
ధన్యుండవు నీయట్టి కృతకృత్యునకు నిన్నిచదశ రానేర్చునొకో సర్వంబునుం
జెప్పుమనిన జిరజీవి యరిమర్దను నాలోకించి. 162

చ. తనపెనుగాకిమూఁకల నదాటున నీభటకోటిమట్టి కా
వనితటిఁ జంపి చన్నమఱునాఁడు మృతేతరభృత్యవర్గము
ల్గనుకనిఁగొల్వ నచ్చిలిచి కార్యము వాయసభర్త వేఁడినన్
మనమునఁ గొంకులేక యరిమర్దనునిం గనుమంటి నాతనిన్. 163

చ. ఘూకబలుం డగాధతరుకోటరదుర్గవిహారిరాత్రిసం
చారనిరంకుశుండు పటుశౌర్యధనుం డరిమర్దనుండు క్రూ
రోరగభంగిఁ జంపఁదలఁచుండఁగ నెవ్విధి నిద్రవచ్చు నీ
వారికి నీకు నెట్లుమనవచ్చు శుభంబు భజింపుమా యనన్. 164

క. అరిమర్దను నిటుఁగని మని, తిరిగినజమునోరు దన్నితివి నాబుద్ధిం
జరియింపు మనిన వాయస, పరివృఢుఁ డందులకు మండిపడి నావంకన్. 165

ఉ. చూచి హితప్రధానుఁ డనుమన్మదిఁ బెద్దయు నమ్మియుండు ని
న్నీచు విరోధిపక్షుఁ డని నేరనయో తుది నిశ్చయింప నిం
దీచెడుగొట్టు కాల్కిలిచి నేనిఁ జెఱుం బ్రతుకంమ నూఁచిపో
వైచి యులూకభుక్తికి నవత్సలుఁడై విడిపించె మత్ప్రిపైన్. 166

తే. ఎలుక పిడికెడుధనమంచు రదనిజంబు, నేరమునీమూఁకమున్నున స్నెలుఁగుఁగానఁ
గనలి చంపక కొంపక గౌరవమున, దేవ నీపాదముల మ్రోలఁ దెచ్చి నిలిపె. 167

తే. తోడిమంత్రులజాడ నాదుర్మదాంధుఁ, డాడిన ట్లాడ కుచితకార్యంబుఁ జెప్పి
సిగ్గు గోల్పోతినని చిరజీవిజాతి, బాష్పుఁడై చెప్పెఁ దనచేటుపాటుఁ బలికి. 168

క. ఆవేళ ఘూకపతి నయ, కోవిదు లగుమంత్రివరులఁ గూర్చి ప్రభుత్వ
ప్రావీణ్యంబున నచ్చిర, జీవిచరిత్రంబుఁ బ్రీతిఁ జెప్పెం దెలియన్. 169

తే. చెప్పి వాయసరాజన్యశేఖరునకు, మాననీయుండు ముఖ్యప్రధానుఁ డితఁడు

దీని కయ్యెడితెఱంగు వేర్వేఱపలుకుఁ, డనిన నయదత్తుఁ డంతు రక్తాక్షుఁడనియె.

క. చేరినమృత్యువు రిపుఁ డ, క్రూరాత్ముఁడు చిక్కినపుడ కొంకక చంపం
గోరుట నీతివిధానము, వైరికి దయఁదలఁచువెఱ్ఱివాఁడుం గలఁడే. 171

సీ. ఇతఁడు వాయసనరాపతికి మాన్యుఁడు ముఖ్యదండనాథుఁడు నీతిధాముఁ డనుచు
నావతిచ్చితి నిట్టివానికి నిట్టిదుర్వేషంబు వచ్చుట నెఱుఁగు గాద
ప్రత్యర్థికర్తవ్యము లెఱుంగుటకు రాజ్యప్రతిష్ఠకు నిట్టిసాధుమతులు
విను నీచవేషమైనను బూని బద్ధవైరులలోఁ బ్రవేశించి చెలిమిఁ జేసి

తే. చిచ్చు దాలిసొచ్చి వృత్తంబుఁ జెఱచినట్లు, పొదివి నానాటి కభివృద్ధిఁ బొందిపిదప,
జెఱచి పోదురు వీనిరక్షింపనేల, చంపి రాజ్యంబు సేయుము నిశ్శంక నధిప 172

క. అని రక్తాక్షుఁడు చెప్పిన, వినఁగూడక ఘూకభర్త విశ్రుతనయధీ
ధనదత్తునిఁ గ్రూరాక్షుని, గనుగొనుటయు నతఁడు మధురగతి నిట్లనియెన్. 173

క. శరణాగతు రక్షించిన, పరహితచరితున కిహంబుఁ బరముం దురగా
ధ్వరఫలముం గలదనిరో, యరిమర్దన కావు మిమ్మహాచిరజీవిన్ 174

తే. అనుచు క్రూరాక్షుఁ డాడిన నద్ది వాంఛ, వల్లభుఁడు విని దీప్తాక్షుపంకఁ జూచి
నీకుఁ దోఁచినకార్యంబు నీవు సెప్పు, మనిన నంగీకరించి యిట్లనియె నతఁడు

క. క్రూరాక్షునీతి సుధా, పూరంబరి యెట్టినస్వభావుఁడు జంపం
గోరఁడు శరణాగతుఁ డన, ఘూ రాజకు నీకుఁ దగవు గానేర్చునొకో. 176

క. ఈరీతి నీతిగలిగిన, సూరిజనుం డేఁచెఱుపఁ జూడుం జనతా
వైరి యగుదొంగబంటుప, కారము వృద్ధునకుఁ దొల్లి గావింపఁడొకో. 177

క. నావిని యరిమర్దనుఁ డురు, భావుని దీప్తాక్షుఁ జూచి ప్రభునీతికళా
సేవధి విన నింపయ్యెఁడు, నావిధ మెఱిఁగింపు మనిన నతఁ డిట్లనియెన్. 178

చ. కుండినరాజధానివసు గుప్తుఁ డనంగఁ బ్రధానసార్థవా
హుం డఖిలార్థవంతుఁ డొకఁ డుండు నతండు ప్రియావియుక్తుఁడై
పండినమూర్తితోడ నగుపాటున కుంకువఁ దన్వి నొందుచో
నండజయాన రూపవతి యన్నుఁగలకన్యకఁ బెండ్లియాడినన్. 179

క. అఁరయం బ్రాయపుఁగన్నుల, కలికికి ముదిమగఁడు బూచిగావున గవియ
న్దిలతైలమువలె నెనయక, తొలఁగుం జెలిసెట్టిఁ గన్నఁ దుప్పునసుమియున్. 180

క. వెతలం బొగులుచు నెట్టన, రతిగతికిం బిన్నపడుచ రారమ్మనుచుం
బతిమాలి పిలువ విన దది, పతిఁ బట్టిన చెవుడు దన్నుఁ బట్టినభంగిన్. 181

మ. పలితశ్మశ్రుశిరోజరోగలతికోపఘ్నున్ దమూర్ఖంగురున్
వలియుగ్వక్త్రునితాంతశ్చలితనిస్వస్థోత్తమాంగుం గర

స్థలయుష్టిం బటలావృతాక్షు విగళద్దంతు న్వయోగర్వని
స్తులయోషిత్కుల మేర్పడం బరిహరించు న్నాలవానింబలెన్. 182

సీ. పాఱవేయుటెకాని భక్ష్యంబు లిచ్చిన వాతెర నంటు దవ్వాలుగంటి
చించివైచుటెకాని చీరలిచ్చినఁ గటీరమునఁ గైసేయ దాఱంపులాడి
తొలఁగఁబెట్టుటెకాని తొడవులిచ్చిన సొంపుపస మేనబూన దప్పలువచెలువ
మగుడనిచ్చుటెకాని మాడలిచ్చిన ముల్లెఁ గట్ట దాజగడాఁగ కలువకంటి
తే. యింటిముంజూరుపెండెలో నిడుటెకాని, పుష్పులిచ్చిన ముడువ దప్పాగయునుగువ
కుడిచి కూర్చుండి యిదియేమిగొడవఁజేసె, వార్ధకంబున నాసార్థవాహుఁడు 183

ఆ. చెనఁటిభార్యపేరుఁ జెప్పగ పెఱబోటి, పేర సిగ్గుఁ దొలఁగఁబెట్టె సెట్టి
ముదిమినేడ రోఁత యిదె నాకవిటవిటీ, జాతివశ్యభేషజంబు లడుగు. 184

సీ. మొరడువంగినసెట్టిముదుకకు జవరాలిమోము గాననివానిముకురమయ్యె
వగ్గుభర్తకు నాఁతి వాతెర చండాలవాటివండిన పిండివంటలయ్యె
గొయ్యలూడిన పెండ్లికొడుకుకుఁ జెలినవ్వు విపినమండలిఁ గాయువెన్నెలయ్యె
వయసుపోయిన చేరివానికి సఖిచన్ను గొండలందనిమానిపండులయ్యెఁ
తే. బలితునకుఁ గోకిలాలాపజిలుగుటెలుఁగు, బధిరునకు నయిన సంగీతపాకమయ్యె
మెలఁతనీక్షించి గ్రుక్కిళ్ళుమ్రింగుఁగాని, సౌఖ్యమేమియునెఱుఁగఁడజ్జరఠతముఁడు.

చ నెల కొకనాఁడు గట్టెదుర నిల్వఁగఁ జూచినవాఁడు గాఁడు వీ
నుల కొకనాఁడు మాటవిన నోఁచినవాఁడును గాఁడు నవ్వులన్
వలపులఁ జల్ల మేల్గనినవాఁడును గాఁ డతఁడెందువాఁడు గాఁ
డలజవరాలితోడిరతి యందనిమ్రానిఫలంబు సెట్టికిన్. 186

వ ఇట్లు సన్నిహితవిశేషవేదనాజాతఖేదంబున నారాటంబు బుట్టి యడియాసపసనుసు రఁ బరిత్యజింపంజాలక ఈలకలుదుకొని యెడతెగక నిగుడు నమందోష్ణనిశ్వాస మాతరిశ్వంబున నధరపల్లవం బల్లలనాడ నతం డొక్కనాఁడు శయ్యాతలంబున నొడలుపడవైచి దాసీజనంబులు తనకాచరించునూడిగంబులఁ గోడిగంబులం జేసి కూడునీళ్ళకుం బాసి గాసిపడుసమయంబున రజస్వలాంభోజినీదివాసంగమక్రీడా సంప్రాప్తదురిత ప్రాయశ్చిత్తార్థంబు భృగుపాతం బొనర్చినవిధంబున దపనుం డపర గిరిఁ దిరోహితుం డయ్యె నయ్యెడ. 157

సీ. పిసవెఱ్ఱిలంకుగుబ్బెతలతప్పులు దప్పదాల్చుట కిది కన్నతల్లియిల్లు
కడుపుకక్కుటిలిపిల్లుడుగను ముదిలంజె వఱదుల కిది పిన్నపసుపుంగు
గడికన్నగాంధ్రమ్రుక్కులకు నిలుచూఱ పొరువుసొమ్మిడనిది ప్రూఁటకాఁపు

కలవత్తుల కన్నుఁగవఁ బాయనినిద్రఁ గదలింపనిది నిమ్మకాయపులుసు

తే. ప్రభకుఁ బాసినకుముదినీపత్రనేత్ర, రంజనంబున కిది విశుద్ధాంజనంబు
నాఘనాఘనకాళిమోన్నతి వహించి, కటికిచీఁకటి జగమెల్ల గప్పుకొనియె. 188

తే. మానసాటవి నేర్పుమన్మథదవాగ్ని, బాహ్యసంచారమునకుఁ బొల్పడియె ననఁగ
దీపములు సార్థగేహమందిరములందుఁ, బ్రకరశిఖ లుల్లసిల్ల జూపట్టెనపుడు. 189

క. ఆరూపవతి సహాసా, హారంబుల దృష్టిఁబొంది యపుడొకభంగిం
బోరామి ఘోరనరక, ద్వారముపలె వృద్ధపతినివాసముఁ జొచ్చెన్. 190

తే. చొచ్చి వచ్చినవండాలుఁ జూచుమాడ్కిఁ, జూడ కల్లంత నోసరించుచు గృహాంత
కాంతభిత్తికఁ జెంతఁ గంకటికి నగుచు, బిటికి నీక్షించి యప్పటి పెద్దసెట్టి. 191

తే. విరహదహనగ్రహంబున విగ్రహంబు, కొలిమి నూఁదినగతి వేఁడి గలిగియుండ
సెజ్జ నారాటపడుచు నక్షీణవిభవు, భల్లకంపితభవు మనోభవుఁ దలంచి. 192

ఉ. తేరె ధనుర్ధరు ల్పవమి లెక్కకు మిక్కిలి యొంటు రెంటుగా
వారడరింతు రేటినెఱవాదితనం బదిరెంటు నొండుగా
నారసి వేయనేరవలదా మఱినీవలె నెంతవింత యా
నీరజగర్భుఁ డుండుఁ గడునీకరకాశల మెన్న మన్మథా. 193

ఉ. ఇంపున నన్యచాపధరు లేసినతూపులు బాహ్యమాంసముం
జింపక మర్మభేదనముఁ జేయుఁగఁ జాలవు బాహ్యమాంసముం
జింపక మర్మభేదనము సేయుచు ధవద్విశిఖంబు లెల్లగీ
ర్తింపుదు నీదుచాప మహాధీరితశంబరకాంచనాంబరా. 194

క. తీరనికోలపగయుంబలె, నీరమణీమణికి నాకు నెనయదు విరహాం
భోరాశి నెల్లుగడతు, స్వీరోత్తమ నన్నుఁ గూర్పవే కలకంఠిన్. 195

క. అని వెన్నునికొమరు మరు, న్వినతాము విరహిభయదవిధసముచుఁ గన
త్కనకమణినిచయచామరు, ననుషక్త్రిభ్రమరు దూఱి యాతఁ డున్నంతన్. 196

తే. కుశలగతి మజ్జనములాడి కుడిచి కట్టి, ప్రజలు నిద్రించి రయ్యర్ధరాత్రవేళ
ఖడ్గఖేటకపాణియై గస్తుదిరిగెఁ, బెద్దతలవరి కింకరోపేతుఁ డగుచు. 197

వ. అంత. 198

సీ. భవనదీపాహితభ్రమరపేటికవాలు కాగస్త్రీతలము ళ్ళృగద్దగోళ్ళ
ములుదోరణముబట్ట మొలత్రాటికుఱువాఁడికైదువు దెసకట్టు కావుబొట్టు
జిలుఁగుగన్నపుఁగత్తి బలపంబు మొగమాయముందు తొలపుటాకు మైలగోఁచి
మడుపుటాకులు పోఁకపొడికాయ మోరచ్చు చెప్పులు భుజగవృశ్చికచికిత్స

తే. సుప్తివృద్ధికరౌషధక్షోద మసిత, వసన భంగంబు పెవతలవంక నికడుఁ
గాఱునును మేను నెట్టనికన్ను లమర, దూరితత్రాసుఁడపుడొక్కదొంగబంటు. 199

సీ. వచ్చి త్రిమ్మరుతలవరులు గన్గొనకుండ బవరిచుట్టును బలపమున వ్రాసి
ముంచి కన్నపుఁగత్తి మొనకెత్తి పెట్టించి యొయ్యనొయ్యన శిలఖాడ దివిచి
వివర మేర్పఱిచి యావెంబడి బదములు వడపి నల్వంకలఁ దడవిచూచి
యలికిడిలేకుండఁ దెలిసి యిల్లొన్నరఁబాఱి వాకిటిగడియ నెవ్వడిసడల్చి

తే. గాలిరాకుండ వెలుతురు గాకయుండఁ, గఱకుగఱబట్ట గన్నపుగండిగప్పి
యొడలిసొమ్ములు వేర్వేర నొలిచికొనఁగ, సరస కేతేర బరికించి జలదరించి 200

క. కచభరము విరియ హార, ప్రచయం బల్లాడఁబఱచి పరిరంభించెన్
రుచిరగతి రూపవతి నిజ, కుచలికుచాగ్రములు నాఁటుకొనఁ బ్రాణేశున్. 201

సీ. యువతిసేసిన యపూర్వోపచారమునకు వెసమిన్నుముట్టి యమ్ముసలిసెట్టి
యిచ్చవచ్చెరువంది ముచ్చటయినను మొగం బీనిరక్కస దవుదాఖ వచ్చి
'నను నిట్లు గౌఁగిలించినది నేఁడింతకుఁ గారణం బేమేనిఁ గలుగవలయు
ననిలేచి నల్వంక లరసి యొక్కెడ భయంకరహేతికరునిఁ దస్కరుని గాంచి

తే. యితఁడు పో మూల మీశుభస్థితికి ననుచుఁ, బెన్నిధానంబుఁ జూచిన పేదవోలె
నీరదోదయ మరసిన నెమ్మివోలె, సమ్మదంబంది యాపరాస్కంది కనియె. 202

క. పొడపులువుంబలె ననుఁ దన, కడకన్నులఁ జూడరోయఁ కన్నులకలికిం
గడువేడ్కఁ గూర్చితిఁకనె, క్కడఁగలఁ డిటువంటిచెలిమికాఁ డారసినన్. 203

క. మానగునుహిజక్రోడ, స్థానంబున వెలుఁగుమదన దావానలకీ
లానివహము చల్లార్చెను, దీనిపయోధరము లద్వితీయచరిత్రా 204

క. చోరుఁడవె యతిసమ్మద, కారకుఁడవుగాక తీర్చగలనే నీస
త్కారర్ణ మీభవంబున, దూరీకృతకలుష వడ్డితోడంగూడన్. 205

క. తనగృహమునఁ గలవాసో, ధనక నకము లెల్లనిచ్చెదన ధృతిమించెన్
గొని చనుమని యంజలిసే, సినఁ జోరుఁ డతిప్రసన్నచేతస్కుండై. 206

చ. నెఱయఁ జెలంగియున్నయతనిం గని యిట్లను సార్థవాహ యి
త్తెఱవ భవన్నియోగమునఁ ద్రిమ్మరదే యదికొత్తగాదె నా
మఱఁదివి నీవు చెల్లెలిది మమ్మవలోకముఁ జేసికాదె బ
ల్వెఱపున నిన్నుఁజేరి పొదవెం దనచక్కనిసోగచేతులన్. 207

క. నీనిలయంబునఁ గలసొ, మ్మేనొల్లం బడుచుకరణ మిచ్చితినిది నీ
తో నలగిన వేసారిన, చో నను మదిఁదలఁపు మఱయుచుం బఱతెంతున్. 208

క. చెలియలనిఁ జూడఁ గినిసిన, దలఁ గోయుదుఁ బతికి సమ్మదము గానిది య
వ్వలకేల హితులకేటికి, లలనామణి యిది మొదల్తెలఁగు నీయాజ్ఞన్. 209

వ. అని భయంబుఁ బుట్టించి కృతసత్కారుండై చోరుండు సార్థవాహు వీడ్కొని చని
యె నాసమయంబున. 210

సీ. రాజాస్యముఖతామరసపానసల గ్రుక్క నానుముక్కనబంటి యైనదనుక
ధరపయోధరసుధాధరరసంబునఁ జొక్కఁ బంచబాణపిపాస పాయుదనుకఁ
జంచలేక్షణసున స్తనగుళుచ్ఛకముల నలముహస్తగ్లాని దొలఁగుదనుక
సాతిగాఢాలింగనమునఁ దెప్పలఁదేలు బొంది తాపము శాంతిఁ బొందుదనుకఁ
తే. బ్రాయ ముడిబోయి కసరింకఁ బాతియుండు, పంటిచాట్పున నెఱవేరుపడినయొడలి
పరుసు సెట్టిన బీదచే పడినపగిదిఁ, గులుకుగుబ్బెతవయసెల్లఁ గొల్లలాడె. 211

సీ. ఉదయవేళకుమున్నె నిదురమేల్కనివచ్చి ప్రాణవల్లభుపదాబ్జములవ్రాలు
వ్రాలి నిర్మలతరజ్వలనతప్తసువర్ణకలశోదకంబుల జలకమార్చు
జలకమార్చి సపర్వశర్వరీశాతపోత్తాలచేలంబులఁ దాల్పనిచ్చు
నిచ్చి పొచ్చములేక హేమపాత్రంబున నిష్టాన్నముల భుజియింపఁబెట్టుఁ
తే. బరిమళముఁ బూయుఁ గపురంబుసురటి విసరుఁ
బూవుదండలఁ జుట్టుఁ దాంబూల మిచ్చు
బడక సవరించుఁ జిటిపొటినడుగులొత్తు
నలముఁ గౌఁగిట నాతిచోరాతిభీతి. 212

ఉ. ఏరికినైనఁ జోరుఁడు సుహృత్తముఁడే యతఁడేలసేసె స
త్కారము సార్థవాహునకుఁ గన్గొన నిచ్చిరజీవితావకీ
నారికి ముఖ్యమంత్రి యగు నైనను నీతిపరుండు గాన నే
తీరుననైన నిట్టిసుమతిప్రవరుం డశుభం బొనర్చునే. 213

క. అని దీప్తాక్షుఁడు చెప్పిన, విని యరిమర్దనుఁడు నీతివిభవవిలాసున్
వినుతాసువక్రనాసుం, గనుఁగొనుటయు నతఁడు కౌశికప్రభు మొగమై. 214

క. కంటకులు రిపులు దమలో, నొంటకపురిఁ బాసి యూర నొకఁడై వినుమి
ట్లొంటిఁ గృశియింపుచుండుట, గెంటనిశోభనము గాదె క్షితిపా నీకున్. 215

ఉ. ఈతఁడు మేఘవర్ణునకు నిష్టము గల్గినవాఁడు సత్క్రియా
న్వీతుఁడు రాజకార్యపరినిష్ఠితుఁ డీతఁడు లేమి లేమికు
మ్మాతని కూర్చితే కవిజయస్థితి నీ కితఁ డున్కఁ జేసి వి
ఖ్యాతివహించు శత్రుబలహైన్యము నీకు శుభంబు గాదొకో. 216

క. వైరులు రాయుట హితస, త్కారమునక యసువులిచ్చెఁ దస్కరుఁడు లఘు
క్షీరమహాగోద్వితయము, రారాపున గృహికి బ్రహ్మరాక్షసుఁ డిచ్చెన్. 217

క. అనవిని యరిమర్దనుఁ డా, నన మలరఁగ వక్రనాసునకు నిట్లను ది
గ్వినుత నయప్రథ యక్కథ, వినవేడుక యయ్యెఁ దెలుపవే నా కనుడున్. 218

వ. వక్రనాసుం డిట్లని చెప్పం దొడంగె. 219

చ. కృతవిదధీశ చెప్పెదఁ బరిగ్రహలబ్ధము భూరిదుగ్ధగో
ద్వితయము పొల్చు నొక్క జగతీసురు లోఁగిట దానివంచనా
మతి నొకటన్ హరించుటకు మందచరుం డనుతస్కరుం డశి
ప్రతినవకాలకూటరుచిబంధుర మైనయమాస చీఁకటిన్. 220

క. నెప్పెఱుఁగక చనఁ గానల, చొప్పున నొక బ్రహ్మరాక్షసుం డరుగుచు నా
దెప్పరపుమ్రుచ్చు నచ్చోఁ, దప్పక వీక్షించి యద్భుతధ్వనిఁ బలికెన్. 221

క. ఓరీ యిఱులూఱెడునీ, దారుణనిశి నెందుఁ బోయెదవు చెపుమా దు
ర్వారత్వర ననుటయు నల, చోరకుఁ డా బ్రహ్మరాక్షసున కిట్లనియెన్. 222

క. జయసిద్ధి యనుధరామరు, నయనంబునఁ గలదు గోద్వయము దాని నతి
ప్రియతం గొని చనునాతఁడ, నయిపోయెద నొంటి నిమ్మహారాత్రమునన్. 223

ఉ. కంచెన దాయచాయకొఱ కచ్చులమేళము లక్షగోళము
ల్గుంచిన మారునోరువసి గొయ్యలదండులుపండు లిట్టిరూ
పెందును జెప్పఁ జూప నరు దెవ్వఁడ వీవని వేఁడినం దరా
స్కందికి బ్రహ్మరాక్షసుఁడు సత్యపురస్సరభాష నిట్లనున్. 224

క. ఈనిశ నిట నేవిప్రుని, ధేనువులం ద్రాట నీవు దివియుటకై చో
రా నేఁ డరిగెద వతని, తానకమునఁ జంపఁబోయెద న్బలలాశిన్. 225

క. నావిని చోరకుఁ డంతం, బోవక యనునిన్నిశీథమునఁ గ్రోధమునన్
భూవిబుధుఁ జంపఁబోయెదొ, కో వాఁ డెటువంటి నేర మొనరించెనొకో. 226

క. కారణముఁ దెలుపుమన నల, చోరకునకు బ్రహ్మరాక్షసుండను రజనీ
చారపలాయనమంత్రక, శారూఢుఁడు గాఁడె యరయ నవ్విప్రుండున్. 227

చ. జరఠకపిత్థరంధ్రములు సాలబిలంబు లగాధనింబకో
టరములు మఱ్ఱిమానితొఱటల్వెనురావుఁతొఱ్ఱలు న్మహా
నిరవధితింత్రిణీమహిజనిర్వ్యధవంబులు తొంగిచూడరా
దరసిన బ్రహ్మరాక్షసుల కద్ధరణీసురుచేతిరాయడిన్. 228

క. మెఱిమెఱసి యుద్ధరాతురుఁ, బటిమార్పం బోవరాదు బ్రహ్మకునైనన్

మొఱఁగి నిదురించువో నిది, తఱి యగుటం జంపఁబోయెదం బదమనుచున్. 229

వ. ఇరువురు చని యవ్విప్రగృహంబు ప్రవేశించి రందు బ్రహ్మరాక్షసుండు ప్రతి
రోధి కిట్లనియె. 230

క. తొలుదొలుత నరిగి విప్రుని, బొలుపారం జంపి కడకుఁ బోయెద నాలోఁ
దలఁకక నీ వరిగి నిరాకులవృత్తిం బసుల నాఁచికొనిపొమ్మొకటన్. 231

క. తీరిది యని చెప్పిన విని, చోరకుఁ డా బ్రహ్మరాక్షసున కను నీద
ర్వారంభ మెఱిఁగి రేని మ, హారభసము పుట్టు నీగృహంబున నకటా. 232

క. ఈ నెఱి నలికిడి పుట్టిన, ధేనువులను ముచ్చిలింపఁ దీఱు నె నాపూఁ
పైనతరువాత దూరము, గా నరిగిన మీఁదఁ జంపు కాదన విప్రున్. 233

ఉ. నావిని బ్రహ్మరాక్షసుఁడు నన్నిటులాడఁగ నెంతవాఁడ వీ
లేవడి నిన్ను వేఁడ నవులేకలిగెం దొలుదొల్త నిద్దరా
దేవునిఁ జంపెదం గనలు దీఱఁగ నం చడరంగ దొంగయుం
బోవకు పోకు మం చతనిభూరితరధ్వని నడ్డగించినన్. 234

వ. అక్కలకలంబు విని బ్రాహ్మణుండు మేల్కనియె నప్పు డతనికి విశ్వాసంబుఁ బు
ట్టింపం దలంచి. 235

క. మును బ్రహ్మరాక్షసుం డిట్లను వనఘా తావకీన మగుగోద్వయమున్
గొన నున్నత్రాసదీపితుఁ, డని చోరునిఁ జూపె నిజకరాంగుళికోటిన్. 236

క. చోరుండును బటురౌద్రా, కారుండై నినువధింపఁగా నదయుండై
చేరినక్రూరుం డితఁడని, యారాక్షసుఁ జూపె భూసురాధ్యక్షునకున్. 237

క. శేరముఁ దప్పించుకొనం, జోరుండును బ్రహ్మరాక్షసుండును దనతో
నీరూపునఁ జెప్పినముఖ, సారసరిపుమీఁద హాసచంద్రిక మెఱయున్. 238

క. ధరణీసురుఁ డిట్లను మీ, రిరువురు పరమాప్తు లనఘు లిందెవ్వరిపైఁ
గరలెదయు చనుఁడు గాఢ, త్వరఁ గ్రమ్మఱ మీరు మీనివాసంబులకున్. 239

క. దీవింపవలవ దవనీ, దేవత లామోదవనధిఁ దేలిన శాపం
బీనలవ దలఘుసంతా, పావిలచేతస్కు లమ్మహామహులయినన్. 240

వ. బ్రాహ్మణద్వేషంబు లేక బ్రతుకుం డని వీడ్కొలిపినం బోయి రాచోర బ్రహ్మరాక్షస
వివాదంబు జయసిద్ధికింబోలె మేఘవర్ణ చిరజీవి సంవాదంబు నీకు నిస్తులకల్యా
ణంబుఁ జేయునని విన్నవించి వక్రనాసుండు వెండియు. 241

సీ. తనమేనికంపలు దఱిగి డేఁగిను మేఁపి ఖగముఁ గావఁడె శిబిక్ష్మావరుండు
గరుడుని కాహారకబళమై నాగేంద్రవరుఁ బ్రోవఁడే మేఘవాహనుండు

నిజకళత్రద్రోహి నిర్దయాత్ముఁ గిరాతు మనుపఁడే నిర్నిద్రమైత్రిపత్రి
శత్రుసోదరువిభీషణు సమిద్భీషణు రక్షింపఁడే తొల్లి రాఘవుండు
తే. సకలదిక్కామినీకుచస్తబకములకుఁ, దారహారకలాపమై తద్యశంబు
నేఁడు నాఁడును నున్నది నిత్యమగుచుఁ, గంటె శరణార్థి మనుమటకంటె శుభము.

సీ. అని వక్రనాసుఁ డిట్లాడుమాటలు విని యుండఱు వేర్వేఱ వడుకుబుద్ధి
నపుడు దివాభీతనృపతి వికారకర్ణునిఁ జూచి తోఁచిన ట్లనఘ నీవు
పోలినతెఱఁగుఁ జెప్పవు గాక యనునంత నెడసొచ్చి రక్తాక్షుఁ డిట్టులనియె
నేకార్య మెఱుఁగుదు రిందఱు పలుగూఁత లఱచెద రవివేకి వగుటఁ జేసి
తే. మంత్రులకు నైజములు మృదుమధురభణితు,లవి యథార్థీకరించి వాయసముఁ బెంచి
యేలచెడిపోయెదవు సేన నేఁ జెఱిచె, దహితు నిర్జింపు నాబుద్ధి నాదరింపు 243

క. నేరము ప్రత్యక్షంబై, చేరువ సంపంగ సంతసిల్లి సజారన్
దార న్నాథూర్తుల రథ,కారుఁడు శిరసావహించుకథ యిదియయ్యెన్. 244

క. అవవిని యరిమర్దనుఁ డా, యన నాలోకించి యోనయార్ణవ యిది యొ
ట్లనురాగంబునఁ జెపుమా, వినియెద నన నతఁ డులూకవిభునకు ననియెన్. 245

క. కేరళదేశంబున రథ,కారప్రమదానుతల్లి గల దవ్వికచాం
భోరుహముఖి యుపజారో,దారప్రసంబులకు నల్లిత్రాడై మెఱయున్. 246

ఉ. జారులకొంగుపత్తడి యసభ్యులచేరువపంట మన్మథ
ప్రేరితకోటి కేడుగడ పెన్నిధి గాముకజాతికిం బర
ద్వారులపట్టుగొమ్మ యుపవల్లభసంపదపాంథబృందమం
దారము పల్లవాంగణనిధానము సానివిలాస మారయన్. 247

ఉ. క్రొవ్వినచన్నుదోయికులుకు న్ననుబయ్యెదఁ దెల్పఁ జూచిన
న్రొవ్వనఁ బర్వచూపులదరు ల్చెదరం బటుపాంథమర్త్యముల్
ద్రవ్వ మెఱుంగుమేనిచెలువం బెడఁ జేయుక మూడఁ గోడెకాం
డ్రువ్విళులూఱ నూర మెఱయు న్రథకారవధూటి నీటునన్. 248

చ. మెఱుఁగులఁ గ్రమ్మరించుకనుమించులు త్రొక్కనిచోట్లు ద్రొక్కఁ గ్రి
క్కిఱిసినగుబ్బచన్ను లెడయీక విరోధులఁ బోక నొండొక
ళ్లోఱయు నితంబబింబమున నోర్కొకయించుక జాఱఁగట్టుఁగ
ట్టొఱపు ఘటింప నేగువలయుక్కలి మూరుపుటేటినీటికిన్. 249

శా. అస్పృత్తిస్తని రూపలక్ష్మి కనువిందై యుండ నిర్గాఢిహామో
హావేశక్షుభితుండు గానినసుఁ డిష్టాహారసంచారని

ద్రావైముఖ్యము లేనివాఁడు గృహకాంతాకాంతసంతానచి
న్తావైరాగ్యవశుండు గానిజనుఁ డెన్నఁడున్ లేఁడు లేఁ డొక్కఁడున్. 250

సీ పలుమెఱుంగులు మోవిపై నటింపఁగఁ గేరి నవ్వు నొక్కొకసారి అవ్వనవ్వు
జారకర్ణగ్లాని చేర నారజముగా బలుకు నొక్కొకసారి పచ్చిపలుకు
ముఖదృష్టియుపమర్మములు గ్రుచ్చి పాఠంగఁజూచు నొక్కొకసారి ముఱుఁగుఁజూపు
గిలుకుమెట్టెలఱంతు బెళుకుసంపాదింప నడుచు నొక్కొకసారి బెడఁగునడుపు

తే. పదనుగా జాజాచేసినపసిఁడియేను, షోల్కుఁ జూపట్టు దూతికపోలతలము
తమ్మరస మంటఁగ ఱుచుబ్రాయంపుకలిమి, మురియు నొకసారి వస్లంగి మోహనాంగి.

సీ ఏతెంతుననియు పాక్కిడిపోయి మత్తాళిచూడ నాకట తొంగిచూడవయితి
చేసేఁత నపుడ యుచ్చికబుచ్చికపుమాటలాడ నాతో మాటలాడవయితి
కెమ్మోవిరుచులఁ జొక్కించి తింతియుముద్దుగుమ్మగుబ్బలఱొమ్ము గుమ్మనయితి
నను నేకతమున రమ్మని యొప్పి రప్పించి తెఱవ యేటికిఁ దల్పుఁ దెఱవవయితి

తే. నీకుఁ జఱణావతుఁడ నైతి నేత్రజితచ, కోరనన్నిచ్చలో నేఁకోరవయితి
వందు రాత్మప్రపంచము లైనజారు, లెదురుతాఁకైన నవ్వాడవదినెఁగూర్చి. 252

తే. పరుషటంకకుఠారసంభరణకరణ, జనితతాపరసక్లాంతశాంతకాంత
హస్తములఁ దేర్చునొక్కొక్క యవసరమున, శైత్యభైషజ్యమున దానిచన్నుదోయి.

క కైసేసిబిడ్డపాపల,తో సందడిలేమి నొడలు నొడలుం బిఱుఁదిం
తేనికుచంబులు మెఱయుం,గా సుందరి పోతబొమ్మగతిఁ జూపట్టున్. 254

క. చెలిచెలువు తెరవుకొసరుం, బలె నానాపక్షికభోగపాత్రంబై వ
ర్తిలుచుండ దానిచెడుపో,కలు దెలిసెం బతికిఁ గొంతకాలంబునకున్. 255

క. తెలిసి యొకనాఁడు వాఁడా, లలనాతిలకంబు తలతలం బట్టుకొనన్
వలయునని తలఁచి వెంగలి, కలికిం బరికించి నిర్వికారతఁ బలికెన్. 256

క. ఏలినయాకేరళీనర,పాలుఁడు నా కానతిచ్చెఁ బయనము చాలన్
గాలవిళంబన మోమహి, శాలిం దెమ్ము సంబళముఁ గంబళమున్. 257

క. వేఱూరికిఁ జని యిట కై, దాఱుదినంబులకు వత్తు నద్దినసము లా
ఱ్ఱాఱుకుమీ నీసంగతి, జాఱుట నాకనిశరోష సంతోషమునన్. 258

సీ. చివురువాతెర అచ్చసేయుఁబో వేఱూరి యొసపరిగానిపల్లొత్తుకెంపు
తమిగుబ్బచంటిపాళెముడిగ్గుఁబో వింతగుమ్మచిమ్మటవ్రేలిగోరి తాఁకు
మోముదామరతావి ముదమందుఁబో క్రొత్తబొజుఁగుకస్తురిముక్కుబొట్టుతేఁటి
చిన్నారిమేనవాసించుఁబో పొఱుగింటికలికిమట్టము ఱొమ్ముకమ్మపూఁత

తే. తనచొకాటపుఁజెక్కుటద్దములఁ బ్రతిఫలించుఁబో మాఱుమగని భ్రమించుకాపు
బ్రాఁతపోరాటమెంతమాఱఁ బఱచెననుచుఁ బొంగ లాంఛ్యానీవు సడ్డించితేవు. 259

క. తలపేనుపంటిసందిది, పులుకాలనుముల్లు నస్త్రమున యూకకటి
పలితీఁటపాదరక్షల్, శిలవోలెం బ్రాఁతమగఁడు చే టెవ్వరికిన్. 260

ఆ. నెరసుతోడఁబోలె నేత్రంబు దుర్భర, వ్యాధితోడఁ బాసి యంగకంబు
కాంతి నుల్లసిల్లుగతి వీనిఁబాసి యిచ్ఛానుప్రవృత్తి నగుదు నేను. 261

క. అనిమూఁపులు మూఁడై లాంగలవరథకారునకు సంబళము గంబళి మి
చ్చి నిలిచి కుహూరాత్రి గడల్కాన నప్పుడనిలిచి పేరుకొని పతికనియెన్. 262

ఉ. నిక్కువ మారికేగెదవె నీకు దయారహితాత్ముఁడైవగా
జెక్కుడఁగల్గె నిన్ను నొకయించుకనే పెడఁబాసి యుండలే
నిక్కువ నేను మీపిఱుఁద నిప్పుడవచ్చెదఁ దోడుకొంచుఁబొ
మ్మక్కఱదీఱ నాహృదయ మక్కట నీవశమౌ టెఱుంగవే. 263

క. నిమిషము దివసంబై దివసము నెలయై మాసంబు సంవత్సరమై
సమయుగమై చింతించెద, రమణా ఘనదీర్ఘయోగరాహిత్యమునన్. 264

ఉ. ఈచెలు వీకళావిభవ మీగుణ మీకమనీయవిగ్రహం
బీచతురత్వ మీగరిమ మేమగవారికి లేదు చూచితిం
జూచితిఁ బ్రాణనాథ నినుఁ జూచినకన్నుల కాలకాంతనా
రాచుఁడుఁ బట్టఁడీవు మగరాజవు రాజవు నిక్క మింతయున్. 265

ఉ. కేవలసాధనంబు లిరుగేల వహించి నటించునమ్మహా
భావజునట్ల యుక్కుటులిబాడిసయుం గొని నీవు మామకీ
నావసథంబున న్మెలఁగ నచ్చెరచాడ్పునఁ గన్నులార్ప కిం
పావహిలంగఁ జూతు దరహాసపరిస్ఫురితాననాబ్జనై. 266

క. విడిఁగలమాణిక్యము పు, త్తడితోడం గూర్చినట్లు తినతో నినుసొం
పసరం గూర్చినబ్రహ్మకుఁ, దడయక చేమొత్తి మ్రొక్కెదమె ప్రాణేశా. 267

క. తడసినఁ జత్తు న్నేడి ని,క్కడి కేతెమ్మనుచు ముద్దు గన్నీరొలుకన్
బుడిబుడియేడ్పులతో న,వ్వేడమాయలప్రోవు మగనివీడ్కొల్పుటయున్. 268

ఉ. వంచనఁజేసి వాఁడు తలవాకిలి వెల్వడి పోయిపోయి య
స్తాచలకుంజకోటరమునం దినుఁ డేగినఁ దక్కఁబెట్టి యా
ముంచినచీకటి న్మసలి ముచ్చవలెం జొరఁబాఱి యింటిలో
మంచముక్రిందఁ దూఱుకొని మానముఁ గైకొనియుండె నంతటన్, 269

ఆ. జలములాడి మేనఁ గలపంబు నలఁది యు,చ్చెలువ చలువ వలిపెచీరఁ గట్టి
ముడిచి కుడిచి లేచి విడియంబు సేయుచు, మొదలియామమయిన యదనెఱింగి.

ఉ. ఆతెలిగంటిగంటి సెరసైనవిభుం దరిగ న్నిరంకుశ
ప్రీతి రమింపనమ్మ నిటఁ బిల్చెను నీవనితోఁజన దూతి యా
రేతిరిఁ బోయి చీరనగరిప్రతిరథ్యముసుం గొనర్చి సం
జాతకుతూహలుం డగుచు జారుఁడు తత్సదనంబుఁ జేరఁగన్. 271

ఆ కోళ్లమూఁడు దుద్దుగొంగడిఁ బఱచిన, మంచమునకుఁ గ్రొత్తమగనిఁ గొనుచు
కులుకునడల వరిగి కూర్చుండె దానిక్రిం, దింటిమగఁడు డాఁగు టెఱుఁగలేక 272

చ. ప్రవిఘటితానురూపదృఢబంధ మమంధరమోదకృద్గళా
రవము కటీకపోలముకురస్తనదృష్టనఖక్షతంబు కై
తవపరిహాసభాషితమతాంతచపేటముపాస్తలజ్జము
ప్రవిమపరూహ ముల్లసిలె సంగమ మిద్దఱకు న్నిరాంధ్రమై. 273

క. సాధీయాకృతధారా, సాధారణకరశిఖరనిశాతనఖంబుల్
సాధింపఁగ రతినాథా, యోధనసాధనములయ్యె యువయువతులకున్. 274

క. ఆసతి యుపపతియును నిజ, వసతిం జెలరేఁగి యట్లవారణగాఢో
ల్లసనమునఁ బెనఁగ దుసికిలి, వెస నచ్చెలికాలు మగని వెన్నొత్తయుటయున్. 275

క. దిటచెడక యద్ధరిత్రీ, కటిమదిలో నిశ్చయించెఁ గనలున నీచీఁ
కటి నెక్కటి నిక్కడికం, కటిక్రిందిటువచ్చె గట్టిగా మగఁ డనుచున్. 276

క. గతితృప్తిఁ బొంది యయ్యుప, పతి నాతిం జూచి పలికెఁ బద్మముఖీ నీ
పతిరతిలో నారతిలో, మతిఁ దలఁపఁగ నీకు బ్రియతమం బెయ్యదొకో. 277

క నోరార్పక నిక్కము జెప్పు,మా రామా ప్రేమ ననిన నది వానిదెసన్
గూరిమిఁ గలిగియు నలరథ, కారమనోరంజకంబుగా నిట్లనియెన్. 278

మ. *పతికందర్పరహస్యకేళికిఁ దలంప న్నాకు రోచాచరణ
స్థితి ముంగొంగుపసిండిగాదె యది నాతిం బ్రీతిఁ దేలింపఁగా
రతివాచాగతుఁడై విరక్తిఁ దొఱఁగంగాఁ జేరుజారుండు నీ
సతమే చెప్పకు వానితో డిరతి నిస్సారంబు రాజాస్యకున్. 279

క. ఇదియేటిమాట యేలా, వదిరెదు నిను నీవెఱుంగవా నారమణుం
డుదధివిఱుపడియు వీవ, ల్లది సే ననకున్నఁ దెలియుదా నీమదికిన్. 280

క. రోఁతనినువంటిమానిసి, క్రోఁతికి నామగనిఁ బేరుకొనఁ జక్కడకున్

---

* ప్రతిప్రాణేశరహస్యకేళికి నని పాఠాంతరము.

జేతికిఁ గలవాని సుమీ, కాతాళముగాదు నీకు ఘనుఁ డాతనికిన్. 281

ఉ. ఒంపననేల నామగనియొద్ద రమించుట యింద్రభోగమై
యుండునయో యనుంగువిభుఁ డూరికిఁ బోవు టెఱింగి యొంటి ని
ట్లుండఁగ వచ్చి పట్టికొని యోరిదురాత్మక సిగ్గుగొంటి పి
వెండయుఁ బోలె వేఁడి ఘటియింపదె నాకిటువంటికూరిమిన్. 282

ఉ. రాచపను ల్వహించి వలరాచకుమారునివంటిదేవుఁ డ
య్యో చని కాళ్ళతో నరిగె నూరికి నెప్పుడు వచ్చువాఁడు లే
లే చవిగావు కండ్లు పెకలింపుచు నున్నవి ప్రాణవల్లభుం
జూచినదాఁక యొట్లునిలుచుం దనువెట్లు సహించియుండుదున్. 283

శా. కాయం బెక్కడనుండెనేమి వనితాకందర్పుఁ బ్రాణేశ్వరుం
బాయం జాలవు ప్రాణము ల్మసురుబ్బాలూళ్ళుగాఁ జేయుటన్
డాయ న్వమ్ముఁగదా పయోధరము లంటం గౌఁగిటం జేర్చి యా
చాయుం బైకొని చెక్కునొక్కు రతిరాజ్యశ్రీలఁ దేలింపుగన్. 284

చ. అగునగు పైనిమాలిచితినంచు విజృంభణవృత్తి నివ్విధి
న్నొగయనిమాటలం జెపులు సూఁడకు సైఁచినదానఁ గాను నా
మగనికి నిన్నువంటికొఱమాలినమానుసులీడె *భర్తతోఁ
దెగి యొడఁద్రవ్వకం బ్రదికితే మని యైనవనై సుఖించెదన్. 285

చ. అనుతనుమధ్యభాషితము లారథకారుఁడు నాదరంబుగా
విని యిది నాయొడం బ్రణయవిశ్రుతయౌ నటుగాకయుండినన్
నను ననుకూలుఁ డంచు నుపనాథునితోడ శతౌవనంబుల
న్వినుతి యొనర్చునే పరిభవింపక చంపక కాతు మెచ్చితిన్. 286

ఉ. ఏను బ్రవాసినౌ టెఱిఁగి యింతట నంతట నాకుమా టెవ
ర్లేని దెఱింగి కన్గొని చలింపక వీఁ డిలుసొచ్చి యుద్ధతుం
డై నిలుపోవలేక కదియుంబడెఁ గూఁతలు రోఁతలంచు ల
జ్జానిధిగాన మెత్తఁబడి సాధ్వి రతిస్థితి నూరకుండెడున్. 287

ఉ. చిక్కితి వీనిచేత రొదసేయుట సిగ్గులచేటు పొంగగం
జొక్కక వేగ నిల్వెవరఁ జూడఁడు ముచ్చటఁ దీర్పకున్న వీఁ
డుక్కవ నేమిసేయునో భయోదయ మయ్యెడునంచు నోడి యా
చక్కరముద్దుగుమ్మ సరసప్రియభావల నింపొనర్చెడున్. 288

* భర్తకుం దెగి యొడఁద్రెవ్వినం బ్రదుకదే యని పాఠాంతరము.

క. అతివా నారతిలో నీ, పతిరతిలో నిష్టమెద్దిపలుకం దగునం
చితఁ డడిగిన హితరూపా, న్వితుఁడని నన్నుబల పొగడె వీనిం దెగడెన్. 289

ఉ. పంచన యిప్పు డీతులుగపంకజనించె జనించుఁగాక యీ
చంచలనేత్ర నాయెడఁ బ్రసన్నమనోరథ దీనిమాటలన్
గాంచితి మోదమంచు రథకారుఁడు వేగ సజారదారతో
మంచము నెత్తికెత్తుకొని మంజుగతిం జని వాడవాడకున్. 290

ఉ. వాకొని యొంతకాంత యొటుగంటిపతివ్రత యొంతియుత్తమ
శ్లోకవివేకరాశి యనుచుం బ్రియ మెన్నుచు హస్తతాళమా
నైకలఘుప్రచారగతి నాడెఁ బ్రహాసవిలాసవక్త్రుడై
మూఁకలుగట్టి నాగరికముఖ్యులు తన్నరికించి నవ్వఁగన్. 291

వ. ఇచ్చరిత్రంబు సాపరాధుం డగుచిరంజీవిం జేపట్టిన నీ కుదాహరణం బగు నని రక్తాక్షుండు చెప్పిన నప్పలుకు లాదరింపక నులూకేశ్వరుం డూరకుండె నంత నయ్యభిప్రాయ మారసి. 292

క. తనకు నులూకత్రాసము, మనుగడ కుపహతి యునబహుమానత్వము లే
దని తెలిసి తెలివిఁ గలయా, వనమునఁ జిరజీవి ఘూకనాథుని కనియెన్. 293

క. నీరిపుచే నూరక యిబ, ధీరణఁ గాంచితి జగద్విదితమతి నయ్యున్
క్రూరాగ్ని కాహుతిగ దను, ధారణ మిఁకజాలు వేల్చెదం బ్రాణంబుల్. 294

క. నావిని రక్తాక్షుఁడు చిర, జీవిం బరికించి చచ్చి చేసెడుపనియే
మీవివరపుట్టఁ జెపుమా, నీవనుటయు నాతఁ డాతనికి నిట్లనియెన్. 295

క. ఈకాయ మనలముఖమునఁ, బోకార్చి యులూకయోనిఁ బుట్టి బలిమిమైఁ
గాకముల గర్వరేఖా, స్తోకములం ద్రుంతు మనసుతుందుడుకారన్. 296

వ. అనిన విని రక్తాక్షుండు. 297

క. లోకద్విషుఘనసమీరమ, హాకుధరంబులవరింతు నని కాదాపూ
ర్వాకృతికి వచ్చె నొక్కతె, కాకికి నీకేల కౌశికత్వము గల్గున్. 298

క. అనురక్తాక్షునిఁ గనుఁగొని, ఘనుఁ డచ్చిరజీవి వలికె గాఢప్రజ్ఞా
ధన వినఁగోరితి నిక్కథ, యనురక్తిం జెప్పుమనిన నతఁ డిట్లనియెన్. 299

సీ. కైటభాహితపదాంగదమౌక్తికచ్ఛాయ విధికమండలుసమన్వితమరాళి
మారారిమకుటబృందారమాలికవిముత్కృష్ణధేనుత్సురక్షీరధార
సాధుజీవంజీవచంద్రికసుగరజస్ఫాటికస్వర్గసోపానపంక్తి
చిరతపోవిత్తసంచితభగీరథకీర్తి వారాశిహృదయకౌతూహలవర్చ

తే. పరుషహానిప్రశాపసంప్రాప్యమాణ, మిత్రసహపుత్ర గీర్వాణశత్రువేష
సముదితక్లాంతిహ్రాంతిసమ్యగమృతవృష్టి, గంగ పొంగడంగ నెగడు శంగత్తరంగ 300

సీ. తజ్జలంబుల నొక్క తపసి యాస్వాదింప శయపుటం బల్లనఁ జాఁపుచోటఁ
దటకుటానిలనటద్విటపకాండనిషణ్ణ ఘనగృధ్రచంచునిర్గళిత యగుచు
మూషికపడిరెయి నమ్ముని దానినిజతపోమహిమను నొక్క మనోజ్ఞమహిళఁ జేసి
కన్నకూఁతునకంటెఁ గడుగారవంబునఁ బోషింప నొకకొన్నిపూఁటలకును

ఆ గుఱులుగూడెమేను మెఱుఁగెక్కెఁ బాలిండ్లు, బయలు మెఱసెఁ బిఱుఁదుబలిసెనడలు
ముఱిప మెఱిఁగె సిగ్గుమోమున నివురొత్తెఁ, దోయజాస్య కలరుఁ బ్రాయమైన.

క. కలితరుచిమించునించున, ఫలముంబలె నూఁగునూఁగుఁబ్రాయము చెలిపై
నిలువం గని ముని మనుపీ, వలెనని తలపోసె నధికవాత్సల్యమునన్. 302

క. ప్రతినూతనర్తువేళా, న్వితి యొవ్వతె యవ్వధూటి వృషలి యగు న్ద
త్సతిపాణిగ్రహణముఁగా, మతిఁ దలఁపరు సుమతుల నభిమతమ్మై యునికిన్. 303

వ. ఇంతపమున్న వివాహంబు సేయలేనైతి నిచ్చిపుచ్చుకొనువారికిఁ గులధనాది గౌరవంబులు సదృశంబులునయిన ననురాగంబు పెరుగు దాంపత్యభావనాదులు పరస్పరానురూపంబు లయియుండిన సతిపతులకుఁ బ్రేమాంకురంబులు వృద్ధిఁబొందుఁ గావున నివ్వనజగంధి మహానుభావుండగు సూర్యదేవునకుం బరిణయంబు సేసెద నని యామ్ముని తీవ్రధాము నాకర్షించి. 304

సీ తనునోరఁ జేరఁ గ్రుచ్చినవారి కారోగ్య మిచ్చువాఁ డఘములు వ్రచ్చువాఁడు
పరరాజసంబాధ విరియుచక్రముల రక్షించువాఁ డిఱులశిక్షించువాఁడు
వేదాంతశుద్ధాంతవీధుల నోలగంబుండువాఁ డాపద ల్చెండువాఁడు
దుష్టమందేహసందోహంబు నెలగోలు తరమువాఁడు మురారితరమువాఁడు

తే. సంప్రదోషవచస్స్నితిజలదరించు, నవనిజనులకు దృష్టిపాటవము నిచ్చి
మించువాఁ డెల్లదిశల దీపించువాఁడు, సారసాప్తుండు మునికి సాక్షాత్కరించె.

చ. ముని యలతీవ్రధాముని సముజ్జ్వలధామునిఁ బూజసేసి యి
ట్లను దిననాథ యిక్కసలయాధర పెంపుడుబిడ్డ నాకు నీ
కెన సుముహూర్తవేళ వరియింపుము నీకిదె యిత్తునన్న న
వ్వనరుహబాంధవుండు శ్రుతవంతుఁ బ్రశాంతునిఁ జూచి యిట్లనున్. 306

తే. అనఘ నాకన్నఁ బర్జన్యుఁ డధికుఁ డభ్ర, సంచయంబున నను నిరోధించుఁ గాన
నమ్మహాత్మున కీకన్య నఖిలమాన్యఁ, బరిణయము సేయు మదినీకుఁ బరమశుభము.

క. అనిచెప్పి తపనుఁ డరిగిన, ననఘుం బర్జన్యు నంత నాకర్షింపన్
జనుదెంచి నిలిచె నతఁ డమ్ముని యావ్వేల్పునకు నెయ్యమున నిట్లనియెన్. 308

క. కన్య న్భువనత్రయమున, న్నాన్య ననన్య న్వరింపుమా యిచ్చితి నీ
ధన్యత్వ మమర నన వ్బ్రహ్మన్యుం డిట్లనియె మానిజనమాన్యునకున్. 309
క. మరుదభిహతిదూదిక్రియఁ, దరలుదు నాకన్నఘనుఁ డతం డాయన కి
త్తరళాక్షి నిచ్చి సంయమి, పర పెండ్లి యొనర్చి మనుచు వాఁడుం బోయెన్.
క. పవమానుఁ గ్రోధహతరై, పవమానుఁ దలంపఁ దపసిపాలికి నతఁ డా
ర్జవజవము లమరవచ్చిన, వివిధాతిథ్యముల గాఁరవింపుచుఁ బలికెన్. 311
చ. శుచితసభాయితాఖిలపురోపవనాపవనాసురాసుర
ప్రచయములందు నీసవతు రాఁ డొకఁ డిష్టజనప్రసన్నతా
రుచుల నలో శైలెంగి గుణరూపవయోనయధన్యుఁ గన్య నీ
కచలమనీష నిచ్చెద సదాదృతిఁ గమ్ము వివాహ మీవనన్. 312
చ. నరులు సురల్ భవాదృశులు నన్ను మహాబలుఁడం డ్రు సత్యశా
పరపరమేష్ఠిశైలము లపారబలంబులు నేనెఱుంగుదుం
బరు లనుచున్న నేమి కనుపట్టిన పట్టిధరాధికర్త కా
దరమున నిత్తుఁ గాకని సదాగతి సెప్పి యథేచ్ఛ నేగినన్. 313
క. ధరములఁ దటఘటితతపయో, ధరముల సంగీతముఖరదైవతవిద్యా
ధరముల శ్రీగరుడసుధా, ధరములఁ దలఁచుట యుఁ బర్వతము లేతెంచెన్ 314
క. ముని యద్ధరణీధరములఁ, గనుఁగొని యిట్లనియె నాత్మకన్య ననన్యన్
జనలోకమాన్య నిచ్చెద, గొనకొని యొండొకఁడు పుచ్చుకొనుఁ డింపెసఁగన్.
చ. అతిశుభలగ్న మీసమయ మన్న నమస్కృతు లాచరించి ప
ర్వతములు పల్కె నేఁ డబలవంతులమందురు పాదజర్జరీ
కృతులము మమ్ము లెక్కఁగొన వెల్క లు వానికి నిమ్ము నిర్మల
వ్రతభవదీయ ప్రీతి కనివారణ లేకని చెప్పిపోయినన్. 316
క. ఎలుకలఁ బిలిచి మహాముని, కులవల్లభుఁ డనియె నిత్తుఁ గూఁతు న్మోదం
బొలయ వరియింపుఁ డొకఁడని, పలికిన నవి కరము వెఱఁగుపడి యిట్లనియెన్.
క. ఎలుకలకు మనుజసతులకుఁ, గలయిక లెట్లనిన మౌని కమనీయతపో
బలమునఁ గ్రమ్మఱఁ గూఁతురు, నెలుకంగాఁ జేసి యొకటికిచ్చెం బుచ్చెన్. 318
వ. అట్లగుటఁ గాకి వగునీకు ఘూకజన్మ మొల్లుగల్గునని కీరడం బాడి యాధిక్షేపించు రక్తాక్షుని వారించి యరిమర్దనుండు ప్రసాదపురస్సరదృష్టిఁ జిరజీవి నాలోకించి.
ఉ. క్రూరతరావలోకములు ఘూకము లాదృతి నీకు నీప్సితా
హారము లిచ్చు నిర్భయుఁడవై ధరణీరుహదుర్గకోటరా

గారములం జరింపుచు సుఖస్థితి నుండు కొంతలేక రో
భూరివివేక యంచుఁ గడిపోవనిభక్తి బహూకరించినన్. 320

వ. కృతకృత్యుండ నయితినని ధైర్యవిజితనీహారాచలానర్గళప్రచారంబున దుర్గబాహ్యాభ్యంతరంబులం బ్రవర్తించి యన్నియుం గనుంగొని శరీరవర్ధనపర్యంతంబు చింత దొరలకుండ ఘూకంబులం గలసి మెలసి పక్షంబులు వ్యవహారదక్షంబు లగుటయు నొక్కనాఁ డెడఱు వేచి యులూకమూలోత్పాటనంబునకుఁ బృథ్వీరుహదుర్గకోటరద్వారంబుల నీరంబులుగాఁ బూరిఁగూరి నీరసేంధనంబులు దుఱిఁగి కరీషపిండఖండంబులు గ్రుక్కి యక్కడ నిలువక మేఘవర్ణుఁ గానంబోయి యవ్వాయసపతిచేత సంభావితుండై యప్పు డుపస్థితంబైన కార్యంబు విన్నవించి చిరజీవి యిట్లను నీవును నిన్నుం గొలుచువారును నీరసతరుశాఖలను గొఱవులను బట్టుకొనిరండు వైరిసంహారసమయం బిదియని తెలుపుటయు. 321

క. ఎరవలిపట్టినకొండల, కురువడిఁ జని కాకిమూఁక లొక్కటఁ గొరవుల్
వరవరవలైనపిడకలు, తరిగ్గైకొనిపోయి ధీరతం దగిలొల్పన్. 322

మ. తగ నత్యుద్ధతి మించువాయువులచేత న్రాఁజితోద్దీనక్రొం
బొగలై కీలలు పర్వి నిక్కఁ జిఱునిప్పు ల్రాచి యుక్కుష్మడిన్
గగనం బంటి ఘనస్ఫులింగములు నాల్కల్గ్రోలియునచ్చిమ్మనం
బగిలెం బ్రేలిపడెం దివాంధకులము ల్భస్మంబులయ్యెం దుదిన్. 323

క. ఈవిధమున నిశ్శేషము, గా వైరుల సంహరించి కౌతూహలసం
భావితుఁడై యప్పుడు చిర, జీవికి వలకాకరాజశేఖరుఁ డనియెన్. 324

క. పగవానిగృహము మృత్యువు, మొగమచ్చో సన్నిదివసములు గట్టా యే
పగిది జరించితి వీవని, వగచిఁ జిరజీవి మేఘవర్ణుని కనియెన్. 325

చ. అవసరపడఁ గార్యకాంక్షి యగు నాతఁడు దేజము డాఁచి దుస్థితు
ల్గుడుమును నీచుఁ గొల్చి తిరుగుం దివిషజ్జయులై ధరిత్రిఁ బే
ర్పడినసహోదరుల్ దనకుఁ బ్రాపుగ నుండియుఁ బుణ్యగాథలం
గడపఁడె మత్స్యరాజుసముఖంబున ధర్మసుతుండు కాలమున్. 326

ఉ. పౌరుషము న్మహాబలముఁ బండితభావముఁ గల్గినట్టియా
ధీరుఁడు కార్యదాహనిరతిం బరుఁగొల్చుమహానసాగ్నిధూ
మారుణతాత్ములు న్మలినమైనపటంబు మహావిభూషితా
కారము దర్వియు న్మెఱయఁగా నలభీముఁడు మాత్స్యుఁ గొల్వఁడే. 327

ఉ. పౌరుష ముజ్జగించి నగుబాటున కోరిచి సాధుగస్థితా

కారతఁ గాలకాంతుఁ బాసఁగ న్నిజకార్య మొనర్పఁ గాండివ
జ్యారవదేవదత్తరభసత్ప్రభితాష్టహరిత్కరిశ్రుతి
ద్వారుఁడు క్రీడి మాత్స్యపురి నాఁడు బృహన్నలయై నటింపఁడే. 328

చ. ఒకదెసఁ గార్యదాహమున నుండక యేరికినైనఁ దీఱదం
తకనిభసత్త్వుఁ డాదరణధాముకటాక్షుఁ డఖండవిక్రమా
ధికుఁడు విలాసవిభ్రమణదేశము మాద్రికిఁ దొల్తపుత్త్రుఁ డా
నకులుఁడు మత్స్యరాజభవనంబున సాహిణియై చరింపఁడే. 329

చ. భుజబలశాలి నీతిపరిపూర్ణుఁడు రూపవిలాసవారిజ
ధ్వజుఁడు హరిజ్జయాభిముఖదర్పుఁ డతిప్రియభాషుఁ డాశ్రిత
ద్విజనిధి కార్యదాహనిరతి న్నిజవేషముఁ గప్పిపుచ్చి గో
వ్రజములఁ గాచువాఁడయి విరాటుపురి న్సహదేవుఁ డుండఁడే. 330

ఉ. కాలము దాఁట నెవ్వరికిఁ గాల్గలవారలు వారిరాశికీ
లాలపరీతభూతలవిపులాన్యపరాజముఖీశిరస్స్థ
స్థాలఘురత్నభానునికపాతిసమున్నతపదంఘ్రిపద్మపాం
చాలతనూజ తొత్తుపని సల్పదె దైవగతి న్సుదేష్ణకున్. 331

వ. అని చెప్పి బాష్పనిష్పీడితాక్షుండై వాయసాధ్యక్షుండు చిరజీవి నాలోకించి. 332

క. పరదేశ మఖిలదుఃఖా, కరము మదీయోపదేశగమ్యుఁడవై కా
ర్యరభసముకోర్చి రిపుమం, దిరమున నెబ్భంగి నుండితివి చిరజీవీ. 333

క. ఘూకములు దెగడ ఘూక, క్ష్మాకాంతుఁడు గౌరవంబు సలుపఁగ బ్రతిప
క్షౌకమున నుంటి విద్దశ, నాకతమున నీకుఁ గలిగెనా చిరజీవీ. 334

సీ. అని విన్నవయిన వాయసరాజు నీక్షించి యచ్చిరజీవి యిట్లనియె మత్ప్రి
తవున నీయాజ్ఞఁ దలమోచి యేనుండుతఱి మదాంధదివాంధతతులు వచ్చి
కెలఁకు లీక్షించి మీపాలకుఁడ లేకున్న తెరలివచ్చినత్రోవ మరలిచనఁగ
నున్నకన్నెఱిఁగి నేనొకశబ్ద మొనరించి క్రమ్మఱించితిఁ గార్యకరణబుద్ధి

ఆ. నప్పుడు వికృతమూర్తినైయున్న న న్నులూకములు గాంచి యెఱుఁగఁగానఁ దొలుత
నింపుకలిమి సంహరింపక నొంపక, నాదరమున భర్త కప్పగించె. 335

వ. అప్పుడు ఘూకవల్లభుండు నన్నుం జూచి నీ వెవ్వండవని యడిగిన మేఘవర్ణు
నకు ముఖ్యదండనాథుండ నగు చిరజీవి నని చెప్పితి నప్పలుకులు విని మంత్రులరా
వించి మంత్రకూటంబున నన్నుం జూపి యితని కుచితం బగు కార్యం బొకరొకరు
చెప్పుండనిన నందు రక్తాక్షుండనువాఁ డొక్కరుండు దక్కఁ దక్కినవారందఱు
నాపక్షంబ పలికిరి రాజును వారవాక్యంబు లంగీకరించి నీతిదక్షుం డగు రక్తాక్షుని

చెసి నాదరణంబు సేయుండరయ్యెఁ గాలపక్వంబును వట్టిద. 336

క. జనియింపం గలకార్యము, మనమున దగ నిశ్చయించి మంత్రి సునీతిన్
వినిపించిన వినవొల్లని, చెనఁటికి ముకుబంటిగాదె చేటుంబాటున్. 337

తే. గగనమంటిన దోషాగ్ని గాఢశాంతి, నీరమున శీతలము సేయ నేర్చు మంత్రి
విరహితారంభపరుఁ డైన సేవకుండుఁ, గార్యనిర్వాహకులు సూవె కరటముఖ్యా. 338

క. తానెంత కార్యపారగుఁ, డైన రహస్యమున మంత్రి నడుగక ధరణీ
జానకి నే కార్యంబుం, బూనందగ దుద్ధతప్రభుత్వప్రజ్ఞన్. 339

ఉ. ముప్పదిమూఁడుగోటుల సుమూర్తులవేల్పుల నేలువజ్రియు
ప్పప్ప యవార్యశౌర్యకరణాదులపట్టున నిందుకేనియున్
జెప్పనివాఁడె యట్టినయశాలి బృహస్పతిగోపనంబునం
జెప్పినపంపు సేయక విశృంఖలవృత్తిఁ జరింప నేర్చునే. 340

క. కావున రక్తాక్షుఁడు నయ, కోవిదుఁ డమ్మంత్రి మాట గురుమంత్రముగా
భావింపలేక కొటఁడు, పావకకీలాళిఁ గాలి భస్మంబయ్యెన్. 341

చ. అరయఁగ దుష్టమంత్రినివహం బనువారము గల్గియుండ నే
పురుషు ననీతిదోషములు పొందవు రోగములే యపథ్యబం
ధురుఁ గలఁగింప వేజనునిఁ ద్రుంపదు మృత్యువు లక్ష్మియెవ్వనిన్
జిరముదగర్వదర్పితునిఁ జేయదు పైకొనవేరి నాపదల్. 342

వ. లోభికిఁ గీర్తియు ఖలునకు మైత్రియు నష్టక్రియునకుఁ గులంబును ధనార్జనతత్పరు నకు ధర్మంబును వలసునకు విద్యయు గృపణునకు సౌఖ్యంబును బ్రమత్తసచివుం డగు జగతీపతికి రాజ్యంబును లేదు వెండియు నీరసేంధనంబుల వహ్నియు మూర్ఖు లందు శోకంబును జపలచిత్తులయందు గోపంబును గాంతలందు విత్తంబును దయాపంతులందు ధర్మంబును మహాత్ములయందు ధైర్యంబును వృద్ధిఁబొందు నది యట్లుండె. 343

క. వలనగునంతకు బగతుం, దలనిడుకొని తిరుగునీతితత్త్వజ్ఞుఁడు మున్
జిలువయొకం డట్టిద యై, మలుగందిన దే యనేకమండూకములన్. 344

క. అనినవిని మేఘవర్ణుం, డనురాగరసాబ్ధి నోలలాడుచు విద్యా
ఖనికా యొట్లికథ చెప్పు, మను డచ్చిరజీవి వాయసాగ్రణి కనియెన్. 345

సీ. విను పూర్వమున మందవిదుఁ డనుకాలాహి యాహారకాంక్ష నహార్ముఖమున
బఱచి యొండొకచోట బహుభేకకలకల ప్రతిభిన్నసకలదిగ్భాగ మైన
హ్రదము గన్గొని లోనికరుగ నెద్దిక్కున దెసవుగావక తీరధరణి నిల్చి
కుంభిని ఫణమూదికొని డిల్లచెడినట్లు పరవశుగతి రుగ్ణుపగిదినుండఁ

తే. బలిక మండూకపతి యుహోఘణివతంస, ప్రాణములు లోచనంబుల బతిలపఱిచి
రొయిఅచి రొమ్లుక యిట్లుండ సేలసేల, చింతలేమిటికేని భక్షింపరాదె. 346

క. తలద్రివ్వక మ్రింగుచు కే,వలము మహాబలునియంతవాని నయోనీ
కలఁతంబడ నీకార్యము, కలిగనోకో యన్నఁ బన్నగం బిట్లనియెన్. 347

తే. ఓదయానిధి ద్విజోపపాదితుండ, నైననాకేల దొరకునాహార ముఱక
నొరులు వెట్టినదనుక బస్తుండవలయుఁ, దనకు నావుడు మఱియు నద్దర్దురంబు. 348

క. అనిలాశనవల్లభచె,ప్ప నహో చిత్రంబు వస్తు పారణ లుండన్
వనరం గారణమున్నను, వినియెద జెప్పుమనిన మండవిదుఁ డిట్లనియెన్. 349

క. కేవల మాహారేచ్ఛం, బోవఁగ నొకనాఁటిరేయి భోగం బ్రద్రుపం
గావడి ద్రొక్కిన నొకభూ, దేవకుమారకునిఁ గఱిచితిని బదలుపడన్. 350

క. కాటువడి భీతిఁ గాయం, బూటాడంబరచి జనకునూరుద్వితయా
స్ఫోటితము స్తకుఁడై శిశు, వేటుపడినకురరివోలె నేడ్చుచునుండెన్. 351

క. అవలునలముద్దుపట్టిం, జడియకుమని వీపుజఱచి జనకుం డురమం
దిడికొని మునుగడ పుడమిం, గడువడకువ నున్ననన్నుఁ గని కోపమునన్. 352

క. వసుధామరుఁ డిట్లను వెలి, విసరినతమినోరి విసపువిత్తానోర
పసనాడెఁ గటకటా యి, క్కసుగందుం గుంపులేక కరనన్ బంపన్. 353

ఆ. కుటిలగతికిఁ బుట్టుగుడ్డికి వనుదివ, శ్రుతివిహీనునకును గ్రూరమతికి
బాపజాతికేలప్రాపించుఁ బరహితా, చరణవిద్య నిన్ను సైఁపఁదగునె. 354

చ. కడుదొడుసైన యిద్దురితకర్మము నిన్గొని ముంచుగాక యె
క్కుడఁ జననిచ్చుఁ బుట్టుపురుగా కొఱగా కెపు డస్వతంత్రతన్
మడుఁగుభజించి భేకముల మస్తమున న్ధరియించి కొల్చి యె
వ్వ డవి దయామతిం గడుపు పోయఁగనుండు పాకారిపొమ్మనన్. 355

క ధారాళచింత నంతం, గ్రూరతచెడి మిమ్ము మోచికొని తిరుగంగా
నోరాజా వచ్చితి నా,హారము మీరిడక లేదయా నాకనుడున్. 356

క. ఆరోహణకౌతూహల, సౌరభ్యము మోసులొత్తె జలపాదుఁడు దు
ష్టోరగభాషణములు మా,యారూపము లనక నిజము లని తనలోనన్. 357

క. తలఁచి యలచిలువకిట్లను, నెలకొనినను గొలువనిలువ నీహృదయమువం
గలిగిన నాహారం బిడి, తిలకుం గ్రొవ్వెక్క వడపెద నేనన్నుడున్. 358

ఉ.మందవిదుండు కప్పదనమాయకు లోనయి చిక్కె నంచు నా
నందమునొంది భేకకులభ్రమణాదులు నాకులేవు నీ

కందువచేరి భోగఫలకంబున నీవడము ల్వహించి యుం
దుం దుదిముట్టనందనుకఁ ద్రోవక డగ్గఱఁ జేర్చుకొమ్మిటన్. 359

క. నను విశ్వసింపు మెప్పటి, కనుమానము మాను చచ్చునంతకు నెందుం
జననని దేవతనగరికి, దనపేరం గమ్మకట్టెదం గొనుమనుచున్. 360

ఆ. కడుపుఁజూపి చావగా నింక నెన్నఁడు, వడుపుకొనియె దనుచు చెడుగుఁబురుగు
చెప్పరాని ప్రియముఁ జెప్పినహృదయంబు, గరఁగి భేకరాజు తెరువుచూపి. 361

క. ఆరోహింపఁగవలె గృష్ణోరగ యీసరియువెంట నొద్దికఁ జనుదె
మ్మా రయమున ననుటయు ని,ర్వారణనది పొంచ్చి కదియ వచ్చెం గప్పన్ 362

క. అప్పు డనురాగమెుప్పం, గుప్పలుగొని క్రొత్తిగొమ్మగొన్నట్లు పడం
గుప్పించి కప్ప తోఁడ, ప్పప్పఫణి ప్రసరుభోగ మారోహించెన్ 363

క. జలపాదుని బాదుకొనం, దలనిడికొని త్రాఁచు నేచునటనం దటభూ
ములకొంతసేపు ద్రిమ్మరి, యలసినగతి నూరకుండె నట్లుంచుటయున్. 364

ఉ. పన్నగభర్తఁ జూచి జలపాగుఁడు వల్కె నిదేమి వేగసం
పన్నము గాకయున్నయది మందవిదా భవదీయవిగ్రహం
బన్నభుజంగ మిట్లను దయామయ యాఁకటఁదీలుపడ్డ నా
కన్నదె యానశక్తి కడు పోమినమీఁదటఁ జూడు చిత్రముల్. 365

క. దొరలు తమవేడుకల జా,తురగాని వహించి తిరుగు తురగంబులఁ బ్రో
వరు మేపునీళ్ళుత్తినిడి, యనుదివ్యధ మనిన దర్దురాగ్రణి మదిలోన్. 366

క. కలతెర గిట్టిద యనుచుం, దలఁచి యయో విప్రశాపదశ దనయిచ్చన్
వలసిన యాహారము గొన, గలుగమి నిచ్చిలువ నొచ్చెగద యకటకటా. 367

క. భారవహం బిదిలేదా, హారము నే నిడక కటికి యాఁకట నిపుడే
కారెడునిట్లుండిన నా, యారోహణ కేళి యేక్రియం గొనసాగున్. 368

చ. అని తలపోసి మందవిదు నారసి యజ్జలపాదుఁ డిట్లనున్
ననుఁ దలఁదాల్చి యాడజవనంబువలెం జఠరానలంబురాఁ
జిన యపుడెల్లగప్పుల విశృంఖలవృత్తి భుజించి లావుగా
గొని విహరింపుభోగికులకుంజరనాదములన్ ప్రమదంబునన్. 369

వ. అని నిరప్పణగాఁ గప్పల తోడు సెలవిచ్చిన బలవంత మగుట నీరంబున నవర్గళ ప్రచారంబునం బేరెంబులు వాఱుచు నొడిసియొడిసి బడలుపడం గఱచి కిచుకు కిచుకురనక కతిపయదినంబులకు జలపాదావశేషంబుగా నిఖిలభేకంబులం భక్షించి.

క. తలనంటి పట్టుకొని చి,ప్పలువిరిగి పడంకుచున్నవాని నహో య
జ్జలపాదు విడిచి రోషా,విఃమానసుఁ డగుచు మందవిదుఁ డిట్లనియెన్. 371

క. తగునే భోగశిరోమణి, నగునే లోకవేళ నలఁగి యరుదెంచినఁ దై
నెగురుకొనఁ గొండయెక్కడ, దగరెక్కడ వలదె తారతమ్యం బరయన్. 372

క. నలఁకువ ధర నెవ్వరికిం, గలయతియు మహాబలారిగా యితఁడెంచుం
దలఁపక గౌరవమింతయు, సలుపక నను నసదునేయఁజనునే నీకున్. 373

క. అతిమణిఘృణిసంభరణో, చిత మగునాఫణము కష్టశీలా నీకు
త్రితపుటదుగులకు వర్హ్యామె, తతినిక్క వలాఅ మ్రింగెద న్ని న్ననుచున్. 374

క. పడి నొడిసిపట్టుకొని దెస, పడ నొడలుం దొడలు బడలుపడ నొక్కి ముదం
బడర దిగమ్రింగి వలసిన, కడ కరిగె న్మందవిదుఁడు కాకాధ్యక్షా. 375

వ. ఏ నమ్మందవిదుచందంబున నవమానంబున కోర్చి ప్రతిపక్షక్షయం బాపాదించితి
నని చెప్పి చిరజీవి మఱియు మేఘవర్ణున కిట్లనియె. 376

క. మూలముల జెఱుప వనల, జ్వాలలు తరువులనకాని చందనశైత్య
శ్రీల మగుగాడ్పు చెఱుచు, న్మూలంబులతోన వృక్షముల శీఘ్రమునన్. 377

క. ధనమున ఋణశేషము సా, ధనముల రిపుశేష మౌషధంబునఁ దనుసం
జనితగదశేష ముదకం,బున శిఖిశేషం బశేషముగఁ జేయఁదగున్. 378

చ. ముడివడియున్న దుర్వ్యసనము న్సడలించి దురంతరోషపుం
గడలి సుశాంతిసేతువునఁ గట్టి సమాసమదేశకాలముల్
కడఁగనిచిత్రగుప్తి పొసఁగ న్మను టెనికి వేయునేల యి
ప్పుడమిఁ గరస్థలామలకముల్గద సంపదలు న్శుభంబులున్. 379

క. శరములఁ బడరుమనీషా, శరములఁ బడినట్లు రిపులు సమరమువలయున్
శరములకు వలను ప్రజ్ఞా, శరములకుం గ్రాహ్యమెద్ది సరియా రెంటన్. 380

క. అలఁతులకు దైవయత్నము, బలవంతంబైన నెల్లపనులొదగు మహా
బలుల కది లేకయుండినఁ, బలుకులు వేయేల కడమువడు సర్వంబున్. 381

వ. సుచరితఫలంబులంగాక సకలకార్యంబులు చేకూడవు త్యాగంబున శూరుండును
వైదుష్యంబునం బ్రియుండును గుణంబుల లబ్ధుండును నగుచు రాజు రాజ్యంబు
గావింపవలయు నిందొక్క టితక్కినం బురుషాకారంబు నిరర్థకం బని విందు మది
యట్టిద. 382

సీ. ఘనమాపనిధి యనంగునకా ఘనంగిత్వ ముచితమే బలి కహివ్యూహావసతి
పాండునందనునకా బహుకాలవనవాస మిభపురాధిపునకా యేటిచారవ
యమకులాగ్ర్యత్మునకా శాపమరణంబు జాహ్నవీసుతునకా శస్త్రశయ్య
నలరాజునకా మహానసపాకభజనంబు నహుషునకా ఘోరనాగమూర్తి

తే. మతిఁ ద్రిశంకునకా పచ్చిమాలతనము, ద్రుపదనందనకా రాచతొత్తుపాటు
మనుజుఁ డెవ్వఁడు కర్మస్వతంత్రుఁ డరయ, నీశ్వరుఁడు గాక సమకూర్ప నిట్టిపనులు.

వ. ఇదియెఱిఁగి ప్రజ్ఞాన్యాయంబు లేమఱక యుండవలయు దైవబలంబు గలవాఁడవ గుట నీకు శీఘ్రకాలంబునఁ గార్యసిద్ధియయ్యె నిరమిత్రుండవయితి ప్రాప్తమిత్రుండవయితి వింకఁ బ్రాజ్యవైభవంబున రాజ్యంబు సేయుమని చిరజీవి చెప్పిన మేఘవర్ణుండు సకలసంపత్పరిపూర్ణుండై రాజ్యభోగంబు లనుభవింపుచుండె. 384

క. అని చెప్పిన ధరణీవర, తనయులు నిజగురునిఁ జూచి తాత్త్వికముఖ్యా
వినఁ బ్రియమయ్యెడు జెపుమా, కనువారఁ జతుర్థతంత్ర మని యడుగుటయున్.

చ. అతనుభయంకరైకవిషమాంబకసమ్యగనంతభోగసం
గతవిగతాంతరాయగతి గాఢవినాయకవత్తిచిత్తజా
ద్యుతిబహుపద్మజాండమణిదీపితకుక్షికరంకమందరీ
కృతపరతత్త్వవిజ్జటిమృగేంద్రవికస్వరయోగపుష్కరా. 386

క. రంగత్తరజాతమహా, గాంగేయస్తవనఘటితఘనపులకాయ
త్స్వాంగనిచోళయుతప్రా, గ్రంగస్థలమధ్యసంచరణశైలూషా. 387

మాలిని. కలుషమశకధూమాక్లాంతచింతామరామా
ప్రళయకరణరోషా ప్రాణిసంగుప్తితోషా
విలసదచలధర్మా విశ్రుతశ్రౌతకర్మా
సులభభజనలోలా సుస్థిరశ్రీవిలాసా. 388

గద్యము. ఇది శ్రీవేంకటనాథకరుణాలబ్ధ సరససాహిత్య నిత్యకవితావిలాస సకలసుకవికృతకైవారభాషణోల్లాస రాజకులపారావార పర్వశర్వరీరమణ నీతిశాస్త్రమార్గ పరిశ్రమణ ధైర్యపర్యాయధికృత నీహార పర్వత పర్వతరాజకుమార నిస్సహాయప్రబంధనిర్మాణ భోజభూదార సుధామధుర భారతీసనాథ వేంకటనాథ ప్రణీతంబైన పంచతంత్రంబున సంధివిగ్రహం బన్నది తృతీయాశ్వాసము.

శ్రీ ర స్తు.

# పంచతంత్రము.

## చతుర్థాశ్వాసము.


సత్యాలోకనజని
తాసమశరకరణసంభ్రమాధికనరక
త్రాసవిధిప్రౌఢరణా
భ్యాసభుజార్గళసనాథ హరిహరనాథా. 1

వ. దేవా లబ్ధనాశనాభిధానచతుర్థతంత్ర మాకర్ణింపు మధీతనీతిశాస్త్రమర్ముండు విష్ణుశర్ముండు సుదర్శనకుమారుల కిట్లనియె. 2

క. పరకపటాలాపపరం, పరకేర్పడ భ్రమసి విడుచు ప్రాప్తార్థముగా
పురుషుఁడు విడువఁడె మును సాగరమునఁ గపిశింశుమారకము గుప్ఫణితిన్. 3

క. నావిని రాజకుమారకు, లావిప్రవతంసుఁ బలికి రదియెట్లు నయ
ప్రావీణ్యా యాకథ జెప్పుమా వినియెద మనిన వారి కతఁ డిట్లనియెన్. 4

సీ. నీరదపథికపానీయనికేతంబు మేదినీయువతికటీదుకూల
మంబరచరనరాభ్యవహారసత్త్రంబు సరిదలంకృతికార్యకరణశాలి
కార్పణ్యభయదవీక్షణావధూజనికర్త రాక్షసజిద్విహారస్థలంబు
మునిరోషనష్టనాకనిసర్గశుభదాయి నిస్తులరత్నపూర్ణితకరంక
తే. ముగ్రశతధారధారాసముగ్రభీతి, పరవశాగత బహుకుభృద్భరణనిపుణ
మతనుసత్త్వ మలక్షితౌర్వానలంబు, వఱలు దక్షిణశరధిసర్వజ్ఞశరధి. 5

సీ. ఇమ్మహాగాంభీర్య మెవ్వనికొదవు నీవాహినీభరణ మెవ్వనికిఁ గలుగు
నీగోత్రరక్షణ మెవ్వనికబ్బు నీయనిమిషావాప్తి యెవ్వరికి దొరకు
నీసత్త్వసౌభాగ్య మెవ్వనికెసఁగు నీఘనహితాచరణ మెవ్వనికి నొదగు
నీగాఢజీవన మెవ్వనికుండు నీకనకరత్నోర్ము లెవ్వనికి వశము
తే. నీలలితరాజసన్మాన మెవ్వనికి లభించు నెవ్వని కిట్టియొప్పిదము నిత్య
భూతనికేతా యని లోకు లభినుతింపఁ, గ్రాలు నిర్భరవిభుఁ డాపగావిభుండు. 6

క. అపరిమితం బుడుకుతర, ణ్యుపసక్తం బఖిలజలధరోపాస్యం బా
త్మపదస్థానిమిషంబు, ద్విపులాక్షౌమం బనంతవిధ మెఱిఁగించున్. 7

క. ఆనీరధితటమున బహు, మానుం డనువాఁడు వృద్ధమర్కటుఁడు మహా
వానరులు ముఖరశత్రి, స్థానరులు భజింప సుముఖుఁడై వర్తిల్లున్. 8

ఉ. వానికిఁ గంటిలో నెరసువంటివిరోధి సమీపపర్వత
స్థానమునం జయోన్ముఖుఁడు తామ్రముఖుండు చరించు నమ్మహా
వానరసార్వభౌముఁడు ప్లవజ్జవసంగబహుప్లవంగసే
నానతగోత్రుఁ డౌచు నొకనాఁడు సమిత్కరణేచ్ఛ వచ్చినన్. 9

క. కైకొనఁగలబహుమానుం, డాకంఠక్రోధవివశుఁడై ప్రతివీరా
నీకినిపై బలధిక్కృత, నాకపుల న్గపులఁ బనిచిన న్నిశ్శంకన్. 10

క. ఆహవ మొనరించె సము, త్సాహత నిరువాఁగు దొడరి దంతాదంతిన్
బాహాబాహిముఖాముఖి, నాహావాజ్ముఖరఖచర మై నభ మొప్పన్. 11

శా. లావు ల్వేర్కొని నొంతు రుర్విఁ బిడికిళ్ళం ద్రెళ్ళ పార్శ్వాచల
గ్రావంబు ల్పెకలించి ఉవ్వ్యసురు మ్రగ్గ న్మొగ్గ వృక్షాగ్రశా
ఖాసంగంబుల నెత్తి మొత్తుదురు స్రుక్కం జిక్కఁ గంఠచ్ఛటల్
గావుల్పట్టుదు రొండొరు ల్మదమణంగం బ్రుంగ నవ్వానరుల్. 12

క. చఱతురు పెడచేతులనోఁ, గఱతురు తెరనోళ్ళఁ బిసితఖండంబులు రా
విఱుతురు పెళపెళ నెమ్ములు, పఱిబోవనికలిమిబలిమిఁ బ్లవగాధ్యక్షుల్. 13

క. విరసము నెఱసాహసమున్, బురిగొన నిట్లుభయసైన్యములు పోర న్ర
క్తరసతరసములు గదురఁగ, శరనిధిసత్వములు వెలివిసరి రాఁదొడఁగెన్. 14

వ. అప్లవంగసంగరం బావిష్కృతారుణంబు నవ్యక్తతారకంబు నగుచు నహర్ముఖం
బును లుంఠితాగమనంబు లుంఛితశ్మశ్రురోమంబు నగుచు బౌద్ధశర్మంబును నదృ
ష్టశాస్త్రంబు ననక్షతపరికరంబు నగుచు యౌవనవివాహంబును బరిభ్రంశితచడణం
బుం బ్రణష్టవళీవిలాసంబు నగుచుఁ గుకవికవిత్వంబును ననుకరించె. 15

క. అంతఁ దనఘనబలంబులు, పంతము దిగనాడి యోడి పఱచిన సంవ
ర్తాంతకుఁడన బహుమానుఁడు, తాం తేతరతామ్రముఖపతాకినిఁ దోలెన్. 16

తే. అప్పు డూర్ధ్వశిఖుం డైనయనిలసఖుఁడు, పోలె మత్తామ్రముఖుఁడుమూపులనతిస్ఫు
లింగసంఘాత ముదయింప నింగినింగి, దాఁకుచుం బాన బహుమానుఁ దారసించి. 17

చ. తఱిమివధింప శత్రునకుఁ దానసమీకసమీకరంతయై
యఱిముఱిఁ బల్కె నోరిజరఠా పెఱతావునకేగు నాబలం.

బెఱఁగియుఁ జావనేలయిపు డీ వన నబ్బహుమానుఁ డోరి ద
బ్బఱలకు రాక తాఁకు వెడపలుక్కుల కోర్చినవాఁడఁ గాఁ జుమీ. 18

క. పందకుఁ గాక పలాయన, కందళితోత్సాహునియందు గలుగునె యని మి
న్నందినకోపంబున నై, చెం దామ్రముఖుండు పుల్లసిల శిలవలుక౯. 19

క. మఱియొక కుటవిటపంబునఁ, జఱచి ఘనక్రోధదృష్టి సమకొనముష్టి౯
బఱియపడ నురముఁ బొడిచిన, మఱియుం బడకపుడు తామ్రముఖుఁ డుగ్రుండై. 20

క. బలవంతు మాల్యవంతుం, జలధికడం గడఁగి నొంప సమయింపంగాఁ
దలఁచు మహనుమంతుఁ డంతున, నలఘుం గ్రద్ధుముష్టిహతి క్షితిఁగూల్చె౯. 21

తే. కూల్చి చంపక యుసురుతోఁ గూడ నతని, నతని కాంతాళిఁ గైకొని యతులగతుఁ
బఱచి వానరాశి రాశితత్ప్రీంత కాంత, ధరఁ జిరాద్భుతిశై త్యకృత్యము లొనర్ప 22

క. కొండొకకాలమునకుఁ గపి, మండలపతి మూర్ఛఁదేఱి మహిరహితోఁ గూ
ర్చుండి కనువిచ్చి రిపును, ద్దండపరాక్రమునిఁ గాంచి తలవంచుకొనె౯. 23

వ. అగణ్యదాక్షిణ్యాభిముఖుం డగుతామ్రముఖుం డబ్బహుమాను నన్వర్థనాముఁ గావించి పంచిన 24

చ. జరఠకపీంద్రుఁ డట్లరిగి సాగరతీరమునందు మానితాం
బురుహభవాండషండపరిభూషితుఁడై వెలఁగొందు మన్నయో
శ్వరుఁడన నుజ్జ్వలజ్జటిలసారఫలంబులఁ బూర్ణమై మహా
గరిమ వహించుదాని మధుగర్భమునాఁ జను మేడిదోఁచిన౯. 25

క. పరికించి యయ్యుదుంబర, తరువెక్కి తదీయపక్వతరఫలసేవా
గరిమం బ్రాణానిలసం, భరణముఁ గావించికొనుచుఁ బ్లవఁగుం డుండె౯. 26

క. అలకపిచేతిపచేళిమ, ఫలము ప్రమాదమున జారి పాథోధిజలం
బులఁ బడియెఁ బడిననొండొక, బుళబుళశబ్దంబు సంప్రభూతం బయ్యె౯. 27

క. ఆనినదము కర్ణంబుల, కానందవిధావిధాయి యగుటయు గణనా
హీనము లగుతత్ఫలముల, వానరుఁ డక్కడలి నీటవైవఁగఁ దొడఁగె౯. 28

క. వనచరకరముక్తములై, వనధింబడు మేడిపండ్ల వారణలోలోఁ
దినుచుఁ జలింపక క్రకచుం, డను దారుణశింశుమార మహోద్భుఁడుండె౯. 29

క. అధికతమోదుంబరఫల, మధురరుచిం జొక్కి శింశుమారము మాసా
వధిగా నవోచ్చటన కర, మధివసియించె న్నిజప్రియావిముఖంబై. 30

చ. క్రకచునిభార్య కూర్మిచెలిఁ గన్గొని యిట్లనుఁ బ్రాణవల్లభుం
డకట యొకేనిఁబోయి తడవయ్యె విలంబన హేతు వెద్దియో

తిరమరమైతి నా నెగులుఁదీర్పుము నీవిపు డేఁగిచూచి నా
యరసుఖవార్తఁ జెప్పుమని యంచిన దూతికపోయి ముందరన్. 31

క. ఒకచో వికచోదుంబర, నికటంబున ముసలిక్రోఁతి నెయ్యంబునఁ బా
యక యున్న శింశుమారుం, గ్రకచాంకురదూతి ప్రీతిఁ గని చని యిట్లన్. 32

చ. చెలువఁటియున్నకూర్మి చెలిఁ జేరి వినం గన గ్రొత్తలైనపో
చెలి తెలియంగ నంతయును జెప్పెద రోయుక విన్ము నేను నీ
యలఘునియోగమూఁది చని యక్కడ నొక్కెడఁ జూచి వచ్చితిం
దొలఁగక వానరప్రమదతోఁ గవఁబాయనివాని నీపతిన్. 33

క. నేనెఱుకచేయుకొలఁది నిట, వెనువెనుకను వచ్చివచ్చి వెలఁదికొలందిన్
జననీపని చెప్పితిఁ బర, వనితారతి లుబ్ధుఁ డేలవచ్చు న్నగుచున్. 34

క. నావిని కాఁపుర మెట్టువలె, నీవిఁకమునఁ బ్రాణనాథుఁ డితరస్త్రీమై
త్రీపశుఁడయి యుండఁగ నని, పావకశిఖిపోలె మండిపడి యది మదిలోన్. 35

చ. కనుఁగవ నశ్రులోడికలు గట్టఁగఁ దైలనిషిక్తయై నిజా
వన మరవాంఛియుండె సదనంబున నత్తటి శింశుమారుఁ డ
వ్వనచరనాథువీడ్కొని యువారిగఁ దిన్యని మేడిపండ్లుగొం
చు నిలువ కేఁగుదెంచి యిం పొచ్చి కులాంగనఁ జూచి చూడ్కికిన్. 36

ఉ. ఒండొకభంగిఁ దోఁచు బడు నుల్లము ఝల్లని వల్కె శింశుమా
రుండు ప్రియానయాతిగవిరోధిసె హృత్పరితాప్రమాది నే
యండకువచ్చినం బలుక వక్కట నీవన శింశుమారిని
ష్ఖండవిధానమైనయలుకం దలచెయెత్తగు చూప దెంతయున్. 37

క. అదియట్టిద యప్పనికిం, బాదరగుటం దూతి ప్రీతిఁ బురికొనఁ బలికెన్
జదురాలికిఁ దెవులెత్తిన, యదినితో నెట్లుమాటలాడం గూడున్. 38

క. మందులు దెమ్మని చెప్పిన, మందులు నిచుఁ గొలుచుభటులు మాతోఁ దమలో
నిందెవ్వరుఁ బలుకరు నీ, చందముగా నెట్లు సాధ్విజా రుజ మానున్. 39

క. నావిని క్రకచుం డను మ, జ్జీవము లౌషధము లయినఁ జేడియకీలో
సేవింపఁజేసి నిర్గదఁ, గావించెదఁ జెపుము దాఁచఁగా నేమిటికిన్. 40

క. అని కూర్మి తేటపడఁ బ, ల్కినపల్కులు శింశుమారి గెంటనివేడ్కన్
విని నీతి తంత్రమంత్రిం, గనుఁగీఁటిన నతఁడు చేరి క్రకముని కనియెన్. 41

క. ఎలనాఁగ రోగమణఁపం, గలమందులు చెప్పఁడనిన ఘనశాస్త్రకళా
బలవేద్యులు వైద్యులు గే,నరీతిం గ్రోఁతిగుండె వలెనని రధిపా. 42

క. అది మదిఁ దలఁపఁగ నున్నన్, బ్రతుకదు చెడఁజెడఁగరాదు పరిణామమునన్
మఱిఁగదిరిన వెఱఁ గ్రకచుం, డిది యెవ్విధిఁ గొఱతు భార్య నెట్లీడేర్తున్. 43
క. బహుమానుం డొకఁడున్నాఁ, డహితుఁడు గాఁ డతఁడు హితుఁడు హాహా ముక్త
స్పృహాగృహారత్యర్థము దు:స్సహమహానాప్రజ్ఞ నెట్లుచంపుదు నతనిన్. 44
చ. నిరతము విశ్వసించు నతినిర్మలచిత్తున కెగ్గుసేయుకా
పురుషుఁడు దక్క భూరికులభూమిధరంబులు గావు సప్తసా
గరములు గా వరణ్యములు గావు భరంబని ధాత్రిమైత్రి నా
సిరివరుతోడ విన్నపము సేయదె వేఁడిన నట్లుగావునన్. 45
చ. కడపట భార్యనిల్కడను గాఁ దెలికానికి నెగ్గుసేఁత యొ
క్కఁడు దురితంబు కాఁపురము గూలఁగఁ జూచుటయు న్మహాఘ మి
ప్పడఁతుకపట్టున న్సఖునిపట్టున నింతి విశేష మింతకై
చెడుపనియేనియుం దగిలి చేయక మానఁగరాదు గొబ్బునన్. 46
వ. అని నిశ్చయించి బహుమానవధోద్యోగంబునం దిరిగి వచ్చి నప్పు డుప్పొంగుసమ్మ
దంబునం బ్లవంగపుంగవుండు. 47
క. క్రకచావికచాద్భుతియై, ద్దనుఁ గ్రమ్మక నరుగుదెంచెదవు కులకాంతా
నికట మకటా యసహ్యం, బొకొ సత్యముఁ జెప్పుమనిన నుదచరుఁ డనియెన్.
ఉ. ఏను భవన్నియోగమున నేగి ఫలంబులు కానుకిచ్చినన్
మానిని పల్కె నీ వరిగి మాసకమయ్యెఁ బ్రవాస మెవ్విధిం
బోనిది నీకు నెద్దిగతమో గతమోహభవద్వినంబు నా
తో నెఱిఁగింపుమన్న భయదూరసదాద్భుతి నంటి దానికిన్. 49
చ. తనయసనూనభామతిమిధామతటంబున లెక్కకెక్కుడౌ
ఘనఫలరాజిఁ గ్రాలు మధుగర్భము నాఁ జను మేడి దానిపై
మను వనువాసరంబు బహుమానుఁడు తక్కపిచక్రవర్తిప్రో
పున నితరం బెఱుంగక యపూర్వసుఖస్థితి నుంటి దాలిమిన్. 50
చ. మఱువఁగ రానిసఖ్య మది మాటలు వేయును నేల పుట్టి బు
ద్ధెఱిఁగితిఁ గాని యట్టిజగదేకపవిత్రునిఁ జూడ నెందు నో
తెఱవరో యంచుఁ బొరకుగతిం గృతి నీయుపకారకృత్యముల్
గుఱిగడనం బ్రియంబుతమిఁ గొండలు కోటులు చేసి చెప్పితిన్. 51
ఉ. చెప్పిన నంతరంగమున సింగఁడు బూరఁడునై ప్రియంబుసొం
పుప్పతిలంగఁ బల్కె నది యోయికృతఘ్నుఁడ వీవు గావె య

ప్పుప్ప సుహృత్తముం డయిన యాయన నింటికిఁ దెచ్చి వేల్పుగాఁ
చొప్పడఁ గొల్తు రట్లు పరిశుద్ధసపర్యల దేల్చుటొప్పదే. 52

ఉ. ఎక్కటి మేడపై నిలువ నేటికి నేఁటికిఁ గాదు నిల్చుఁగా
కిక్కడఁ బెద్దకాల మఖిలేప్సితభక్ష్యము లావహింతు నా
మ్రొక్కనిమ్రొక్కి పెక్కుప్రియము ల్నయము ల్పచరించి తోడితె
మ్మక్కపినాథునంచుఁ బ్రియయుంచిన నిన్గొని పోవవచ్చితిన్. 53

క. కారణవిముఖంబై యుప, కారముఁ గావింపలేరుగద లోకము కై
వారం బగు నిట్లన ని, ష్కారణవత్సలుఁడ వీవు కారణజన్మా. 54

క. కపివర నీచేనందిన, యుపకారపుటప్పుఁ దీర్పనోప న్గరుణా
నిపుణమతి నాగృహంబున, కిపుడీ వేతెమ్ము పూజ లిచ్చెద భక్తిన్. 55

క. ఇలువాడిమ్రుగ్గులిడి కూ, రలు గూర్లమరించి యేలరాఁ డాయెనొకో
వెలవెం బ్రొద్దని యట నీ, చెలియలు నేఁ డెదురుఁ జూచు సేవించుటకున్. 56

క. రారానిచోటుగాదు కృ, పారాజితపిచ్చుకుంటుపైఁ బర్వినభా
గీరథివిధమున నస్మద, గారమునకు రమ్ము కపిశిఖామణి యనుడున్. 57

వ. ప్లవంగపుంగవుండు. 58

ఉ. రాసిరణం బొనర్చి నిజరాజ్యముఁ గైకొని నన్ను గాసి గాఁ
జేసినవైరిఁ గన్గొనుచుఁ జెంగటనుండుట కష్ట మిందునా
కోసఖ యట్లుగానఁ బదమూఁద సహింపదు వంతువెంబడిం
గాసిలియుండువారలకుఁ గానని క్రంతలు మేలుగా వొకో. 59

క. అనఘా నీనిలయమునకుఁ, జనుదెంచెద మీకుఁగాక జలసంచారం
బనువగునే మముఁ బోలిన, వనచరులకుఁ జెప్ప మనిన వాఁ డిట్లనియెన్. 60

క. నీవాక్యము లుచితంబులు, గావె వయోవిహృతియేడఁ గపులేడ యొకే
నావీపున నిన్నిడికొని, యావాసముఁ జేర్చువాఁడ నరుదె మ్మనినన్. 61

వ. తద్భాషితంబులు మాయాదూషితంబు లగు టెఱుంగక. 62

చ. మెఱసి యుదుంబరద్రుమముమీఁద వసించినకీశరాజు చే
టెఱుఁగనికూనతెప్పవలె నేర్తెఱఁ దోఁచినశింశుమారుపై
నుఱికెఁ దదీయపృష్ఠమున నుండినవాఁడు విశృంఖలత్వరం
బఱచి హుటాహుటి న్మనికిపట్టున కేఁగెడుత్రోవ నేర్పడన్. 63

క. నీరము తెరువునఁ గొండొక, దూరము చని యలసి నిలిచి దుర్దాంతవిషా
దారూఢహృదయమై చిం, తారతి నది యూరెలుంగునం దనలోనన్. 64

ఉ. న న్నిటఁ డంతరంగమున నమ్మి యయో చనుదెంచుచున్నవాఁ
డెన్నిభవంబులం దొలఁగు నిష్ఠులఁ జంపినఘోరపాప మెం
దు న్ననువంటిదుష్టచరితుం బరికింపదు లోక మాక్రియల్
గన్నవిగావు విన్నయవిగా వొనరింపఁగఁ బాసె సఖ్యముల్. 65
క. నడవడి పురుషుని భారం, బిడి భూరివృషంబు ఱాత హేమము నొఱయం
బడు శుద్ధికీర్తిరుచులనుఁ, బడఁతులహృదయంబు లొరయఁ బడ వేగతులన్. 66
మ. పరమద్రోహపురస్సరంబులు నయోపాయక్రియాదూరము
ల్దురితచ్ఛన్నము లన్యతాపకగణోద్యోగంబు లప్రత్యయా
కరము ల్సత్యపరాఙ్ముఖంబులు సమగ్రక్షాంతివల్లీశిత
క్షురము ల్దంభమయంబు లెట్లెఱుఁగవచ్చుం గామినీచిత్తముల్. 67
క. ఈమనసులు గలిగినమహి, ళామాయామయతరోక్తులకు లోనై య
య్యో మదినమ్మినకీశ, గ్రామణిఁ దెగటార్చఁదలఁచెఁగా నా కనుచున్. 68
క. అలక్రకచుఁ డల్లనల్లనఁ, బలుకఁగ విని వానరాధిపతి భూరిభయా
కులమానసుఁడై యపుడో, దళితాఘా యేమిపలికెదవు నీ వనుడున్. 69
క. ధృతిఁ గ్రకచుఁ డపుడదత్త, ప్రతివచనుం డగుచు నుఱకపలచుచునుండన్
వితతప్రజ్ఞం గపి యు, ద్ధతు వానిం గ్రమ్మఱించెదం గా కనుచున్. 70
క. భీతిప్రవహ మతిధృతి, సేతువుచే నాఁగి పలికె చెలికాఁడా నీ
శాతోదరి నాసోదరి, కౌతుకమున నున్నె భవదగారం బమరన్. 71
క. ఇది వినవలతుం జెపుమా, మది వొదలఁగ ననిన శింశుమారుఁడు పలికెన్
గదబాధిత యయియున్నది, గద నీయనుజాత యెట్లుగా ధరియింతున్. 72
సీ. భార్యలేకయొనర్చుపండువు దండువు కులకాంతపెట్టనికూడు గెడు
పత్నితోఁ బలుకనిపలుకులు చిలుకులు గృహిణిలేనికబంధకేళి జాలి
జాయవాటింపనిసరసము ల్విరసము ల్ప్రాణేశ్వరికిఁ గానిపాటు చేటు
దయితకై చేయనిప్రియములు భయములు వల్లభవెలితైనయిల్లు పొల్లు
తే. ముద్దుకులకాంతసుద్దు లేప్రొద్దువినని, చెవులు గవులు వృథా వేయుఁ జెప్పనేల
యకట సతిలేనిబ్రతు కేల యర్థ మేల, వాహనములేల కరులేల వసుధయేల. 73
క. నా విని బహుమానుఁడు బా, ష్పావృతముఖుఁడగుచు వాని కనుఁ గ్రకచా నీ
దేవి రుజ మాన్పుటకు లే, రె వెజ్జులు మందుఁ జెప్పరే వా రనినన్. 74
క. చెప్పిరి వానరహృదయం, బప్పనికి నవశ్య మనుచు నగదంకారు
ల్తప్ప కది హేతువుగ ని, న్నిప్పుడు గొనిచనుట యని యహితుఁ డతఁ డాడెన్.

క. నగచరుఁ డదివిని వెఱఁబం, డ్లిగిలిచి పడపడ వడంకి యెదపడి చెడితిన్
చెగితిఁ గడచనితిఁ బొలిసితిఁ, బొగరున నిట్లయితి మోసపోయితి ననియెన్. 76

వ. అని. 77

క. దారుణగహనంబున నా, హారోఁతలఁ బెట్టుము దిమి నసురుసు కా
మారంభం బుడుగని యల, ఘోరాఘుఘలంబు గట్టి కుడిపెడునన్నున్. 78

క. భీమాటవిలో నున్నం, గామాంధుని బొదవు బాతకంబులు రాజ
గ్రామముననున్న దూరిత, కాముని గల్మషము లంటఁగా శంకించున్. 79

క. చిరకాల మరిగె సురిగెం, దరుణియు యిక నేడ గామతంత్రం బనుచున్
బరలోక చింత సేయుని, పురుషార్థముఁ జేటుపాటు పొందదె యనుచున్. 80

చ. క్రకమని చూచి వానరశిఖామణి యిట్లను నీవిచార మే
టికిఁ జెడిపోయె నేమిటికి డిందెదు భవన్మతిప్రాణమైనభా
ర్యకు రుజమాన్పఁ గీశహృదయంబునకుం జనుదెంచువాఁడ వీ
వకట యెఱుంగఁ జెప్పవలదా మునుగల్గగ నాకు నింతయున్. 81

ఉ. చెప్పిన నాయుదుంబరపుఁ జెట్టున నెప్పుడు దాచియుందు నొ
క్కప్పుడు మామకీనహృదయంబు సమర్పణఁ జేసిపుత్తు నీ
చొప్పున నింతదాచెదరె చుట్టముఁగానె విరోధినే వృథా
త్రిప్పటజేసి తింకొరులు దెత్తురె నిన్నడపం బ్రతిక్రియల్. 82

క. హృదయము దరువున నున్నది, గద నా కాయమున లేదుగద మును గా నా
కిది చెప్పక పని చెఱచితి, గద రిపుఁడవు గాని చెలివి గా వంగనకున్. 83

సీ. ధర్మార్థకామచింతనులకు భూదేవధారుణీపథపథూదర్శనములఁ
జనరాదు రిక్తహస్తములను గావ్యార్థి వగునీవు మున్ను పాయనములయు
హృదయంబు మేడినున్నది పోకమరలు నిర్మండితారిసికాయ గుండెకాయ
చేయూర నీకు నిచ్చెదఁ బుచ్చుకొని చేరి జాయ నిరామయఁ జేయవయ్య

తే. యనుచు బహుమానుఁ డాడుమాయామయోక్తు, లాగమోక్తులుగా నవ్వాడాత్మఁ దలఁచి
తిరిగి యాశింశుమారుఁడే తేరఁ దీర, వృత్తు మెగఁబ్రాఁకి కపి వాని వెక్కిరించె. 84

క. కసినుస నాఁకట ఫలము, ల్మెసవుచు జలివిడిచి మేడిమీఁద స్వోదం
బెసఁగ నటియించు వానరు, మసలక వీక్షించు శింశుమారుం డనియెన్. 85

చ. కుజమున నున్న వానరుని గుండియ దండియశంబు నీకుఁగా
భుజబలసార యిమ్ము కొనిపోయెద నాయెదదీఱ మత్ప్రియా
రుజ కనఁ బల్కెఁ గాననచరుండు దురాత్మ విచారమూఢ యే

కుజమునను౦డు వానరునిగుండియ యెక్కడిజోలిపొమ్మిఁకీ. 86

చ. స్తుతులఁ గరంచి నాగృహము జాతువు దమ్మని తోడుకొంచుఁబో
యి తగవుమాలి నన్నుఁ బొలియింపఁగ యత్నముఁ జేసితేను నీ
గతి భవదీప్సితం బొసఁగుకై పడి నిన్నరలించి మేనిఁ బ్రో
చితి జిరకాలజీవి మతిశీలుఁడ మోసము నాకుగల్గునే. 87

క. కదలుమిఁక వనివఁ గ్రకమం, బెదపడి యేనలన మోసమెఱుఁగనివను ని
మ్ముదిక్రోఁతి మోసపుచ్చెం; గదరా యని విన్ననగుమొగముతో నున్నన్. 88

వ. బహుమానుండు. 89

క. దొరకిన వను విడుచుట కబ్బురపడకుము నీకుఁ దోడుపోయినధరణీ
సురుఁ డొకఁడు లబ్ధమనుజే, శ్వరకన్యక విడిచి రిత్తవాఁడై చనఁడే 90

క. నానీరచారుఁ డాబహు, మానున కిట్లనియెఁ దెలుపుమా వినవలతున్
దానేలవిడిచె నయవి, ద్యానిధి బ్రాహ్మణుఁడు భూతలాధిపకన్యన్. 91

సీ. అనిన శాఖామృగాధ్యక్షుఁ డాక్రకమునిఁ గనుఁగొని పలికె నిక్కథ వినంగ
దగుదువు నేనును దగుదు నీకెఱిఁగింప మును విశాలాపురంబున సుకీర్తి
యనురాజు రాజిలు నమ్మహీజానికి భువనమోహిని యనుపుత్త్రి గలదు
దానికి మందాభిధానుఁ డొండొక గ్రాత్రిదశుండు సుముఖుఁడై చనువుఁ జెప్ప

ఆ. నట్లు కొంతకాల మరిగిన నపరంజి, పసిఁడి కలరుతావి వలె మనోజ్ఞ
ఫలము చెఱుకునంటఁబలె నేమిచెప్పలేఁ, బ్రాయమయ్యె నానృపాలసుతకు. 92

మ. సితరోచిర్ముఖిక ప్పగొప్ప సుమనస్స్నేహం బధిష్ఠించి కృ
ష్ణతనొందంగని యోర్వలేక వదనాబ్జాతంబు గాంచె న్విధూ
న్నతిజన్నుంగవ యచ్యుతాప్తి బొదలెన్ మధ్యంబు దాల్చెన్ హరి
స్థితిరోమావళివల్లి వక్రితభజించె న్నిష్ప్రియాసక్రియన్. 93

శా. బింబోష్ఠంబు మధూద్ధతంబు పరహృద్భేదు ల్లటాక్షంబు లా
స్యం బుద్యద్ద్విజరాజమండలపరిస్పర్ధాళు వాకర్ణదీ
ర్ఘంబా గ్రాల్గనుదోయియుం గువలయప్రత్యర్థితారాపథా
లంబు ల్వాల్గురులేలొకో పొగడుబాలం జాలముల్లోకమున్. 94

శా. లీల న్నాగరసోదయస్ఫురణదాల్చెన్ మైజగద్గీతస
ర్వాలంకారపదప్రవీణయది యాహా యట్లుగాకుండినన్
వాలగ్రంధివరాళిమోవి నను దీవంగూడి తోరంబులౌ
పాలిండ్లన్ ఫలమంజరీగరిమ జెప్పం జాఁకనౌ నెవ్విధిన్. 95

మ. అతిభాస్వత్తరకాంచనంబు చెలినాసాంగంబు కల్యాణ మా
శతపత్రేక్షణ మేను మేరుకుధరాంచత్కూటము ల్దానియు
న్నతవక్షోజము లేమిచెప్ప నదియుంతొయంతబంగార మ
ప్రతిమం బౌనరనాథుపట్టి గణుతింప న్శక్యమే యేరికిన్. 96

క తనకుఁ బయోధరభృతి వ్రేఁ, గని మి న్నెలనాఁగమధ్యమయ్యె న ట్లైనన్
జనను పయోధరభారము, జనవాంతరకగ్నమేల చను నెంచున్నన్. 97

క, పరమాణువు పరిమమహ, త్పరిపూర్తి న్గోచరించుపరమమహత్తున్
బరమాణువై కనంబడు, దరుణీమధ్యస్తనేక్షత త్త్వజ్ఞులకున్. 98

క కన్నులకు మొగము చాలదు, చన్నులకు నురస్థలంబు చాలదు వెన్నుం
బెన్నెరివేణికిఁ జాలదు, కన్నియచెలువంబుఁ బొగడఁగా నాతరమే 99

వ. ఈదృగ్విలాసధన్య యగు నారాజకన్య చకోరికాపరివృత యగుచంద్రికయుం బోలె
సఖీజనసహాయ యయి వన్నెమెఱసి యొక్కనాఁడాస్థానంబునకు వచ్చి వల్లెగుదెం
చిన కుమారీరత్నంబు సౌహార్దభాసమానోల్లాసంబునం దిగిచి యంగపీఠంబున నునిచి
సుకీర్తిబంధుజనాదులతోడఁ దత్సౌందర్యసౌశీల్యాదిగుణంబు లుగ్గడించుచు గొలు
విచ్చియుండె నాసమయంబున. 100

సీ. చిఱుతకెంజడలఁ గీల్చినజాతిపటికంబు గళమున రుద్రాక్షకంఠమాల
యుపరంజిపసిఁడికామాక్షులుడామూఁపుపై గొండ్లిఁగావించుయోగపట్టె
చిన్నారికంబె గ్రుచ్చినశింగినాదంబు గుత్తంపుజిక్కులకుట్లబుత్తి
కరమునఁ జెనుచొఱగరిముల్లు మాయూరబర్హనిర్మితమైనబవరిసురటి
తే. భసితభస్త్రిక పులితోలుపచ్చడంబు, నాగబెత్తము దంతపుయోగవాగ
లమరఁ జెట్టువడిగినట్టు లవనినాథుఁ, జేరనేతెంచె నొకమహాసిద్ధుఁ డపుడు. 101

క. ఏతెంచినఁ గాంచి ధరి, త్రీతలనాథుఁడు హృదంకురితనిర్ణిద్ర
ప్రీతి నెదురేఁగి నతుఁడై, యాతిథ్య మొనర్చి యమ్మహాయోగీంద్రున్. 102

క. వినయమునఁ దెచ్చి కనకా, సనమున నిడి రాజుపలికె సదయా మీచా
పనిభూములు వానం దడి, యునివారలు గలరె మిమ్ము నడిగెద నొకటిన్. 103

క. రాజకుమారులలో రతి, రాజకుమారుల సురూపనసవిక్రమల
క్ష్మీజయములమించినవాఁ, డోజగదాఢ్య కలఁడె యొకఁ డట్లున్నన్. 104

క ఆసర్వజ్ఞున కపర, వ్యాసా కులగోత్రజాత యగునీసుత ను
ల్లాసగుణవసతి నిచ్చెద, నాసత్కీర్తిం దెలుపుమువిన నతఁ డిట్లనియెన్. 105

క. ఇలఁగలరాజకుమారుల, దెలివిపడం దిరిగిచూచితిని బాటలఫూ

ర్మిలయుండు జయసేనుండనం, గలండాతండు నీకుమారికకుం దగుం గూర్పఁగన్. 106

క. ఆత్రైలోక్యశ్లోకిత, గాత్రుం బ్రశంసింపనేల కనుంగొను మనుచుం
జిత్రరస మానహిల్లం, జిత్రించి మునీంద్రుం డధిపుచేతికి నిచ్చెన్. 107

వ. ఇచ్చినం బుచ్చుకొని యచ్చిత్రరూపంబుఁ జూచి యచ్చెరువంది యమ్మనోహరాకారంబు తనయునకుం దనయుకుం గానంజేసి యజ్ఞసేనుండు దనకు మేనల్లుండు గావున సదృశసంబంధంబున కలరుచు 108

క. జనపతి మునిపతిఁ బూజా, వినుతి నతిక్రియలఁ బల్లవింపఁజేసి ప్రియం
బున వీడుకొలిపి తానుం, జనియెం గొలువు విరిసి రత్నసదనంబునకున్. 109

ఆ. అట్లు రాజపుత్రి యాచిత్రరూపంబు, గన్నుదనియఁ జూచి కంతదగ్ధ
మోహసింధుపతితయై హార మాహార, మాళిజనవిహార మురుచిపుట్టి. 110

వ. చింతించుచుండ నెచ్చెలు లారామంబునకుం గొని చని. 111

సీ. కలకంఠి కతిశయోత్కలికావిలాసంబుఁ దార్పదే యారామధామకేళి
లీల నేతత్ప్రియాళికి నమందానందసంహారిఁ బుట్టింపవే లతలు విరులు
వికసిల్లునీపద్మినికి సదామోదంబు జరుపదే కాసారసారవిహృతి
శిఖిబర్హాతులితకైశికకు సంతాపంబుఁ బాపదే ఘనకదంబకకులంబు

తే. సతలెనుగదమ్మ లావుకాంచనకలాప, పరిచయము మానెనమ్మ దేహపరవునంత
వాడెనుగదమ్మ మాతోడ నాడదమ్మ, కొమ్మ మ్రాన్పాటు కెట్లోర్చుకొనఁగవచ్చు.

వ. అని నెచ్చెలు లచ్చెలి నాలోకించి సుముఖిగాఁ జేయువారయి శిలీముఖప్రముఖంబులం జూపి యిట్లనిరి 113

చ. కరటులుపొంగునం గడపుఁగాంచుము బల్లవసంగమంబున
న్నిరుగుఁ గుజాతమైత్రి నెడత్రెవ్వక శీధువుఁ గ్రోలు మాలలం
దనసినమండు మ్రోఁత తఱుచాత్మభవైకసుపర్వభర్మముం
గుఱుచయొనర్చు నెట్లుపొసఁగుం జెలి దీని ప్రియాళిగాఁ గొనన్. 114

చ. కలగుణము ల్దృఢీజించి పలుగాకులవంటి వనంగవచ్చునే
ఫలదళపారణ ల్వినయపాటవము ల్మతిప్రాప్తకాలభా
షల సుమహత్తరత్వోలిమి స్పొఁగనున్కి దగుం ద్రుగంగదీ
ప్తులు వెలిగాఁ దపస్వికులు వోకలకంఠులు మాకుఁ జూడఁగన్. 115

మ. మురిపంబుల్ గలమిండతేటికడియంబుల్ మారుతోత్థభ్రమిం
దిరుగం భాసురకేసరేక్షుకణికాధిష్ఠానకించిద్వికా
స్వరపుంగ్రొవ్విరిజోళ్ళఁ జైత్రపారనించం జంచరీకాలకా

కురిసెం బుష్పరసైత్యవంబు చిగురాకుం గొప్పెర ల్నిండగన్. 116

చ. సరసులలో సువర్ణపరిషక్తములై కనుపట్టుకోశముల్
గర మనురక్తిచూచి మృదులస్వర మొట్టిపడ న్నభాషితో
త్కరము విధాత కెక్కుడగుగౌరవ మొప్పఁ బఠించుఁ జూచితే
హరిణవిలోచనా పరమహంసవతంసము లూర్జితస్థితిన్. 117

మ. గమకంపుంబసనేలకై దిగినశాఖల్ హస్తపాద్వభ్రమ
భ్రమఁ బుట్టింప లతాంతబిందుకులముల్ పైదేర నుద్యద్ద్విప
త్స్వమధూళీమదధారలూర నళిపంక్తుల్ గప్ప నుద్యానపా
నమహిం గానఁగనయ్యెఁ జూచితివె పున్నాగంబు బింబాధరా. 118

ఉ. ఉన్నతి నంబరం బొరసి యొచ్చె మొకింత యులేక కొమ్మలం
గన్నులపండువై బవరిగా వరుదెంచిన ప్రాసవాసవో
త్పన్నరుఖురం బగ ద్దెలుప న్గులపాలికయొప్పె జూడు మా
సన్నబలైకపత్రకవిశాలము సాల మఖండమూలమున్. 119

చ. చదువులమేలులేదొ శుకసంతతిగానొ వినీతరీతి చా
లదొ భజియించునీచతురుల న్మతిమాటకువచ్చునిచ్చలుం
బదివదిగా నొనర్చుఫలభంగము నెమ్మొగ మెఱ్ఱజేయున
ల్లదె పరికింపుచిల్కహృదయంబున గోపముజిల్కఁ దొయ్యలీ. 120

చ. సరళగభీరశబ్దఘనసారసమృద్ధిఁ బ్రసిద్ధిగన్నయా
సరసులఁగూడి చారుగతి సద్వ్రతతు ల్భజియింప బాదవి
స్ఫురణఘటింపుచుం నొడుసుపుట్టక యుజ్జ్వలధారచే నుదా
హరణము జేయుచున్నకవి నారసిచూడు మరాళగామినీ. 121

క. నిరుపమఘనరసపుష్టి, స్ఫురణం బాదములు మెఱయ భూభువనమునన్
సరిజెప్పఁగలదె యిందిం, దిరకుంతల యీవసంతతిలకంబునకున్. 122

క. విరిశొఱవులఁ బథికపశం, పర జూడుంజూడు మిట్టిపరువపలాశో
త్కరమునకు నెట్లుగలిగెం, ధరణీసురదండవిధిసుధామధుగోష్ఠి. 123

చ. గళితఫలాశఁ బూజకలికాచ్ఛలనంబున విస్ఫులింగము
ల్చిలుకుచు మత్తకోకిలవిశృంఖలఘోషమిషంబుచేత గ
ర్జిలుచు ధరాపరాగముల రేఁచి వడి న్నడిగొంచువచ్చెడిం
బెలుచ మనోజమాంత్రికుఁడు పెంచినగాలిపిశాచిఁ జూచితే. 124

ఉ. వేవెడఁగేల ఢీలుపడ వ్రేసినఁ దైఁబడ పక్షిశేఖరుని
స్త్రీవన మాచరించినపడిం జరణంబున దన్నిన న్రహీ౯
బోవనిపార్థివస్ఫురణఁ బొందియు నుత్కళికా ప్తినొందు హే
లావతి యిట్టినీచతరులం బరికించితె యిప్పుహావనిక౯. 125

సీ. నెలఁత నీపలుకులో నిదికర్ణకారంబు వనిత నీనగ వెఱింగినది పొన్న
మెలఁత నీకనుసన్న నలరుబొట్టుగముద్దుపాలఁతి నీచేసంజ్ఞఁ బొదలుమావి
ముగుద నీసమ్ముఖంబున గ్రాలుసంపెంగ రామ నీహృదయపారగము క్రోవి
పడఁతి నీపదమాసపడునశోకము వినఁ బ్రియపడునీపాటఁ బ్రేంకణంబు
తే. అతిశయుప్మత్పదగ్రహాశ్రితము పొగడ, యువిదవావిలియలరునీయుగురుకలిమి
బంధుమధ్యమ మివ్వనాభ్యంతరంబు, విద్రుమాధరకన్నిచ్చ విశ్రమింపు. 126

సీ. ఘనసుమనఃకులంబున నెట్లుపుట్టెనో యొరులచేరువ నున్ననుడుకుఁ జూపు
బహుపత్త్రభరణసౌభాగ్య మెట్లందెనో యుగ్రగంధస్ఫూర్తి నుల్లసిల్లు
నిరవధికామోదభరిత మెట్లయ్యెనో మహిబుణ్యతరులకొమ్మలఁ బెనంగు
సతతాభివృద్ధి రాజసమిట్లుగల్గెనో కఠినకంటకమైత్రిఁ గడపుఁ బ్రొద్దు
తే. ననుచు బెకుచూరపోలె జెల్లాట మెసఁగ, వనమునుసుమాపచయకౌతుకాప్తి నడరి
సంపెఁగలమల్లికాగుళుచ్ఛములఁ బొన్న, విరులమతిగేదఁగుల రెమ్మెలఁదులంత.

ఉ. కోరొయిలనోరుసోఁకనిచిగుళ్లు నికారపుఁజిల్క భిన్నము
ల్సేయనిపండ్లు కాలవడి లేవడితెమ్మెరకూనరాశిగా
వ్రేయనికమ్మపుప్పొడి ప్రవృద్ధపిపాసమదాళిపుత్త్రకం
బోయనితేనియ ల్గమిచి పూవిలుకానిభజింప నంగనల్. 128

సీ. కలకంఠముల నోరికడిదివ్వవలె నంచుఁ జికిలిగుబ్బెతలు గోసిరి చిగుళ్లు
చిలుకమూఁకలకూడు చెలుతమా యని పువ్వుబోండ్లు మాఁగినపండ్లు పుచ్చుకొనిరి
యెదుటుదుమ్మెదలఁ బస్తునుతమా యని ముద్దుకొమరాండ్రు విరితేనె కొల్లఁగొనిరి
మదటగాలి పయూళి మానమా యని కుమారికలు పుప్పొడు లావరించుకొనిరి
తే. అతనువిలు మూలవేయింతమని సుధార, సాధగలు తావిపూవుల నపహరించి
రంత నాక్రీడ భూక్రీడ నలసి యలసి, తాంబుజాక్షులు కంకేళిహాళి వ్రాలి. 129

సీ. మామాటనలరుతమ్ములతావు లగలింప గనుసన్న మనుర్ఘుపకముల నలపఁ
జూడనాసవమైత్రిఁ జొక్కనయళిరేఁప నరగుత్రికగుసంకు వలటఁ బెట్టఁ
గైవసం బగుబిసాగ్రముల నుస్మాలింప మాటను లోనైనమునువు లొలుకఁ
జనుమానమంచినజక్కవలనురేఁప దండఁ బొయనికుముదములఁ జెండఁ
తే. జరణముల నాక్రమించినపన్నరాళ, నీడజములపరోభూతి నేలఁగలప

నెత్తుకొని రెంతనిర్దయు లీలఁదాఁగు, లనఁగఁ గంకేళికాంతఁ గాలాఁగ కరిగి. 130

ఉ. చేరువఁ గాంచి రక్కలికిచేడియ లవ్వనపాలిఁ గేళికా
సారము దుంగభృంగకులఝుంకృతిఝాంకృతిసంగమంగళా
గారము గుంజపుంజబిసఖండనచండమరాళలోలవాః
పూరము దారకోరకితపుండ్రగపూగకుటీరతీరమున్. 131

చ. కని బిసదండపత్త్రపుటికాపరిపూర్ణసువర్ణకర్ణికా
కనకఘటీస్ఫుటీభవదఖండసహస్రదళాతపత్త్రముల్
దినపకరోష్మఁ దీర్ప నిరుదిక్కులఁ బత్త్రము లాశ్రయింప ని
ల్చినయలరాజహంసపటలిం గని సమ్మదవార్ధిఁ దేలుచున్. 132

చ. వడిఁ బుటమెత్తి వ్రాలునిడువాలువచాలుపులింతనంతపై
నిడువెలిగుంచెలం దెలుప నీదరగాడ్పులఁ గ్రిందుమీఁదుగాఁ
బడుజలజచ్ఛదంబులు శుభవ్యజనక్రియఁ జేయ రాజకై
వడి గనుపట్టునంబురుహవాసముఁ జూచి ముదాప్తి నొందుచున్. 133

ఉ. చుట్టినమాఖ్యమాలికలచొక్కపుఁదావులు సోఁడుముట్టఁ జూ
పట్టునిరల్పకంకణవిధ ల్నయనోత్సవ మాచరింపఁగా
మట్టపుటూర్ముల న్నెఱయ మంజుసరోరుహరాగపూగముల్
పట్టపురాణిరీతిఁ గనుపట్టుసరోరమఁ జూచి యుబ్బుచున్. 134

ఉ. పొంగ నఖండతుండరవము ల్జవముల్ ఘనపక్షనిర్భరా
సంగమువం బహుప్రసవజాకలరేణువు లంటిరాఁ బరి
ష్వంగితసాధుశీధుమదసంపద నింపొదవించుతుంగసా
రంగములం గనుంగొని మృగాక్షులు సమ్మదవార్ధిఁ దేలుచున్. 135

చ. సరసమృణాళనాళతనుసంభృతము న్వికచచ్ఛదస్ఫుటో
ద్ధరణము కేసరప్రసరదంష్ట్రము ఝుంకృతిభాగలీనభూ
త్కరణమిషంబునై సొగసు గాడ్పులదూలుచు మాగుతుండిక
ద్విరసనభంగి నొప్పునరవిందముఁ గన్గొని సోలియాడుచున్. 136

ఉ. జాతకుతూహలాప్తిఁ దమచక్కఁదనంబులఁ గాంచి యద్భుత
ప్రీతిరసంబు లుట్టిపడ బెద్దల నొదలయూఁచు లోకవి
ఖ్యాతసరోరమాలలనకమ్మల మించినక్రౌంచమండలీ
భీతిఁ దలుక్కున న్నెలుకుబేడసలం గని క్రేళ్లు దాఁటుచున్. 137

చ. సిరిగలవోటులన్నియును జేకొని బంధురధారసత్త్రసం
వరణబలంబు నిత్యమయి వర్తిల దారుణమైనవిక్రమం

బురుభవనంబులం బొదల నున్నమహామధుపుంగలంబి దు
స్తర మగునచ్యుతాతిశయచక్రము గన్గొని సంభ్రమింపుచున్. 138

చ. మిళితగరుత్కలాపముల మించుకుమారశిలీముఖాళిసోఁ
కుల నిజహృత్పుటుల్ విరిసి కోమలపత్రవిశాలలోచనాం
చలముల నీరుగప్ప మతిజాబిలిరాకకుఁ గాక మోహినీ
కళ దుళకించుపద్మినులఁ గన్గొని గంధగుణంబు నొందుచున్. 139

చ. తనభువనప్రశస్తబలదర్పమునం జననీక నిచ్చలుం
దనివిసనం బహుద్విజపతంసములం దినుచు న్నిరంకుశ
ధ్వనిఁ బ్రకటైకచక్రసవిధస్థలిఁ గ్రాలుబకు న్మహత్తరు
ల్డను శిరసావహింపఁ దగులావరిఁ గన్గొని తెల్వినొందుచున్. 140

ఉ. బారులుగొన్ననీరకణపంక్తులు క్రొచ్చవిరచ్చ దెల్ప నిం
డారినకేసరంబులు శుభాక్షతరేఖఘటింప సారకా
సారవధూటిసాంగజవసంతున కీనమరించు పచ్చరా
యారతిపళ్ళెరంబుల క్రియం దగుతామరపాకుఁ జూచుచున్. 141

వ. కదియుంజని ప్రహృష్టచక్రంబు గావున రాజహంసోపలాలితంబయి సిద్ధసంతాన
వేష్టితంబు గావున మత్స్యకూర్మకుక్కుటాద్యాసనభాసమానంబయి విడంబితశంబ
రారంభంబు గావున నాక్రాంతపాఠీనాంకంబయి కుముదప్రకాశోదయంబు గావున
నావిష్కృతపుష్కరంబయి యలరుచుండుట కలరుబోండ్లు. 142

క. ఒసపరినడకలు మృదుసా, రసవిసరవిజేత లగుకరంబులు గంధో
ల్లసనము లొమ్ములు నమరఁగఁ, గుసుమాస్త్రునిమదపుబేసుఁగులగతిఁ జెలువల్. 143

వ. కాసారంబు ప్రవేశించి. 144

మ. పొగడం జొచ్చినభంగి రత్నవలయంబుల్ మ్రోయఁ జేయెత్తి కెం
జిగురుం గొమ్మనపై చె నొర్తు నొకరాజీవాస్య యవ్వాటునం
బగులం గంచుకముబ్బి చన్నుఁగవ చూపట్టె న్సుఖాగ్రంబులం
దగ నండంబులు వ్రచ్చి వెల్వడునరిద్వంద్వంబుచందంబునన్. 145

ఉ. పూని ఘటాత్కృతు ల్దొరయ బుజ్జటఁ గొమ్మన నీరు నించి యా
రా నెఱజాణ నా నొకధరాకటి యొండొకబోటిపై వె నె
మ్మే నదరంటఁ దాఁకి నెటిమించినఁ బయ్యెదప్రయ్య నంత న
మ్మానిని యొప్పె పేరొఱఁ దెమల్చినపూవిలుకానివాలనన్. 146

చ. మరువిరితూపురూపుపసమాపు నొయూరపుఁజూపు గూరెలం
దిరువులుగట్టి విభ్రమవతీమణియొర్తుక యన్నుగన్నులం

దోరలజలంబుఁ జల్లె నది దోయిటవక్త్రముఁ గప్పె రోహిణీ
చిరవిరహార్తి నొందినశశిం జిగురాకులఁ దార్చుచాడ్పునన్. 147

ఉ. చేనొకబోటి కెంజివురుఁ జిమ్మనగ్రోవియొనర్చి తమ్మిపూఁ
దేనియఁ బీల్చి సోగవిరిదండఁగ నొండొకకొమ్మ జిమ్మనె
మ్మే ననుకైన నమ్మెలఁత మించె జగంబులు గెల్చి కాంతిర
ఖానియతి స్మరుండు గడుగం గడుఁ గ్రాలు మెఱుంగువాలనన్. 148

చ. పొలఁతుక యొర్త్తు గెంజివురు బుట్టట కొమ్మన స్రుక్కు నొక్క సె
చ్చెలి చలివీడివైవ నది చిత్రజుఁ డెడ్డెఱఁ జూచి వైచుకే
వలకరవాలసంహతుల వైఖరి గానఁబడంగ దానికే
వలకరవాలసంహతులవంచి వికావికనవ్వెఁ గ్రొవ్వునన్. 149

చ. విరహులమారుమారుఘనవీరబలం బని పాంథకంధర
ల్దఱుగురమారుమారు నడిదాలనిరాగవియోగజాతకా
తరగుణదాత్త్రుమన్మథపతాకనితేంట్ల నదల్చి కమ్మదా
మరలఁ గదల్చి వారిచరమండలిసొంపు వదల్చి రంగనల్. 150

చ. గతి యతివేలరాగకరి గానెటిగాంచినవాలువాలముల్
ప్రతిరహితాంఘ్రులం బెనఁగఁ బైపస ముగ్దులుగుల్కు సమ్మద
స్థితి మితిమీఱఁ గొమ్ములనుజేతులు పుష్కరలక్ష్మిదెల్పఁగా
హితసరసిం జయించి రలయింతులు కంతునిదంతులో యనన్. 151

ఉ. కొమ్ములతోడిహస్తములు గుత్తపుముద్దెలముద్దుగుల్కు పాం
దమ్ములనంగవృత్తిజఘనద్వయసాంబులనిల్వ రేఁగి పైఁ
దుమ్మెదలాడఁ జూడ నవదోహదధూమమిళల్లతావితా
నమ్ములజాడఁ గుందరదన ల్గన నైరి మనోహరాకృతిన్. 152

ఆ. ప్రపవభాగ్యమహిమఁ బ్రబలియు నెటువంటి, మునిమియో యెఱుంగ విసువులేక
తారసించి ముద్దుతమ్ములఁ జివురాకు, బోండ్లు కొలనుసొచ్చి పుచ్చుకొనిరి. 153

క. నాళీకజైత్రనేత్రలు, హాళిం గేళీసరోవిహారశ్రీలం
దేలి కటీఘటితపటీ, జాలములు కలాపవేషసంగతు లమరన్. 154

ఉ. మందమరుత్కిశోరహతి మవ్వపుఁ దేనెలజాలువారుపూ
బందిలి క్రిందఁ గప్పురపుఁ బల్కుల దిద్దినగద్దె నిందిరా
నందనునిల్పి నృత్తజఘన ప్రతిపన్నితభారతిం బదా
రిందమునం ఘటించి కదళీదళగర్భలతాంతసంతతుల్. 155

క. కరములఁ గైకొని చెలువ, ల్మరుజాపగుణీకృతభ్రమరుఁ బ్రతివినతా
మరుకైత్రార్పితమణిచా, మరు నారాధించి రప్రమత్తప్రజ్ఞన్. 156

క. ఆరాధ్యాద్యుమణిప్రభు, నారాధనవిధులఁ దనిపి యతిశయవర్షా
ధారాధరవేణుల మధు, ధారాధరభణితి వినయతాయుత లగుచున్ 157

సీ. తలయేఱు పట్టించె నెలదాల్పునకు భవత్క్రాంతనిష్క్రాంతహుంకారరవము
వికటిలత్రోటికోటికి దెచ్చె భారతీకాంత దావకభయంకరశరంబు
ముష్కనిర్ఛేదనంబున సాధుజేసె నీవైరంబు మఱిదివ్యవృషవతంసుఁ
గన్నచాయకుఁ బోయెఁగాని నీనెఱదాడిఁ జేరఁడు గ్రహరాజశేఖరుండు
తే. నీప్రతాపాగ్ని దపియించి నీరజారి, సంశ్రయించె సురాచార్యశరణభూమి
సదృశులెవ్వరు నీకు ముజ్జగములందు, శంబరామరవిమతహింసారిరంస 158

సీ. వివిధాగమాంతప్రవేశచాతురి నెన్నదగుశుకాదులు వినీతతఘటింప
మహీసురాప్తిసుహృత్తమహిమ గాంచినయుత్తమాళులు హితవృత్తి ననుసరింప
ఘనదానవేగరాగముల మీఱినజగత్ప్రాణుండు నీమనోరథము గడప
నాశువాగ్గ్రహణమేధాశక్తి మాధవాదృతి భజించినమహాద్విజాలు గొలువ
తే. కువలయప్రీతికాముఁడై నెవఁడు రాజు, గాఢరూఢప్రసన్నతఁ గాంచి తిరుగ
సాధుబుద్ధివి గావైతి శంబరారి, వేమునకు బోయుపాలయ్యె వృద్ధసేవ. 159

ఉ. పూతమరందబృందకరము ల్కరము ల్ప్రతిపర్వసంధిసం
జాతమధూద్ధతంబు విలుసారసమీరకుమారవారణో
ద్ధూతసుజాతిచూతరసతుందిల మార రమాకుమార నీ
చేతిగుణంబుమాన వెదచేతిగుణం బిటులయ్యె నక్కటా. 160

సీ. ఆర్తివహించు నీయస్త్రపీఠమునకు నిలుపుగన్నులనీక నివ్వటిల్లె
నతిముక్త మగుతాపకాయుధంబున కహో దొరకె జండాలురతోడిమైత్రి
ప్రంతఁబాయని భవద్ధ్వజవాశ్చరమునకుఁ గలిగెఁ బేరలుఁగులఁ బొలిసి పోవ
బుట్టుగుడ్డైన నీబూమెరతేజికిఁ దగిలె మహావినీతప్రతీతి
తే. యకట జాతికిఁ బాసిన యనుఁగుఁ జెలికి, నెసఁగె మఱివేళవేళ మానిసితనంబు
నొడలుమాపిన నీకయ్యె నుగ్రకృత్య, మంగభవనిందితులకు మేలావహిలునె. 161

మ. అమదప్రక్రియ మూఁడుగాళ్ళజరతుం డైయున్నతంద్రిం ద్రివి
క్రముని దమ్ములఁ జేరి తత్ప్రబలపత్రచ్ఛాయ వర్తించునా
దిమసాధ్వి న్రమఁ జేర రమ్మనక యుద్వృత్తి న్విజృంభింతు నీ
తిమనీషాదయలాభ మెట్లు జనికర్తృద్రోహియౌ వానికిన్. 162

ఉ. అల్లనఁ గాచి మిత్త్రగృహ మారటఁబెట్టుసఖుండు నీతిపెం
పొల్లఁడు మంత్రిమానులకునొప్పమిఁ జేయురథంబు నీవునుం
బల్లవధర్మ మూఁది రతిపైఁ దమివర్తిలు దట్టినీకు ను
త్ఫుల్లదయానయాదిగుణము ల్జనియించునె శంబరాంతకా. 163

వ. అని యనంగు ననంగనారత్నంబులు దూఱి తన్మాతులుండగునీరజారిం జేరుకొని 164

ఉ. నీదయ పంచబాణశరనిర్భరతాపదవాగ్ని గ్రాఁగి పో
నీదయ నీదయోదయసమృద్ధి సదా వెదచల్లుచుండుఁ దా
నీదయ సేదఁ దేర దొకయింత యిదెక్కడివింత నేఁడు నీ
పాదములాన మావికచపంకజనేత్రకు సారసాంతకా. 165

ఉ. కాలగతిం ద్వదీయజనికర్త్రప్రతిక్షపము న్గరాళకో
త్తాలకృపీటజన్మపరితశ్శిఖలం గడు గ్రాఁగునాతనిన్
బోలి కళంకివై మొదలఁబుట్టినవానికి నీకు శైత్య మే
వేళ జనించు విత్తొకటివిత్తినఁ జెట్టొకటౌనె జాబిలీ. 166

చ. పరుషమహాకృపీటభవభావము నీయెడసత్య మత్తెఱం
గరయక నిన్ను శీతకరుఁడందు రటేని సుజాతశీతల
స్ఫురణ పయోధికిం గలదె పొంగుకళంకముపేరఁ గ్రొంబొగ
ల్గురియదె మింటనాలికలు గ్రోయదె లోలకశాచ్ఛలంబునన్. 167

చ. పరిధిమిషంబునం గుడుసుపడ్డశరాసముఁ బూని శైత్యవి
స్ఫురణమెఱుంగులీను ఘృణిభూరిశరంబుల వేఁడిగా రహిన్
విరహిజనాళినొంచెదవు వేఱుమనోభవుఁడేల నీవయున్
సరసతలేదనంతపదసంశ్రయ మేమయిపోయె జాబిలీ. 168

ఉ. గోత్రులు రాకపోక నినుఁ గోల్కొనినీరు దురంతశీతరు
క్షైత్రిదృఢాంబరాశ్రయము మానవు నిన్నవిరోధయు నీకళా
మాత్రవిభూతి నిట్టియిడుమంబడితో హరిణాంక వారిరు
ట్పత్త్రసుగంధలం గిరణపాతనశాతనరీతి నొంతురే. 169

ఉ. కందళితానురాగములు గావు మనంబులు విన్నయంతలో
నందఱు పారవశ్యపదమందురు చల్లఁదనం బొకింతలే
దిందున శంకరాభరణ మెట్లయితీవు శశాంక నీపదం
బుం దుది నంతశూన్యమగుఁ బో వివరింపఁగ మాటలేటికిన్. 170

చ. సదవనవైభవంబు పరచక్రవధోద్యతనంబు నిస్తులా
భ్యుదయ మనూనదానవిధియు న్సఖులబ్ధపటుప్రసాదసం

పదబలవత్తమోదళనపాండితియుం దగురాజవైన నీ
కదయత కామినీజనులయుం ముదయించుట పాడియే శశీ. 171

మ. కృతదక్షాపకృతి న్మహామఖుఁ గళంకి న్సోదరీసుందర
ప్రతిపక్షు న్రజనీచరుం గురుకళత్రప్రాప్తభూయఃకళా
పతను న్నిన్నిరసావహించెఁ ద్రిపురప్రత్యర్థి సర్వజ్ఞు లా
శ్రితదోషస్మృతివిస్మృతివ్రతులు గారె రోహిణీవల్లభా. 172

ఉ. మేదిని నర్జునస్ఫురణ మించి చరించుట సింధుచక్రర
క్షాదృతి నీకనంతతిలకాంతమువో హరిణాంకకృష్ణప
క్షోదయము న్గురూపకృతియుక్ ఝషకేతువిరోధివిగ్రహా
హ్లాదము లేదదేమి చెప్పుమా వెఱఁగయ్యెడు నీకు నక్కటా. 173

వ. అని హాలాహలవిరోధి శిరోధిగృహమేధి యగు నవ్వనజవిరోధిం బలికి చెలికిఁ దాపో
పశాంతిఁ గానక వరారోహలు గంధవాహు నుద్దేశించి. 174

సీ. కాండభృద్ఘనబాధ గాసినొందినమిత్రు నోమవే సుఖవృత్తి నుల్లసిల్ల
మోచివచ్చినకార్యములచోట నొసఁగవే కుసుమబాణునకు నెక్కుడుధనంబు
చెలిమిఁ బక్షీకరించినమహాశిఖికిఁ జేరుపవె లావరిసమారోహణంబు
మొదలనిన్ను సహస్రముఖములఁ గొనియాడుచక్రి కీవె నితాంతసత్త్వగరిమ
తే. నీవిహారంబు దాక్షిణ్యనిర్భరంబు, నిను సదాగతిగాఁ జూచునిఖిలలోక
మోజగత్ప్రాణ నీవంటియుత్తమునకు, నర్హమే పాంథయోషానిబర్హణంబు. 175

మ. సలిలాహారులు గణ్యపుణ్యతరులం జంద్రాస్యలం గాక నీ
బల ముత్కృష్టబలాధినాథులఁ దరల్పంజాలునే నిన్నుఁ గే
వలముం దైవము దెచ్చి మూలఁబడవైవ న్మించునీలావు లం
కలపాలై చన నీభవంబు దునియల్ గా కృష్ణవర్త్మప్రియా. 176

చ. గరళగళప్రసాదమునఁ గన్నసుతుక్ హరివంటివానిఁ గే
సరిసతి కీవె తజ్జరగజజ్వలనైకశిఖాప్రశాంతికై
పరుషగతి న్మహామునులఁ బల్లటఁబెట్టవె యట్టినీకు నో
కరువలి మేఘవేణికల గాసియొనర్చుట ధాత్రిఁ జిత్రమే. 177

ఉ. కొమ్మలచోట నీకుఁ బ్రతికూలతపుట్టుటయెంత చొక్కపుం
దమ్ముల సాధుమత్సరమునం దలఁకింతువు నిచ్చలుం బరా
గమ్ములరేఁతు వేమఱవు కాలుపదం బిటువంటినిన్నుఁ దా
నమ్మకచెల్ల సర్వభువనాసువుగాఁ దలపోయఁబోలునే. 178

వ. అని సమీరుదూఱు నవసరంబున నలరాత్రి. 179

క. స్మరమృగయా విశిఖబాధా, పరవశయయి యున్నదానిఁ బద్మిని గాఢ
త్వరఁ బరుషరీతి రుచిమ,త్కిరణ నఖాగ్రములఁ జంద్రకేసరి నొంచెన్. 180

క. యువతికిఁ బ్రాణంబయ్యెం, బవతుగతిం బ్రోదిసేసె మలయక్షితిభృ
త్పవమానుఁడు దూరితరై, పవమానుఁడు మోహదావపావకశిఖలన్. 181

వ. ఇట్లు మారతారేశకుమారసమీరబాధావిధురయై యమ్మధురభాషిణి శోషిల్లుచుల్లం
బున నొల్లంబోయి నెచ్చెలులఁ గలయ నాలోకించి. 182

సీ. కనలుచుక్కలరాజుకంటెఁ బుట్టినదేమి గాడ్పు పేరమువాఁడుఁ గాకయేమి
కంతుఁ డాకృతిఁ బెంచుఁ గాకయేమి కుజాతకలితుఁడై మధువుండుఁ గాకయేమి
హంస మాపగవారికై పోవుఁ గాకేమి గండుఁదుమ్మెద మ్రోయుఁ గాకయేమి
చిలుకవాదులకు వచ్చినవచ్చుఁ గాకేమి కలకంఠి గలహించుఁ గాకయేమి
తే. కమ్మవిగురాకుచే మించుఁ గాకయేమి, కలిక లంతంత మొనఁజూపుఁ గాకయేమి
వెలుపు నాకేల వెన్నెల వెల్లిద్రెళ్ళి, ప్రాణసఖులార వలవంతఁ బాయుదాన. 183

క. అని మోముదమ్మి వాడ, న్మనసిజశిఖిమండ సకలమర్మస్థలముల్
దనువూటాడం గన్నియ, పెనుదెగువ న్గుబ్బతిలిన భీతిలి రతివల్. 184

క. కామాస్త్రములకు నాళీ, గ్రామణి వైషమ్య మొదవుఁ గాకెప్పటికిన్
సోమకుమారీమణి యీ,కౌముది దానెట్లసౌమ్యగా నేర్చునొకో. 185

వ. అని జననాథకన్య నాలోకించి. 186

సీ. దరహాసలేశధిక్కరణ మున్నదియె నీవంక వెన్నెలకేల వహ్నిఁ గురియఁ
గినిసి మాటలు నేరవనుచు శిక్షించితే చిలుక కేటికి వహ్నివళి యొనర్పఁ
బ్రతిపక్షియని తిరస్కృతిఁ జేసితే సాధుపికమునకేల వాబిఱుసుఁ జూపఁ
జూడఁ బోలని చూపుఁ జూచితే చంచరీకమునకు నేల ఛిద్రములు వెదక
తే. గోచరింపక యొకమూలఁ గూలి చనక, మందతవహింప కిట్లు త్రిమ్మరఁగ నేటి
కని యుదాసీనుఁ జేసితో యభ్రవేణి, యనిలశిశు వేల వీచివాలయ్యె నిపుడు 187

సీ. మనసుగన్న రమాకుమారికాసుతునకుఁ బూర్వాశ్రితుం డైనపూర్ణశశికి
జీవమువంటి దక్షిణసమీరమునకుఁ జేరైనకుసుమాస్త్రబృందమునకుఁ
బలుకుమారనిముద్దుచిలుకకు నెయ్యంపుఁ బైకమై దీపించుఁ బరభృతాళి
కతులాళియయిన గయ్యాళి తేఁటికిబెట్టు పెట్టైనలేఁ బ్రోదిచిగురుమావి
తే. కకట భయమందవలసె హా యనఁగవలసె, బెగడుపడి యుండవలసె గంపింపవలసె
నాతురతఁ గూరవలసె బిట్టులయవలసె, జలదరింపఁగవలసె వే జడియవలసె. 188

ఉ. చేరువమావికెంజివురుచేతికి లోనుగదమ్మ పద్మకాం
తారమరాళిమానసము నమ్మినదిం తెగదమ్మ కంతుబ

ల్వారుపమైనచిల్క మిగులాతగులాయమెఱుంగునమ్మ నీ
పైరుగదమ్మ మల్లికలు పల్లటమందఁగనేల వానికిన్. 189

ఉ. దారుణభంగిఁ జేర్చినతాపదవజ్వలనోష్మమంటికం
టీరవమధ్యతాంతదశ నీతను వెల్లసహించినం దగుం
గైరవసోదరస్ఫురణఁ గాంచిన నీనిడువాలుగన్నులే
లారజనిం గుఝ్ఝనికళానిధిరాకకుఁ దల్లడిల్లెడిన్. 190

క. అకటా యని చింతింపుము, లికుచకుచ చిల్కలను సంబళింపక శుకముం
బికము న్మలయానిలశా, బకము న్మదిఁ దలఁచి వినయపాటవ మమరన్. 191

ఉ. మాటకు రాదు ప్రోదిశుకమా యొకమారు జయింపరానికై
లాటముచేసె చేటికిఁ బ్రాపికమా యిఁక మాను బోటి నీ
సాటిరె ప్రాణమయ్యె వడచల్లఁగురే యిట్టులైనజోటి యె
వ్వాటికిఁ బోవు నీచలువ చూపవనా పవనాఘునాద్యతిన్. 192

క. అనిపలికి కలికిచెలువలు, మనసిజతాపాతపోష్మమందద్యుతియై
తనరుపధూతనువల్లిక, ఘనశీతపరీతిఁ దేర్పఁగాఁ దగు ననుచున్. 193

చ. చెలువల కిస్లమూలములు శిరము లుజ్జ్వలదంపనుత్పలా
దళములు వెన్నెలంబులు సదామృదులాకృతి మంచివారిలో
మెలఁగుమృణాళముల్ గరము మెచ్చొదవించుమధూళి మాటలో
పలియని యన్నిటం జెలికిఁ బంచశిలీముఖతాప మారదే. 194

వ. అని శీతలోపచారంబు లాచరించిన. 195

సీ. నునుమావిచిగురుపానుపు మహోత్తను శస్త్రశయ్యగాఁ దలఁచుఁ గంజాతనయన
కడిపోనివిరులకంకటి గణించునభూతకంటకాస్తరణంబుగా మృగాక్షి
వలపుగుంపుమపువ్వుతలిను మంగథివాగ్నిశిఖగా విచారించుసింహమధ్య
శిరముక్రపుఁబల్కు సెజ్జ సొక్కపుఁగాముశరముగా వగచుయోషాలలామ

తే. మంచిపడమటిపన్నీరు మకరకేతు, విషముగా బుద్ధి నూహించువిద్రుమోష్ఠి
తావిపుష్పాడి శంబరాంతకుపరాగ, మని వితర్కించులలన మోహైకకలన. 196

వ. ఇట్లు మనోభవమోహదాహంబునం బొక్కి పొరలుచున్నకన్నియ నెచ్చెలులు నికేత
నంబునకు మరలఁ దోడ్కొనివచ్చిరంతఁ గొంతకాల మరిగిన నొక్కనాఁ డేకాంతం
బున విద్యామంటపంబుననుండి చదువుఁజెప్పుచు దదీయసౌందర్యవయోవిలాసంబు
లీక్షించి మన్మథాతురుండై మందుండు భువనమోహిని కిట్లనియె. 197

చ. నిరవధికత్వరం బఱచి నీచనుగొండలసంధి డెందపుం
దెరువరిమారచోరనిహతిం బడి మోహవిదాహవేదనన్

బాలెడుఁ దేర్పఁ బుణ్య మిదిపో యధరామృత మిచ్చి యిందునం
దరసినఁ గల్గునే పరహితాచరణప్రతిమానధర్మముల్. 198

క. నవలా తావకమోహా, ర్ణవ మేమిటఁ గడతు దుస్తరము వివరింపన్
భవదీయస్తనకుంభ, ప్లవ మబ్బినఁ గాక యీ విపత్సమయమునన్. 199

క. అనిద్రాసుఖితంబులు, గానేరవు లోచనములు కంతద్వయసం
బై నీలావణ్యరసం, బో నవలా త్రేన్పు వెడలకుండుటవలనన్. 200

క. హారవిలాసము గలని, న్నారసి చీకాకుపడుప కతనుఁడు ముక్తా
హారవిశేషము గలన, న్నీరసమున గానిసేయు టీ వెఱుఁగవోకో. 201

క. గాఁడరుచి స్రుచిరం బనఁ, గూడదు నీయధరము ధరసుచచింపై కా
మ్రేడితము కానిచో నే, లా డాపునఁ జూచువారలకు నోరూరున్. 202

క. ఇన్నియును జెప్ప నేటికిఁ, బన్నినమరుగాసి వాసిఁ బాసితి నోరా
కన్నియ యన్నియు మెఱయం, గన్నెఱికపుభితు నాకుఁ గరుణింపఁగదే. 203

క. అని దీనాననుఁడై మో, డ్చినకరములతోడఁ బ్రియముఁ జేకొ మ్మనుచుం
దనుఁ బ్రార్థించు ధరాసురుఁ, గనుఁగొని రాజన్యకన్యకామణి పలికెన్. 2 4

క. గురుఁ డనఁగఁ దండ్రి యఘసం, హరణగుణా శిష్యురాల నైనప్పుడె కూఁ
తుర మేర దప్పి కామా, తురబుద్ధిం గోర్కి సేయుదుర నావోటన్. 205

మ. నరకద్వారకవాటభేది యవమానప్రాప్తిమూలంబు దుః
ఖరుజాపథ్యము పుణ్యలోకగమనఘ్నం బస్థలత్కీర్తి సా
గరమంథాద్రి జనాపవాదహుతభుక్కాష్ఠంబు సత్కారసం
హరణోజ్జృంభము గీడుగాదె పరభామాసంగ మెవ్వానికిన్. 206

ఆ. నీతి సాధువృత్తి నీయది ధరణీసు, రుఁడవు వేదపారగుఁడవు ధర్మ
తరులతాపరశ్వథము చెల్లఁబో యిట్టి, నీచచిత్తి మెట్లు నీకుఁ గలిగె. 207

తే. ఏను రాజన్యకన్యక నితరజాతి, భామ గా నెట్లుఁ బొసఁగు నీపాపవృత్తి
భూసురుఁడవైన యిది నీకు బుద్ధిగాదు, బ్రాహ్మ్యహాని తపోహాని ప్రాణహాని. 208

వ. అని యనేకప్రకారంబుల బోధించుచున్న యన్నీలవేణికి బ్రాహ్మణుం డిట్లనియె. 209

ఆ. నీవు మాటలాడ నేర్తువు గురుఁ డేల, చెప్పకొను విరాళి శిష్యురాలిఁ
గవయరాదు ప్రాణికల్పన నేర్చిన, పలువ నలువ గూఁతుఁ బట్టికొనఁడె. 210

క. మరుబారిఁ బాతి చంద్రుఁడు, గురుభామం బ్రేమఁ బిలుచుకొని వినుతబుధుల్
పరిణతి ముని విబుధుబుధుల, గరిగమనాగమనలీలఁ గాంచుట వినవే. 211

క. గౌతమభార్య నహల్యన్, శాతోదరిఁ బదరి పన్నశాయిం గాలా
తీత మొనర్చియుఁ గూడిన, యాతని కింద్రునకు నేమియయ్యెం జెపుమా. 212

ఆ. ఇట్టిపట్టిసుద్దు లేటికి నీయంగ, సంగలాభ మైన జాలుఁ దెలుప
వెలుప మెలసి మీఁదఁబలుకెంచు నత్యుగ్ర, పాపమునకు నరకకూపమునకు. 213

చ. కడపక నీవు నాపలుకుఁ గాదని వేదనిసర్గమార్గమం
దడిగెదవేని మేనియుడియాసఁ దొలంగి లతాంగి ప్రాణముల్
విడిచెద నీవుచూడ నలవేవడిఁ బాపములోన దీనిలో
విడిదలగాక వే కలఁచి వేచెడి దెయ్యది చూచితో మ్మనన్. 214

శా. అఘోరోక్తులు వీనులం బడిన నాహా పుట్టిరాపట్టిని
ర్ఘోఘుం బీయనమాట తుచ్ఛదురితంబు ల్ధర్మకర్మక్రియా
శ్లాఘ న్మాన్చకొనంగవచ్చుఁ దుదిఁ ద్రైళ్యంబోనియాబ్రహ్మహ
త్యాఘుం జేమిటఁబాయు నాకొకయుపాయం బెద్ది యీచేఁతకున్. 215

క. కులగోత్రశీలములకు, న్వెలియైనం దగు మహోగ్రవిప్రప్రాణా
నిలవిచ్యుతి కే నొప్పం, గలదాననె యింతకంటెఁ గలుషము గలదే. 216

క. అనుచితకార్యము లేమే, నొనరించినయత్న మొప్ప నుత్తమజను లా
ర్తుని విప్రుని విధ్వస్తా, త్ముని నెప్పుడు సంతరింపుదురు మేలగుటన్. 217

ఉ. కావున నొండుపాయములుగావు మహీసురరక్షణంబ మే
లై విలసిల్లు నేమితెఱఁగైనను మంచిదె యంచు బుద్ధిలో
భావనఁజేసి యచ్చెలువ పల్కె ధరాసుర రెండుజాలలో
నీవది కేగుదెంతు సరణిం జలియింపకయుండు మిత్తటిన్. 218

వ. అని యతండు విశ్వసించినట్లుగా నందులకుఁ గొన్నిశపథంబులం బలికి యక్కలికి
నగరికరుగుచు నపరాహ్ణాగతుం డగుగగనమణి నాలోకించి కీర్తించి కరంబు లురో
జాగ్రంబులఁ గీలించి యిట్లనియె. 219

క. ఓలోకమిత్ర యొకరు, ణాలయ నీకులముదాన నవనీసుర దు
శ్శీలంబు మాన్చి యిట నా, యీలువు చెడకుండఁ బ్రోవవే నేఁ డనుచున్. 220

క. చేరఁ జనుదెంచి యులసర, సీరుహహితుఁ డబల యట్లచేయుదు చింతా
భారంబుఁ ద్రోఁచి కదలు మ, గారమునకు ననుచుఁ బలుకె గగనంబునకున్. 221

వ ఆసమయంబున. 222

చ. ఇనుఁడు పనూర్ధ్వతుం డరయ నెవ్వఁడు వానికి నీతిలేదు వీఁ
డినుఁడు పనూర్ధ్వతుండు నయమెయ్యది తప్పినినీదివారతిం
దనిసి ప్రదోషకాలమునఁ దానిదె వారుణి నానియున్నవాఁ
డని యులుకంబలె న్నరలె నా నడచెం దగ భాయప్రాచికిన్. 223

సీ. ఇవి చెందిరికచీరలవుఁగదా తిగిచియిచ్చెలఁబోసి కటులఁ గీల్కొలుపవచ్చు
నివి కుంకుమరసంబులవుఁగదా గబ్బిగుబ్బలజొకటంబుగా నలఁదవచ్చు
నివి చెంగలువసెజ్జలవుఁగదా కౌఁగిళ్లఁ బ్రియులుండ మెఱసి నిద్రింపవచ్చు
నివి చిగిర్చినమావులవుగదా కటికివేసవులనీడలఁ గ్రీడ సలుపవచ్చు
తే. నివి సరోజాతరాగంబులవుగదా బెడఁగడరుపేటికలఁ బెట్టి డాపవచ్చు
ననుచు వరుణావరోధకామినులుపలుక, నస్తగిరిఁ బ్రాఁకె జరఠారుణాతపములు 224
మ. తనచిత్తంబునఁ బద్మినిం బవలుపొంద న్వారుణీకళికిం
జనఁ బైకొన్నప్రదోషపీడకు సహించ న్నేర్చె నింకెట్లుగా
దనువో మంగలవాఁడనంచు భృగుపాతప్రీతి నేతెంచెనో
యన నేవించె సరోజబాంధవుఁడు ప్రత్యగ్భూమిభృత్కూటముల్. 225
తే. అపరపర్వతశిఖరసింహాసనమున, గొంతదడవుండె గ్రహరాజు గ్రుంకుటుడిగి
సమయురము మజ్జనంబాడి సాగరంబు, దండనుంచిన కుంకుమపిండమనఁగ. 226
శా. కరటనిషక్తఖర్జు వడఁగం జిరగర్వసమగ్రమంజన
ద్విరదము పాయుతన్మదస్మృతిం బొడుకెక్కిన యస్తసానునం
దరదముఁ జారఁ బైనడుగు లానక యుర్వికి డిగ్గు నుద్ధత
త్వర ననఁ గ్రుంకె భానుఁ డవధాననికుంచితభానుహస్తుఁడై. 227
సీ. పరిపక్వబింబవిభ్రాంతి దవ్వులరాజకీరడింభములు గ్రుక్కిళ్లు మ్రింగఁ
బ్రత్యగ్రశోణితభ్రమ నుపస్థితములై పంచాననంబుల బయులునాక
పల్లకీపల్లవచ్ఛదనశంక సగంధకరులు రిత్తకురిత్త కరము సాఁపఁ
బుంజీకృతక్రవ్యబుద్ధి నిర్ఝరవృద్ధశార్దూలములు నోళ్ళుచప్పరింప
తే. గైరికద్రవవిచికిత్స గాన నాట, పాటలోష్ఠులు పాలిండ్లఁ బ్రామఁ దివురఁ
బ్రత్యగవనీధరంబునఁ బ్రాకుదెంచె, నపుడు దివసావసానసంధ్యామరీచి. 228
తే. చరమదశఁ గన్నవాసరస్వామిఁ దలఁచి, తమ్ములామోద మతివంతిఁ దలఁకుచుండ
నస్తముపగోత్రమయ్యురాగాప్తిఁ బొదలె, మొదలఁ బాశ్చాత్యకృత్యమట్టిదయకాదె.
తే. సద్ద్విజశ్రేణి దివసావసానవేళ, చలువఁదేరు ఘనప్రదేశములఁ జేరి
కన్నులరమోడ్చి విస్పష్టగతులుమీఱి, నారవవ్యాజమున జపం బాచరించె. 230
సీ. తావులకొండనెత్తము డిగ్గి ఘెంగల్వదొనల చల్లనినీటఁ దొప్పదోఁగి
పరిగొన్నపచ్చకప్రపుదుమారము రేచి తరుణపల్లవపరంపరఁ దెరల్చి
వికసితప్రసవజాలకరేణువులవంటి గంధసంపద దేటిగములఁ బ్రోచి
బలిమి గానవపరంపరల నుజ్జటలూచి తీవపందిళ్ళలోఁ దిరిగితిరిగి
తే. యొండ పొడదూరక పగళ్లునిర్లు గవయు, తియ్యమావుల క్రేనీడఁ దెరువుసాగ

కల్లనల్లనఁ జనుదెంచె నతనుభద్ర, వారణంబన సాయంసమీరణంబు. 231

చ. సరసులసంగతిం గలుగుచక్కనితమ్ములఁ జేరఁబోయి క
న్నఱమొగిడించి వ్రాల్చుచిగురాకులడగ్గఱి పత్త్రము ల్చికా
కరదృపదోఘముల్ గదిసి కళ్కుపడం బరిముక్తవృంతకే
సరములఁ జెంది కందునొకజక్కవ దారవియోగవేదనన్. 232

సీ. నిండారుకమ్మదేనియ ఱుజ్జనంబాడి కడిమిపుప్పొడివన్నె మడుగుఁగట్టి
రేకుగన్నుల జంచరీకాంజనముఁ జేర్చి తనూవల్లి ఫేనచందనముఁ బూసి
తులలేనితూఁడుజేతుల నూర్మికలు దాల్చి జలకణమౌక్తికచ్ఛటలఁ బూని
మొగ్గపాలిండ్ల సొంపున హిమాంబువ్రునుంచి యామోదసంపద నతిశయిల్లి
తే. హంసకంబుల నిజపదం బలవరించి, భువనమోహన మైనవైభవముఁ గాంచి
కలువవిరిబోఁడి రాజురాకడ దలంచి, పొలిచె వాసకసజ్జికాస్ఫురణ నపుడు. 233

తే. ఝుంకృతివ్యాజమున హాళిసన్నుతాళి, యూఱడింపఁగఁ దనకన్నవారిలోన
ననపధిక్లాంతిమిత్త్రమోహార్తి ఖిన్న, తమ్మికొమరాలు పత్త్రనేత్త్రములు మోడ్చె.

సీ. కవలుసంధ్యార్చిఁ బేర్చిననభఃకరిమేన బుటములెత్తిననీరుబొబ్బలనఁగఁ
గాలమాంత్రికుఁ డంధకారదానవబలిక్రియకు గాల్చినపేలగింజలనఁగఁ
దాండవభ్రమిఖమూర్ధజకుఁ డంజలిపుటంబున విధిర్చినకమ్మపూవులనఁగ
మైరవసింధుసంపర్కశర్కరదేవమును లొనర్చినలింగమూర్తు లనఁగఁ
తే. గమలగర్భాండగోస్తనీకాయమాన, జటిలపరిపక్వఫలగుళుచ్ఛములనంగ
నఖిలజనలోచనోత్సవం బాచరించెఁ, దామరసవైరికులదారతారకములు 235

ఉ. స్నేహవిరక్తిఁ గాలగతిచేఁ గని మిత్త్రుఁడు చామగక్రియా
మోహితుఁ డౌటఁ గన్గొని ప్రమోదవిధిం దనుఁజేరె నీగురు
ద్రోహి శశాంకుఁ డెట్లనక దోయనిపూనినశక్రదిగ్గజ
స్తోహినిమోము విన్నఁదనమో యనఁ బాండిమదోఁచె నెయ్యెడన్. 236

సీ. బలభిద్దిశావశాప్రతిమ గామినిముద్దుగులుకుటీరికనవ్వ తెలివిచెప్పి
యుదయమస్తక్రీడ నూడికొలులు మోవఁ గూలినచౌదంతికొమ్ముఁబోలి
గగనవాహినిరొంపి గాడికొండొకదోఁచు కమలాప్తురథరథాంగంబు దొరసి
కాలకాపాలికాగ్రణికరంబున నెత్తిమాచు క్రొన్నెమలీకసురటి నొరసి
తే. యంచు గనుపట్టి మఱియుంచుకంత మిఱిసి, సగముపర్యాయకమున సాక్షాత్కరించి
బింబమంతయు వెలికి దీపింప నిలిచెఁ, జదలఁ బూర్ణకళానీమ చందమామ. 237

సీ. అది సుధాకరబింబమా కాదు మడికాసువన్నె వెలుపుటన్నవత్తిగాని
యది చంద్రమండలంబా కాదు చదలేటఁ దేలుదంతపుటరిగోలుగాని

యది నిండుచలివెలుంగా కాదు మబ్బుచేనుఁగుఁదోలుతెఱనోటిమెగము గాని
యది చకోరములవిందా కాదు దుగ్ధాబ్ధికడ జనించిన వెన్నకరుడు గాని
తే. యది నిశామిత్రమా కాదు మదవియుక్త, యువఘురట్టశిలావలయంబు గాని
యని జను లూచి కీర్తింప నతిశయిల్లెఁ, బ్రోడజాబిలికలువపూఁబోడికలిమి. 238

సీ. ఇనకరాంకురముల కెడయీని మ్రానిక్రీనీడజాడల డొంకి నిలిచెఁ గొన్ని
మధురసప్రస్నిగ్ధమాక్షీకచ్ఛత్రభాగవులలో గవులలో వడఁగెఁ గొన్ని
కల్లనైనవిఱుగెఱుంగనిపోటుపరికరాచూరుకత్తులమాటు జొచ్చెఁ గొన్ని
చేనేఁతబడి తలంచినలేదు బంతి యున్నలువకొమ్మలదాఁడెఁ బఱచెఁ గొన్ని
తే. త్రాసమునఁ బొంది పద్ధతి భ్రంశనముల, గూపకుహరాంతరంబులఁ గూడెఁ గొన్ని
యిరులు తిప్పరు లన నప్పుడేమిచెప్ప, రాజు బరచక్రహరణసంరంభుఁ జూచి 239

సీ. ప్రాయమింకినవాలుపాలింపఁ వేయాంద్రు పడుపుపుట్టక మూలఁబడి కృశింప
నేపురేగినరంకు లెండెఁగబోఁడులు వింతకాఁగిలిలేక వెతలఁబొందఁ
కడిపోని తెరనాటకపుటూరుజంగాలు కేళికల్ గూడ కోగిరము లెత్త
తడక ద్రోపరిమ్రుచ్చుపాగువులు మఱి దొంగపనిమక్కువాలైనఁబస్తుపార
తే. గంటవేఁటల దిరుగాడుక ఱకులెఱుకు, మూఁక వెఱజిక్కికాళ్ళ మోములనువావఁ
బిండిచల్లినచందానఁ జేదవారి, దివియువెన్నెల సాంద్రదీధితి వహించె. 240

సీ. చేఁపువుట్టినగభస్తికలు ముక్కులఁ గ్రుచ్చి త్రచ్చి యూరటలేక క్రోలుఁ గొన్ని
యఱ్ఱులానఁగఁ ద్రావి యసుమరుచ్ఛరణమఁ జోటుచాలక నేలఁ జాదుఁ గొన్ని
కడుసిగ్గుచేరుతొల్పడుపుదోమటఁ జొక్కి యానందమున జిందులాడుఁ గొన్ని
నిగరంపుమోవి తేనియలతోన దొరల్చి చెలువలిచ్చిన సంతసించుఁ గొన్ని
తే. యోలములడాఁగి తలచూపనోడి తల్ల,డించు నరికోటిపైఁ బుక్కిలించి యుమిసి
బయలుఁబట్టించి పేరెము లాడ్వరుఁగొన్ని, కైరవాప్తాతపములఁ జకోరకములు.241

వ. ఆసమయంబున. 242

సీ. కట్టినజినుగుసిరాకవిధోవతి పింజయా పార్శ్ర్విలంబియై యతిశయిల్ల
ధాతోత్తరీయవస్త్రములోను శుభ్రశుభ్రంబులై బ్రహ్మసూత్రములు మెఱయఁ
గనకవీరుద్గ్రింధికలు కపోవాలావాలసీమబచ్చనిడాలు చివురువెట్ట
నామోదరసపుష్టి నచ్ఛిద్రమై ఫాలతలమున గోపిచందనము గ్రాల
తే. నవటుతటఖేలనంబున నమరుబిళ్ల, సికచోకాటంబువిరులతోఁ జెలిమిసేయ
నడుమ జగజంపుదోఁపుఁబచ్చడము దనర, వైదికబ్రాహ్మణుఁడు నిండువన్నె మెఱసి.
తే. క్రముకభంగపరంపరాకలితమయిన, వన్నెటికతిత్తిమేఖలావల్లి నిఱికి

యాకు లక్షించి యలబలం బడఁగు టరసి, యునికివెలువడి బ్రాహ్మణుం డొక్కరుండు.

ఉ. అప్పు డధిజ్యచాపధరుఁడై మరుఁ డేర్పడి వెంటనంటి రాఁ
జొప్పున జాలిమాలి యఘుహూరుఁడు పాఱుఁడు వచ్చివచ్చి యా
యొప్పులకుప్పరామికి నయో విధియం చుదితాశ్రుధారలుం
గప్పఁగ మోమునిశ్వసనకంపితచారుతరాధరోష్ఠుఁడై. 245

క. చెదరెడిమేనును జెక్కున, గదిసినకెంగేలు గ్రాలఁగా విప్రుఁడు లే
నిదురెఱుఁగనికంటంబడి, వడియగుమరుమంట మంటపంబున నుండెన్. 246

ఆ. చీమ చిటుకుమన్నఁ జిమ్మెట బుఱ్ఱన్న, నెదురమూషకములు మెదలుకొనిన
నిదురలేక భూమి నిర్జరుం డాలించు, నప్పు డబలకాలిచప్పు డనుచు. 247

క. రాదా యొఁ జూచితే యను, రాదా యడ్డంకిబట్టి రాదను నిర్మ
ర్యాదలు నీమంతినులను, హా దైవము ప్రొద్దుపోయె నని తలయూఁచున్. 248

క. ఎదురుకొన నరిగి చాయకు, గదలుతలాపులకు వెఱచి క్రమ్మరు నేన
మ్మదవతికి నేలదాదులు, పొదివికొన న్నిదురపోయెఁ బొమ్మని పలుకున్. 249

వ. ఇట్లు మోహానలంబున దేహంబు విదాహింప నయ్యుర్వీగీర్వాణుండు చలితవియో
గిప్రాణుం డగుపంచబాణుం దలంచి. 250

మ. ద్విజరాజాం దలదాల్చుకొన్నతనిదృగ్వహ్నిప్రభూతాగ్నులన్
రజమై పోయిననిన్ను నీతిరసదూరా మార యాకేవల
ద్విజరాజల్గిన నేమిసేయునొ ప్రశాంతిం గాంతి మత్సాయక
ప్రజముం గూర్పకు నారి నారి నను గూర్పం దేర్పఁ బుణ్యంబగున్. 251

చ. శివగణనాయకా యనిన శీఘ్రమె కార్యము లడ్డపాటులే
కవు యదునాథపంచవిశిఖా యన హస్తపదాస్థికాండముల్
చివికెడుపట్టినొప్పు లోడిసె ల్రసపొక్కులు గంట్లు బిబ్బపుం
డ్లవు నిటువంటిపుత్రుఁ దగవా కన నమ్మధుకైటభారికిన్. 252

వ. అని పనివి పనివి యనంగబాణమూర్ఛితుండుం బోలె నమ్మంగుండు నిద్రాముద్రా
లోచనుం డయ్యె నయ్యవసరంబున. 253

క. అనిశ ధరణీసురవరుఁ, దా నిచ్చినమాటపట్టు దలఁచి తదీయ
స్థానీయపాలవీక్షా, ధీనాకృతిగాక నగ రతిత్వర వెడలెన్. 254

క. జలధరమాలికలోపలి, తొలుకార్మెఱుఁగనఁగ యమువిధుంతుదహాలా
హాలకాచ మేచకద్యుతి, గలనీలాంబరము ముసుఁగు గాఁ గైకొనుచున్. 255

క. పరివృత్తికంధరయై తిరి, ఒరయుచు నడ దడపడంగ నరుదెంచి ధరా
సురు నిద్రపోయెదే యని, కరసంజ్ఞం దెలుప మేలుకని వాఁ డంతన్. 256

వ. ఆదిత్యచోదితుండై క్రోధించి. 257

శా. ఆర్యా నేఁడిట కేఁగుదెంతువని నీ కాశించి యిచ్చోట న
న్నయ్యంజాలక నిద్ర గాచి యిపు డేమో కూరికృతి స్నాత్మజా
లయ్యె న్నాలవజాముఁ జొచ్చె దడవాయె న్వచ్చి విచ్చేయునీ
సయ్యాటం బిఁకఁ జాలు రోసితి ననుష్ఠానార్థినై పోయెదన్. 258

చ. కడువడి రెండుజాము లగుగం బరిరంభణ మీఁదఁ బంచి నీ
కడ కరుదెంతు రానిపని గల్గిన నాఁటికిఁ దండ్రిఁ గాశిలోఁ
బొడిచిన క్రూరకర్మునఁ బోవుదు నంటివి సూనృతంబు నీ
కొడుకయిపోయె రాక కిదిగో గురులింపఁ జిరాత్రిపాపముల్. 259

క. కడుసరసములకుఁ బ్రొద్దై, కృడిది దురంతోపగూహగతులకుఁ బ్రొద్దై
కృడిది యొకసెలవు సేసితె, కడజామున వచ్చి చాల్చో కాలుకుబుద్ధిన్. 260

ఆ. కొదవలేక రతుల గోవాపుఁ గోడెనై, పొదలఁ బెద్దతడవు ప్రొద్దులేదు
నోరసి తెడ్డు నాఁకి యుపవాసకర్మంబు, చెలుముకొనఁగ దీనిచేత నేమి 261

క. అని చిందరేఁగిన ట్లచ్చెనఁటిధరాసురుఁడు చెంతఁ జేపడినవిధి
న్మని గాలఁ దన్ని చనుగతి, ఘనజఘనం బాసి యుబ్బగాఁడుగఁ బోయెన్. 262

క. చనఁ దనకు మనసువచ్చిన, పనిమది గా గునికిఁ దీసఁ బట్టక చనుఁ గా
కని యూరకుండె నట్లుం, డి నరాధిపకన్య దనహృదెందములోనన్ 263

క. సరిప్రొద్దున నరుదెంచితి, నరుణోదయసమయ మెట్టులయ్యె మురంత
స్మరమాయాంధుఁడు గావున, నరరే విప్రుండు తుర్యయామం బనియెన్ 264

క. కామాంధోపి నపశ్యతి, నా మును నే విన్నదాననకదా వెఱఁగే
లా మందునిమాటలకని, యాముద్దుగుమ్మ మందహాసముఁ దాల్చెన్. 265

క. నానీరచరాగ్రణి బహుమానమున కిట్లనియె న ట్లు మహీసురుఁ డన్య
స్థానస్థుఁ డయినపిమ్మట, నానెలఁతుక యేమిసేసె ననఁ గపి పలికెన్. 266

క. మహీసురుఁ డట్లరిగిన న మ్మహీశారత్నంబు తోడసుమాలితి నని దు
స్సహాదయమున భయమున నిజ, గృహమునకుం బోవఁ దత్తరింపఁగ నంతన్. 267

చ. ఘనదసమృద్ధి నీలికడపంబలె నంబరమొప్పఁ జంచలల్
మినమినలీన దోన నుతిమె న్వడి గండులు వ్రాలె వ్రాలెఁ దొ
ల్చినుకును దూర్పుఁ టీదరొలసెం బలసెం జడివానసోనజో
రనఁ బురవిద్విషద్గళసహస్రభవాకృతిఁ బర్వెఁ జీఁకటుల్. 268

క. ఇది రాయిరప్ప పల్లం, బిది మిట్టిది మాకుమట్ట యిది పామిది గా
మిది యని వివరింపఁగఁ బె, ట్టిదమై యొప్పెసఁగు నక్కటికిఁ జీఁకటిలోన్. 269

చ. సుడివడి యింటిత్రోవ యరయుచుం బెఱచొప్పునఁ బోయిపోయి యా
ప్పుడఁతి దృషద్వతీసరిదుపాంతదురంతవనాంతరంబులం
బడి ములుదీవలుం దవిలి భంగములై కురులుం దుకూలముం
దొడిగినకంచుకం బెడలఁ దొట్టినభీతి నొడల్వడంకఁగాన్. 270

క. ఈఱము లూఱట నొందక, దూఱుచు నో రలయ నలువ మాఱుచు రొంపిం
జాఱుచు నెంతేవెలవెలఁ, బాఱుచు రాజన్యకన్య పఱచి యంతన్. 271

శా. ఆయుగ్రాటవి నొక్కచోట భయదంబై తోఁచుమఱత్త్రోవట
చ్ఛాయం బీనుఁగుఁ ద్రొక్కి కోమలకరాబ్జాతంబునం బట్టి యు
ద్యోగ్యో యీమానవుఁ డెవ్వఁడొక్కొ మృతికేమో హేతు వంచు న్విచా
రాయత్తం బగునాత్మఁ బోఁ దెరువులే కచ్చోటఁ దా నున్నెడన్. 272

క. ఆవటమునఁ ద్రింశద్వ, ర్షావధిగా నున్నభూసురాసురుఁడు విశా
లావరపుత్త్రికి హితసం, భావన సాక్షాత్కరించి పలికెం బ్రీతిన్. 273

క. మనుజులు మెట్టాడని యీ, ఘనగహనంబున నిశీథకాలమునం జ
చ్చినవరుచక్కటి తెక్కటిఁ, దనుమధ్యా సంచరించెదవు నిశ్శంకన్. 274

తే. ముంచు కన్నీరు మంచున మోముదమ్మి, వాడియున్నది దీర్ఘనిశ్వాసనిహతిఁ
దల్లడిల్లెడు నధరోష్ఠపల్లవంబు, ఇంతపలనంత నవ్వ నీ వెవ్వ రనుచు. 275

క. అనుమానింపక తనువృ, త్తినువినర వపారసప్రదానవిధాన
స్వనమున్ముకంబు వదనం, బున ద్రిప్పపలాశి కిందుముఖి యిట్లనియెన్. 276

క. వినయవిశాల విశాలా, వనిపాలునిపుత్త్రి దైవవశమున నస్మ
జ్జననీజనకుల జనకుల, వినతులపా త్త్రైడసి యాటవికసతి యయితిన్. 277

శా. ఏ నిర్సేరుట యెట్టు లీపడినవాఁ డెవ్వాఁడు వక్షాతమః
పానఃపున్యముఁ దెల్పునల్పచపలాప్రత్యర్థులాలోకముల్
మేనభ్రంలిహ ముగ్రమృత్యుముఖగంభీరంబునో రెవ్వర
య్యా నిన్నూచిన గుండె ఝల్లురనుఁ దథ్యం బానతీవే యనన్. 278

మ. అతఁ డత్యంతితము ప్రసన్నహృదయుండై పల్కె నే వంచిత
శ్రుతిసంపన్నుఁడ బ్రహ్మరాక్షసుఁడ నిచ్చోఁ గాపురం బుండుదున్
మతి భీతిల్లకు నీకు నొజ్జ లితఁడమ్మా నీకు నేకారి యీ
క్షితిజచ్ఛాయమనోజబాణహతి నొచ్చె న్నాట లింకేటికిన్. 279

క. గురుఁడ నిది శిష్యురా, లీతరుణీమణి గవయ దుష్కృతం బని మదిలో
నరసి యెఱుంగని యీదృశ, నరపశువుల మేలుపొందు నా యెందైనన్. 280

క. సూరిశ్రేష్ఠునకు ఐరా, చారగరిష్ఠునకు నీకు సద్విప్రా యీ
ఘోరనిశాచరవేషం, బేరూపునఁ గలిగె ననిన నెఱిఁగింతుఁ జెలీ. 281

సీ. మొదల గౌళాంబి నుండుదు వేదశాస్త్రార్థచతురుండ నాపేరు చండశర్మ
కులకాంత శాంత యచ్చెలువతమ్ముఁడు మూలఘుటకాంకుఁడతఁడొక్క కన్యఁ బెండ్లి
గాఁబోవుటయు గోడిగములకు నేనును బనిబూని యటువాని ననుసరించి
యతిసభ్యునట్లు పోయితిఁ బోవ నను బెండ్లిపెద్దగాఁ దలఁచి యాబిడ్డతండ్రి
తే. కదిసి యల్లునిగుణరూపగౌరవములు, వేఁడుటయు నావివేకంబు వీటిఁబోవ
నవగుణంబులప్రోవు మూఢాత్ముఁ డంటి, ననిన నమ్మాట లతఁడు సత్యములఁజేసి. 282

క. కౌశాళంబున నిచ్చిన, కూఁతు నతం డీక వెడలఁగొట్టిన నపుడా
చేఁతకు నాహృదయం బుడ్డూతలఁ బ్రేంఖోళనప్రయోజన మానెన్. 283

క. మఱఁది యని యుబుసుపోకల, నెఱుఁగక యిట్లాడి లోకు లెగ్గింపం దెం
పరినై కూడినపెండిలిఁ, జెఱిచితి నాకన్యఁ గష్టశీలుఁడు గలఁడే. 284

క. ఈయుగ్రాఘం బేమిటఁ, బాయు నయో హృత్ప్రతీపపరితాపశిఖిం
గాయము వేఁగెడునని ఐల,చేయి కపోలమునఁ జేర్చి చింతిలుచుంటిన్. 285

చ. అగణితధర్మకర్మరతుఁ డంచట ము న్నరుదెంచియున్నవాఁ
డగుట మనుగ్రకృత్య మపు డారసి ముద్గలనామతైర్థికుం
డగలక నన్నుఁజూచి కుటిలాత్మ కళత్రసహోదరు న్మహా
సుగుణధురీణుఁగానిమనుజుండని యూరక పల్కఁబోలు నే. 286

ఆ. వేయుబొంకి పెండ్లిసేయుదు రుత్తమ, జను లతిప్రయాసమునకు నోర్చి
చెనఁటిసేఁత నిట్లు మనువులఁ జెఱిచిన, విసపువిత్తుఁ జెప్ప వినముగాని. 287

ఉ. మోఘముగాక నీవు తలమోచియొనర్చినయట్టియిద్దురం
తౌఘము నేఁడు పిల్లకొలయై చరణంబులఁ బ్రాఁకుసజ్జన
శ్లాఘనయోగ్యభూమిసురజన్మము వీడ్కొని కానలోగ్రశా
ఖాఘునవృత్తపత్తిపయి క్రాలునిశాచరవేష మేర్పడన్. 288

ఉ. పంకరకట్టెకింగలము వైద్యము నీకిది వోలునంచు ని
శ్శంకనవృత్తి ముద్గలుఁడు శాపము నిచ్చిన శోకబాష్పభా
రాంకితనేత్రపంకజుఁడనై చరణంబుల వ్రాలి రోఁదయా
లంకృతచిత్త యోబుధకళానిధి యోగుణధుర్య కావవే. 289

చ. అనుఁగుమఱంది గానఁ బరిహాసపురస్సరభాషలాడ నీ
పనిజనియించె నీచరణపంకరుహంబులు సాక్షిగా, ముది

గనలు వహించి యిట్టికోలగాని ప్రయోజన మాచరింప నీ
యనుపమదివ్యదృష్టి కొకఁ దక్షమె చూడుము తేర్పనేరముల్. 290

క. అని యేను మేను వడఁక, న్వనితాజనతార్తిఁ బొగల వారించి ప్రబో
ధనిరీక్షణములసర్వముఁ, గనుఁగొని యితఁ డనపరాధిగా యని శాంతిన్. 291

వ. ముద్గలుండు న న్నాలోకించి యిట్లనియె. 292

చ. కలుషముఁ బూని పెండ్లిపనికిం బ్రతికూలుఁడ వైతి విట్లు మొ
క్కల మిదిగాదె నీవు సకల్మష మానటులైనఁ గేరడం
బుల కిది చోటె మోఘమయిపోవదు నావచనంబు గన్నచా
యల నిఁక బ్రహ్మరాక్షసుఁడవై యిల నీవు చరింపుచుండఁగన్. 293

ఉ. అల్లినవంతమూలఘటకాంకుఁడు భూమినిలింపకన్యకా
హల్లకభల్లభగ్నహృదయస్థలుఁడై తను వుజ్జగించి మ
త్పల్లిన నుద్భవించుజయసేనుఁడు నా నలవిప్రకన్య యు
త్ఫుల్లసరోజనేత్రి ప్రియపుత్రిక యై పొడము న్సుకీర్తికిన్. 294

ఉ. ఆయెలనాగ దైవగతి నర్థనిశం గతిదప్పి నీతరు
చ్ఛాయకు వచ్చు నా సరసిజచ్ఛదనేత్రకు నవ్వసుంధరా
నాయకసూతికిం దగులొనర్పుము సంశయమేది యంతలోఁ
బాయుమహీసురాసురత బ్రహ్మపదంబు భజింతు పిమ్మటన్. 295

మ. అని శాపావధిఁ జెప్పి ముద్గలుఁడు పోవం బోవ నాలోన నె
త్తిని గ్రుడ్లుం గులిశంబులుం దెగడుకోల్వాడబన్నాఖర్జితా
ననముం జాంజారువెంద్రుకల్బఉదకర్ణద్వంద్వముం గల్గి మే
దినికి న్వ్రేగుగ బ్రహ్మరాక్షసుఁడ నైతిం జంచరీకాలకా. 296

వ. అట్లుర్వీపూర్వగీర్వాణుండనై సకలప్రాణిభక్షణంబునఁ గాక్షుంభర్యంబు ప్రవర్తిల్ల
నివ్వటపి నాశ్రయించి యుండితి నిప్పటికి ముప్పదిసంవత్సరంబులు గడచె నమ్ముద్గ
లుండు చెప్పినట్లు నామరంది జయసేనుండై పుట్టె నవ్విప్రకన్యకవు నీవు నిన్నన్నర
నాథకుమారునకుం బరిణయంబు సేసి యాసురం బగు నివ్వేషం బపనయించెద
ననుటయు నలరుమొగంబున రాజన్యకన్య భూసురాసురున కిట్లనియె 297

క. ఇచ్చోట నానిమిత్తము, వచ్చిన యవ్విప్ర సుప్రసన్నత్వము నేఁ
డచ్చుపడ మనిచి పురికిం, బుచ్చి జగద్వినుతకీర్తిఁ బొగడొందఁగదే. 298

క. భూసురహత్యాఘమహో, త్రాసమునకు వెఱతునని పదంబులఁ బడి గా
ఢాసక్తిం బ్రార్థించిన, నాసురకులశాత్రవుఁడు దయాభిముఖుండై. 299

ఉ. ఆవిరతిప్రబోధదీక్ష కృప కద్భుతమంది భవన్నియోగ మే
లావృథయౌ ఫలింపక బలాయబలా యని విప్రుఁ గొంచు ర
క్షోవిభుఁ డేగి పీనుఁగున సుప్రదతీర్థమునం దొరల్చి సం
జీవితుఁ జేసి మందిరముఁ జేర్చి భజించి కుమారి కిట్లనున్. 300

క. చనిపోయిన నీయొజ్జలు, మనుగడఁ గనిరొ న్వసించె మందిరమున నో
తనుమధ్యా ముగిడించిన, కనుఁగవతో నిలువు రాజుకడ నినుఁ జేర్తున్. 301

చ. పలుకు విలంబ మన్నఁ బ్రతివాక్యము లాడక మోడ్పుకంటితో
నిలిచిన బ్రహ్మరాక్షసుఁడు నిర్భరవేగధురాధురీణుఁడై
పొలఁతుక నప్డు డెత్తుకొనిపోయె మనోజవుఁ డొట నిల్పెఁ బా
టలనగరోపకంఠనిబిడద్రుమకాంచనసౌధవీథికన్. 302

వ. ఆసమయంబున. 303

శా. కొండు ల్వ్రీడ్కొని పక్కణాంతరకుటీకూటాధ్వసంధు ల్వరా
స్కందు ల్చూడ నపక్రచక్రములు ముచ్చట్లాడ నిచ్చోటిన్
గ్రిందు ల్మీఁదులుగా సతీపతులు కౌఁగిల్చూడ దీప్తద్దిశ
ల్పొందుల్ గూడఁ ద్రిభంగిభంగి మెఱసెం బుంస్కుక్కుటవ్రాతముల్. 304

చ. అతికృతికన్య నందినమురారివిరాజదనంతభోగసం
స్థితి ప్రతివారముం బొదల శిష్యులు పుణ్యజను ల్జయక్రియో
న్నతులు దురంతశాస్త్రకలనం బ్రతివాదుల నోర్వ సర్వతో
గతమతికుండు నిల్చెఁ గవికౌశికదిక్కటకాగ్రపీఠికన్. 305

చ. పరవసులక్ష్మి నుల్లసిలువారికి నేమిగొఅంత యీవిభా
కరునకు సంజనిచ్చి తిరుగంబడి లక్ష్మి హరింప నెట్టిదో
నెరవులసొమ్ము సత్యమగు నే యని వెల్వెలనయ్యె నహ్ని నాఁ
బరిగళితద్యుతి న్వెలఁ బాఱె నిశాంతనిశాంతదీపముల్. 306

చ. కనుఁగొని చైత్యనిత్యపథికప్రవిబోధకరంబులై ఖగ
స్వనము లుదగ్రబాహ్యవనవాటికల న్వినవయ్యె నయ్యెడన్
ఘనమదభృత్తమఃకరటికంపితదిగ్విటపస్ఫురన్నభో
వనరుహసంక్షరత్కుసుమవర్షము చాడ్పున జాఱెఁ జుక్కలున్. 307

సీ. ధారాధరస్మయోదయవియచ్చికురబంధమునఁ దారాలతాంతములు రాలె
రోదసీతనుసమారోహాంగకార్ష్ణమదవిలేపనరేఖ మసలిపోయెఁ
జక్రవాకస్తనస్థాతృనీహారఘుర్మాంబువు ప్రత్యక్షమై యుడింగె
మధుపకజ్జలభాసమానకైరవలోచనముల నిద్రాముద్ర సనలువెట్టె

తే. మలయనిలయసుగంధసంబంధమంద, పవననిశ్వాసవీచిక ల్బారుదీరె
సంప్రభూతకళారమ్యసౌమ్యగమ్య, గంగసంగశ్రమాయామయామవతికి. 308

చ. తగఁ గుసుమాస్త్రకేళి దిగఁదన్నినచీరలు గౌఁగిలింతలుం
బగఁగొని యడ్డగింపఁగఁ దెమల్చినహారములు న్భరంబునన్
దిగిచినసొమ్ములు న్మదవతీతిలకంబులచేత వేఁడుప
న్మగుడ సపర్యఁ గైకొనిరి మాన్యులు గారె గుణప్రదీపకుల్. 309

చ కవిసి కవుంగిలింప నవకాశము చాలక ప్రొద్దుఁజూచి లోఁ
జివికెడువారు హస్తములజీవితనాథుల గ్రుచ్చిపట్టి వే
గవరులమోవులాని యరగన్నిడువారును శయ్యలం బరా
భవ మొనరింపలేక పగపాల్పడువారును నైరి జవ్వనుల్. 310

శా. నానాదీపమరీచికల్ గొనియెనో నాఁ జూడ నిద్రాపరం
చీనస్త్రీనయనంబులం బ్రియదృఢాశ్లేషప్రకుబ్జీభవ
న్పీనాక్షీకుచము ల్దిగం గనికరామ్రేడీకృతోత్క్రాంతికాం
తానుష్ఠాధరము ల్జపాసుషమ చెన్నారె న్నిశాంతంబునన్. 311

మ. తులనప్రేమరసోల్లసన్మిథునచేతోజాతసంగ్రామకాం
క్షలవారించె నుషఃప్రసూచకగతుల్ శాలాజరద్దీపికా
కళికల్ శైత్యదృఢస్తనస్తబకముక్తాహారము ల్వాసనల్
గలయం జల్లెడుపూఁత లిష్టరుచికృత్కర్పూరతాంబూలముల్. 312

సీ. శ్రమవార్నిమజ్జనజటిలాలకంబులు సంధూతకుంకుమస్థాసకములు
జాగరారుణితలోచనసరోజంబులు కాంతచుంబనముక్తకజ్జలములు
కరచపేటనిరస్తకరినక్రచిత్రంబు లభినవదిగలంకృతాధరములు
సృణినమత్కరికాభరణభృద్గళంబు లనూననిద్రాముద్రితాననములు

తే. గాఢపరిరంభసంభ్రమక్లామ్యదచల, గుచపయోధరభరహారకువలమణులు
కలితతాంబూలరసరక్తగల్లతలము, లమరఁ గొమరాండ్రు పొలిచి రహార్ముఖమున.

శా. ఆశాఖడ్గమిళత్తమోమలినహృత్యర్థంబు నిర్వంశ్యసం
ధ్యాశిల్పిప్రభుకల్ప్యమానకురువిందక్షోదసమ్మిశ్రలా
క్షాశాణం బనఁ బ్రాచిదోఁచె బిసినీకాంతుండు జాగ్రత్పురో
దేశాంగారకరాజినాఁగ మొదలం దీండ్రించె సంధ్యాప్రభల్. 314

సీ. ప్రసవితద్యుక్షేత్రఘుసృణసస్యంబులు హల్లకప్రియసాలపల్లవములు
తిమిరేంధనప్రవర్ధితదావశిఖ లుషఃపవనభుగ్వ్యాళభోగఫలకమణులు

హరిపురంధ్రీకుసుంభాంబరంబులు ఘనప్రాక్పరివ్రాడ్జటారక్తిమములు
దంభోళిఖండితోదయపక్షరుధిరంబులై రావణాంగసింధూరరజము

తే. పత్త్రివృత్తిప్రమోదకృద్వ్యోమసీమ, యోగదవధూమ్యధాళిఖిన్నోడుగమణి
వన్యహల్లకతల్పము ల్మాఁ జెలంగె, నంబరంబున నపుడు బాలాతపములు. 315

ఉ. ఇమ్ములఁ బశ్చిమాంబునిధి కేగునెడం దగ వారక న్యయా
ఖమ్ముల నెన్నికంచితముగా నొనరించినవ్రేశ్వరక్తిఁగోఁ
క్రమ్మఁగఁ బ్రాక్పవిత్పృద్ధరవిరశ్ములఁ బద్మిని వేగుపాటునం
క్రమ్మఱ లెక్కఁబెట్టె ననఁగా వికసించె సహస్రపత్రముల్. 316

ఉ. గాసిలి రాజు మన్ననలు గాంచిన నే నొరుఁ జూడ నంచు న
న్నాసినభంగిఁ గైరవిణి మోడ్చెఁ బతివ్రతవోలెఁ బద్మినీ
వాసరకృద్వియోగదహనోష్మసముత్థితధూమరాజులో
నాసరసీజగర్భసదనంబులఁ బాసి నటించె భృంగముల్. 317

తే. ఇట్లు సూర్యోదయంబైన నేకతమున, బ్రహ్మరాక్షసుఁ డద్ధరాపాలుఁ గదిసి
పూర్వవృత్తాంతమంతయుఁ బొసఁగఁ జెప్పి, యబ్జముఖిఁ జూపి పెండ్లిగమ్మనుచు నిచ్చె.

వ. ఇచ్చిన. 319

క. ఆరామామణిఁ గైకొని, యారాజునుఁ డాదరార్పితాతిథ్యుండై
యారామన్యగ్రోధధ, రారుహసౌధమున బ్రహ్మరాక్షసు నునిచెన్. 320

క. ఉనిచి ప్రణమిల్లి క్రమ్మఱి, చని యవ్విప్రాసురవను సరసాన్ననివే
దనవిధికిఁ బుణ్యభూసుర, జనుల నియోగించె జనితసౌహార్దమునన్. 321

ఉ. కూరిమి తండ్రిపాదములకుం బ్రణమిల్లి సుకీర్తికన్య నం
భోరుహలోచన న్భువనమోహినిఁ జూపి తదామయు న్నిశా
చారుచరిత్ర మేరుపడ సర్వముఁ జెప్పినఁ బుత్రు మెచ్చి యు
ర్వీరమణుండు బంధుపృథివీవరులం బిలిపించి యిట్లనెన్. 322

సీ. ఘనులార మనకు రక్తస్పర్శసంబంధి గాఁడె సుకీర్తి విఖ్యాతమూర్తి
దైవయోగమున నాతనిపుత్త్రిఁ గాంచనప్రతిమానగాత్రి చేపడియె మనకు
మనజయసేనకుమారున కాపూర్ణశీతాంశుముఖిఁ బెండ్లిసేయవలయు
లాలన నవ్విశాలానాథుఁ డిచటికి వచ్చినఁ జుట్టంపువరుస గాదె

తే. యతుల నయమార్గరతుల దండాధిపతుల, ననిచి రప్పింత మా యమ్మహామహుంబు
నతఁడు వీక్షించుఁ గాక న్నాప్తమిత్రు, లుచితమిక్కార్య మొనరింప నొప్పుననిరి.

క. నావిని మత్నిల్లుఁడు హా, లావీక్షితనీతిశంత్రుల న్మంత్రుల సం
భావించి పనుచుటయు న,ప్పావనమతు లరిగి వినయపాటవ మమరన్. 324

సీ. రోహిణీవిరహాభీరుతఁ బొరఁబడబింబ మన ఘనగ్లానదీనాస్య మమర
నాడునిండారి వెల్వడినశోకరసంబులీరున వేఁడికన్నీరు దొరఁగ
మెఱుఁగుటద్దపుబిళ్ళమీఁదికెంపులతెరక్రియ గపోలమునఁ గెంగేలు మెఱయ
నతిమరుచ్ఛలమానలతభంగి నిశ్వాసధారచంద్రిక మోవి దల్లడిల్లఁ
తే. దనయు నీలోన లేదుగదా ధరిత్రి, చూపురూ యంచు బ్రార్థించునపోలుగమున
దగ శిరముఁ వంచి తనలోన దానపలుకు, నునుజపతిఁ గాంచి ప్రణమిల్లిమంత్రివరులు.
క. నతులై వినయవిచారో, న్నతులై నిలుచుటయు వదననలినముఁ దరం
గితదృష్టిఁ చంచలీక, ప్రతతులు నటియింప ధరణిపాలుం డనియెన్. 326
క. అరుదెంచితి రెవ్వరు మీ, రనుదారం జెప్పుఁ డనిన నలికతటాంత
స్ఫురదంజలిపుటులై యు, న్నరనాథుం జూచి దండనాథవరేంద్రుల్. 327
మ. క్షితినాథోత్తమ నేఁడు నీమఱఁది మత్స్యేశుండు పుత్త్రేర వ
చ్చితి నాలింపు తదీయభాషితము లస్త్రీయ ప్రతర్హ్వాణ
క్రతుభుగ్వైరిసంతతసయోగమున నీగారాము నెచ్చెలి యొం
డితరక్షోణికిఁ బోకచేర మును నీ వీక్షించి పోరాఁ దగున్. 328
క. అని దేవరతో విన్నప, మొనరింపం బంపె విక్రమోపేతపతా
కినితో సంబంధిపురం, బున కరుదెం డనిన భూవిభుఁడు సుముఖుండై. 329
వ. అమ్మంత్రులకుఁ బసదనంబులిచ్చి యంతఃపురంబున కరిగి యింతికి నంతయుందెలిపి
విన్నయాదిప్రొద్దునగా సభార్యుండై చతురంగబలంబులు గొలువ వచ్చి సుకీర్తి ము
ఖ్యాహ్నకాలంబునకు బాటలీపురోపకంఠంబు గదిసె నప్పుడు. 330
ఉ. ఇంకనితీవి బాన తనయింటికి వచ్చినఁ జంద్రసేనుఁ డ
భ్రంకషసమ్మదాభ్యుదయభాసురుఁడై యెదురేఁగుదెంచి ప
ల్యంకిక నున్నయప్పచరణాబ్జములం బడి కాంతకాంతిను
త్పంకజరాగపూగకృతధామకవీథికిఁ దెచ్చె దెచ్చినన్. 331
ఉ. ముందఱ నేగి యబ్బుబన మోహిని వాహినిపోలె నుబ్బుపం
తం దలచుట్టు కన్దోగల దట్టముగాఁ బ్రవహించున శ్రువా
రిం దులితేతర స్తనశరీరములం దిగుపారఁ జేయుచున్
వందన మాచరించి విరివాతెరతో ముగమెత్తి కేడ్చినన్. 333
సీ. కడుపులోఁ జేపెట్టి కలఁచిన ట్లగుటయు భక్తిఁ గూరిమిపట్టిఁ బట్టియెత్తి
శిర మురంబునఁ జేర్చి చెఱువు ప్రస్సినరీతి నోడి కల్గట్టి పెల్లుబుకు నశ్రు
ధారల నతితాంతదశఁ గన్నతనువల్లి దశపుచు గద్గదధ్వానలీల
భావణంబుల నెంతపనియయ్యె నట్లుండె విధికృతం బనుచు నుర్వీవిభుండు

తే. గూఁతు నొండొకచందానఁ గుస్తరించి, యార్తి వారించి పలినీట యాలిపాట
పాటలాధరవదనదర్పణముఁ గడిగి, యుచితకాంచనపీఠిఁ గూర్చుండ నంత. 333

ఉ. చిత్తము చెంగలింప జయసేనుఁడు సాఁగిలిమ్రొక్కి నన్నదో
న్నత్తవిరోధిరోధిరుచిమద్ఘనమూర్తి సుకీర్తికీర్తిమై
నెత్తి కవుంగిలించె నపు డింపెసలారఁగఁ జంద్రసేనుఁ డు
ద్వృత్తరసత్యభాషణవిధానుఁడు బావకు మ్రొక్కి యిట్లనున్. 334

క. దళితారి నీకుమారి, న్మిళితాంగవిలాస మైనమేనల్లున కీ
వలదే యిపుడని బద్ధాం, జలి యై ప్రార్థించుటయుఁ బ్రసాదోన్ముఖుఁడై. 335

వ. బ్రహ్మరాక్షసోద్యోగంబును బాంధవ్యంబునుం దలంచి సుకీర్తివర్తమానలగ్నంబున మిథ్యావిలగ్నజయసేనులకుఁ బెండ్లిసేసెద ననియె నమ్మహోత్సవంబు వీటఁ బాటిలి యనాగతసంబంధిబాంధవంబును నాయాతశైలూషిశైలూషంబును నాగచ్ఛదఖిలావనిపనికరంబును నాహూతబ్రాహ్మణజాతంబును నాబద్ధశుద్ధమాణిక్యతోరణంబును నలంకృతవిపణిమార్గంబును నభిరచితరంగవల్లీమతల్లికంబును నారాధితనవగ్రహంబును నఖండవాద్యమాననానాతూర్యంబును నై యమ్మహామహంబు ప్రవర్తిల్లె నా సమయంబున. 336

ఉ. బంగరుపీటఁ బెట్టి దడివంబిడి రాజకుమారి దానిమీఁ
దం గదియించి తూర్యనినదంబుల రోదసి ఘూర్ణిలంగ శ్రీ
విం గడుపాటిపాట నరవెంద్రుకలం గొమరారుసువాసినుల్
చెంగట నక్షతంబు లిడి చేఁడియకుం దలయంటి రాదృతిన్. 337

క. సుమతైలప్లుతి నలరా, కొమరాలికి నలరెఁ గురులు కోకనదాంత
స్సుమధూళిమగ్నమంద, భ్రమరీసమరీతినయనపర్వము లగుచున్. 338

తే. బుగులుకొను తావినీరము కప్పురముతోడ, నడుపుదివ్యనిఘుసృణద్రవంబుతోడఁ
బొందుగా మేళవించినచందనంబు, నాఁతికొండొకకలకంఠి నలుగుఁ బెట్టె. 339

ఉ. అజ్జలజాక్షివస్త్రసుమహన్మతిమజ్జనశాలిబాలిక
లజ్జనశాలఁ జేర్చి మణిమంజులపీఠముఁ బెట్టి దువ్వి పై
గొజ్జఁగినీరుచల్లి మెఱుఁగుల్గొన విప్పి విదిర్చి యొక్కచం
చజ్జఘనాంగ పెట్టె ఘనసారయుతామలకంబు సేర్పునన్. 340

ఉ. తోరపుజాలువాపసిఁడితొట్టులు నొట్టినపశ్చిమంబుప
న్నీరపరంజిబుంగలను నించి మనోహరకక్షకాంతిబం
గారుపసంతమాడఁ గరకంకణఝంకృతు లుల్లసిల్ల హే
లారతి నార్చి నొక్కనవలా జలకం బలకంబుకంఠికిన్, 341

సీ. జిలుఁగుపావడమీఁదఁ జికురధిక్కృతమిళిందాళియొక్కతివ మాంధాళిఁ గట్టె
తడియార్చి నేరుపేర్పడ దువ్వి యొకముద్దుకలికివాల్గంటి గీల్గంటువైచె
నిలువుటద్దము మ్రోల నిలిపి యొండొకవధూతిలకంబు తిలకంబు దిద్దె నుదుట
నెరివుట్ట నొకదిట్ట నెఱివాదితనమూఁది కనుచెలు ల్వ్రేఁగంద గంధ మలఁదె
తే. నొకశుకాలాపహారవల్లికలు వైచె, నొకవిలాసిని మణులకంచుకముఁ దొడిగె
నొకలతాతన్వి పెట్టెఁ గేయూరకంబు, లొకతటిన్నేత్ర యిడిరె బాలికకుసొమ్ము.

క. అక్కరిణీనిభగామిను, లక్కరణి నలంకరించి రాలో ధరణీ
భుక్కులచూడారత్నము, నక్కడ కై సేసి రాప్తు లగువా రంతన్. 343

మ. కదియం బోయెఁ బతంగుఁ డస్తధరాగ్రక్షోణిసత్క్రొంచము
లొప్పదలె న్నిర్ఝరమార్గపల్వలమునన్ భూరిజ్వలజ్జ్వాలలున్
మొదలెం జాగ్ర్యవియాపణాగ్రముల నెమ్మిన్సని దీపచ్ఛట
ల్వదలెం జోళ్ళ రథాంగదంపతులు విల్వంచెన్ మరుం డత్తఱిన్. 344

సీ. నూరెల వెలుఁగుపంజాలశరీరన్యస్తభూషామణిస్ఫూర్తి ప్రోదిసేయఁ
గైవారముఖరమార్గణవిలోచనకైరవముల నాననశశి వాడు దేర్ప
విమలబంధుస్వాంతవిధుకాంతముల గటాక్షజ్యోత్స్న విరవిర గరఁగుచుండఁ
గృతదృష్టికరణసంగతవధూటీహంసికల నీరజాకరము పిలువ
తే. గలువచెలికాఁడు పొడపుగుబ్బలిపసించు, గతి నలంకృతసామజస్కంధ మెక్కఁ
బటహనిస్సాణముఖతూర్యపటల మెసఁగ, బుధజనాశీరవము లుబ్బ భూపసుతుఁడు.

వ. తార్క్ష్యరోహణుం డగు నారాయణునికరణి నేనుంగు నెక్కి జయసేనుండు నర్తకీ
నర్తకగాయనీగాయనమాగధీమాగధ బ్రాహ్మణీబ్రాహ్మణనాట్యగా నస్తవనాశీర్వాద
విశేషంబు లానందసంధాయకంబులుగా స్థానీయమీనలోచనమరీచికావీచికాకప
చితరాజమార్గంబున నేఁగుదెంచుచుండ. 346

ఉ. నీరము లాడి యాడి మదినిండినసొంపుపసం గటిస్థలిం
జీరచెఱంగు వీడిపడఁ జెక్కుచుఁ దక్కినకొంగు నేలపై
జీరగఁ దన్నుఁ దామఱచి చెచ్చెరఁ జూడఁగవచ్చె నొక్కనీ
రేరుహపత్త్రనేత్ర యధరీకృతకంతుని రాజనందనున్. 347

చ. కుసుమసుగంధి యోర్తు నృపకుంజరుఁ గన్గొని మోహితాత్మయై
యసురుసురన్న దాని నికటాంగన యారసి నీకు నేటికి
ట్లుసురన నన్న నింటికడనుం డిటకుం బరువెత్తివచ్చెను
కసనుసురంటిఁ బొమ్మనుచుఁ గ్రక్కునఁ బోలఁగ బొంకె నయ్యెడన్. 348

ఉ. పొంగినకన్కఁ దోఁచినటు పోరుచు మంచముడిగ్గనీక చ
న్నుం గబళించుపుత్త్రునిఁ గనుంగొని యక్కట వీఁడు నాకు బ
ల్సంగడమయ్యె నేఁడనుచు శయ్యపయిం బొరలించి త్రోచి వ
చ్చెం గలకంఠి యొర్తు నృపసింహుము నెంతయుఁ జూడవేడుకన్. 349

ఉ. కేలఁగలించి పట్టి రతికిం బిఱువీఁకులు సేయునల్లభుం
జాలుఁబొకాలు నిల్చిలువు సైఁచు మొకించుకతాళు మాను మీ
వేళ నిశాననం బనుచు వీడ్వడనాడి యురోజగౌరవా
ర్త్తాలసమధ్య యొర్తు కదియం జనుదెంచెఁ గుమారమన్మథున్. 350

చ. అరవిరిబాగుతమ్మరస మంటిన కన్నులు డిల్లపాటు క్రొం
జిఱుచెమటల్సను ల్లోనపుచెక్కులు చిక్కులు గొన్నహారముల్
విరిసినకొప్పు నిశ్వసనవీచికలం దగ వేగ నొర్తురా
మఱుఁ గికనేల యీవిధము మంచిది పొమ్మని నవ్వి రంగనల్. 351

ఉ. మించి జయంబుఁ గైకొనునిమిత్తము నెత్తము లాడి యోడి యో
డించి పణంబు దెమ్మనుచుఁ డెక్కునఁ బట్టినప్రాణనాథువ
స్త్రాంచల మించుకేని విడనాడక నెవ్వడి నీడ్చుకొంచు శం
కించక నేగుదెంచె నొకకేసరిమధ్య కుమారుఁ జేరఁగన్. 352

*ఉ. కీలుఘటిల్లువేణిగతికిం బ్రతికూలత నొందఁ జంద్రజం
బాలిత మైనచన్నుఁగవ మధ్యముపై దయదప్ప ముత్తెరు
త్మేలిమి రాజిరాఁడఁగను మించులు శంపల గ్రమ్మటింప మం
దాలసవృత్తి నొక్కజవరా లరుదెంచెఁ గుమారుఁ జూడఁగన్. 353

వ. ఇట్లు పురస్త్రీరత్నంబులు నిజదృష్టిమసారసారంబుల నలంకరింప నేగివచ్చి సుకీర్త్తి మందిరద్వారంబున నవ్వారణావతరణం బొనరించి నారీజనార్పిత నీరాజనంబు లీక్షింపుచుఁ గక్ష్యాంతరంబులు గడచి చని ముందఱ † నతిముక్తాభిరామంబై బ్రహ్మసభను పుణ్యద్రవ్యసమీచీనంబై యాజనవాటంబును బల్లవకుసుమవిలసితంబై వసంతసమయంబును బ్రసిద్ధవర్ణగౌరవంబై సంగీతంబును నాట్యకార్యంబునం

---

*ఉ. మూలకుఁ దార్చి సందుసుడిమూతులు నాకెదుగిండిదాని న
వ్వేళకు నొద్దఁబెట్టి యిదె వే విడె మిచ్చెదఁగాని చూచెదం
గోలతనంబు పెండ్లికొడుకుం దలవాకిట నంచు వెళ్ళనీఁ
జాలనిభర్త్రఁ దేర్చి యొకచంద్రనిభానన వచ్చె వీథికిన్.

ఇది ప్రక్షిప్తమని తోఁచెడు.

† ఈస్థలంబున నుపమానోపమావాచకంబులు సాధారణధర్మవాక్యంబులకు ముందు

దనరి భరతంబును సర్వధూర్వహంబయి భారతంబును సర్వతోరణవిహారంబయి జయశీలుని విబుధభవనసామ్యంబయి గ్రహమండలంబును రంభాలంకృతంబయి స్వర్గలోకంబును విశ్రుతావితానవితానంబయి కురుక్షేత్రంబును బ్రతిష్ఠితదధిముఖపాత్రంబయి మధువనంబును ననుకరించువివాహమంటపంబు డాయంబోయి.

ఉ. మోహనలీల నంత శోకముద్దియ గద్దియఁ దెచ్చిరన్ మహో
త్సాహతభూమిపాలతనుసంభవుఁ డెక్కె ననంతరంబ దీ
నాహితనీతిసంచితగృహార్తుఁ డొసంగె సుకీర్తిభాసుర
వ్యాహృతి కుందనంపుహరిబాణమునన్ మధుపర్క మయ్యెడన్. 355

క. దానవశాత్రవుఁగా జయ,సేనుని నారాచకూఁతు సిరిగా మది న
మ్మానవపతి దలపోసి యు, ఘానియతిని ధారఁబోసెఁ దనయన్ సనయన్ 356

క. లగ్నంబు గడిచె గగనప,లగ్నం బెమ్మనిన బుధులు లలితగతి స్మర్
న్మగ్నులు గుచభరకించి,గ్బగ్నలు నగుచెలులు సొంపుతోఁ జని కడకన్. 357

క కుద కొప్పు మెఱయ గవిసెన, గదియించినమరునివింటిగతి నతిశయిలన్
దుద కొప్పు మెఱయ నింతికి, ముదితలు చిత్రాంబరమున ముసుఁగిడి వేడ్కన్.358

క నడపింపఁగ మడుఁగులపై, నుడురాజనిభాస్య యడుగు లొప్పెం గడున
య్యడుగులు కూర్మము లగుటఁట, మడుగులపై బారయకేల మానఁగ నేర్చున్.359

*ఉ మోహవశమ్ముగాని తెలిము త్తైపుసొమ్ములతోడికమ్మపూఁ
దీవలవంటిబోంట్లు కవదివ్వెఁతోఁ జెలిఁ దెచ్చి రద్ధరి
త్రీవరపుత్రుఁజేర నధరీకృతరోహిణి రోహిణిం బ్రమో
దావహజక్క నుక్కుతుదియ ల్హారిణాంకునిఁ జేర్చుచాడ్పనన్. 360

---

కొన్నిప్రతులందుఁ గానంబడియెడిని. ఐన నీకవి యింతయును నీగ్రంథమునసే యిట్టిఘట్టంబుల రచియించినరచనం బట్టియుఁ గొన్నిప్రతులయం దుండుటం బట్టియు నిట్లు సంస్కరింపంబడియె.

*శా. రాకాచంద్రనిభాస్య నెచ్చెలులు దేరం బ్రీతి నత్యూర్జిత
శ్రీకిం బట్టుగుడుంగిళాయుతవనముం జేరంగ నేతెంచుచోఁ
గాకల్పారవమత్తకోకిలలజోక న్నూరెలం డాసి ల
క్ష్మీకల్యాణముఁ బాడి రంతఁ బురహంసీయాన లుప్పొంగుచున్.

ఈపద్యము గొన్నిప్రతులలోఁ గానఁబడదయ్యెడు.

ఉ. ఆహరిణాక్షికేలు పతిహస్తమునం బతికేలు తజ్జగ
న్మోహినికేల నుల్ల సిల నూతనసాత్త్వికకంకణాంకుర
వ్యూహముతోడ రాజతనయోత్తమహస్తమునన్ మహావరా
రోహకరంబునం దిడె గురుండు సమంత్రకకంకణాంకముల్. 361

ఉ. అంతటఁ జిత్రభాగ్యవనికాంతరితం బరితశ్చరద్ధరా
కాంతిపటావకుంఠత్కృతకామినిఁ గన్గొనరామి వక్త్రసం
క్రాంతవిలాసలక్ష్మిఁ గనుకైవడి గడ్డముపట్టి యొత్తి ధీ
మంతుఁడు రాజనందనుఁడు మంగళసూత్రముఁ గట్టె నింతికిన్. 362

చ. అపుడు విధూకరోన్నమితయై తెలిముత్తెపుసేసఁ బ్రాల్ధరా
ధిపసుతునౌదల న్మదవతీమణి నించె విభుండు నమ్మద
ద్విపనిభయానమౌళిఁ బోదివెం దలఁబ్రాలవి జాతికెంపుల
ట్లపరిమితప్రియాప్రియకరాంబుజశోణిమ నొప్పె నెంతయున్. 363

చ. సరిమొటుఁ బ్రాలపుట్టికలసందున బట్టినపట్టుపుట్టముం
దెరఁ దెరలింపఁ జూచె సుదతిం బతి యవ్విభుఁ జూచె నింతి యా
య్యిరువురజూపులం గలసి యేసెఁ బరస్పరమన్మలక్ష్యము
ల్వరముల నిల్చి నెన్నడుమ సారసబాణుఁడు సవ్యసాచియై. 364

క. విడువనితగు లిరువురకి, వ్వడువున ననుకరణి నుభయవస్త్రాంచలము
ల్విడిదెరునక్షతలతో, ముడిఁబెట్టిరి పంచశరుఁడు ముడిఁబెట్టంగన్. 365

ఉ. అంబరదంశితాఖిలసముగ్రమణిస్ఫుటవేదికాంతరా
దుంబరపీఠి నుండిరి వధూవరు లయ్యెలనాఁగ యగ్నిహో
త్రంబున వ్రేల్చె లాజలు ధరావరసూనుఁడు సంభృతానురా
గంబున నేమిచెప్పఁ దనకౌఁగిటి కింతిమొగింబు వ్రేల్వఁగాన్. 366

క. ఆగామిప్రణయరణో, ద్యోగం బణఁచుటకు నేఁడ దొరకొనె నితఁడం
చాగుగుకుచవనగ నయారే, ఖాగురుఁ డడుగూఁది సన్నెకలు మెట్టించెన్. 367

సీ. అవలోక మొనరించి రసురఘుస్మరపదధ్యానసంపాదినౌత్తానపాది
నేడ్వురుఋషులతో నీక్షించి రురుకుచశ్రీజితాహార్యవసిష్ఠభార్య
గళితచేలాంచలగ్రంధులై మ్రొక్కిరి యిలువేలుఁపులకు బెద్దలకు భక్తి
నుర్విసుధాశనాశీర్వాదపూతాక్షతములు మస్తకములఁ దాల్చికొనిరి
తే. రాజకన్యక యంతఃపురముననుండె, బెండ్లిచవికకు నేతెంచెఁ బెండ్లికొడుకు
విప్రులకు బంధుజనులకు విద్యవారి, కుభయనరనాథు లీప్సితం బొసఁగి రంత. 368

చ. నిరుపమశోభనాక్షతలు నించినపళ్ళెరము ల్ధరించి సు
స్వరమునఁ బూని యొన్నఁదగువర్ణములం బఠియింపుచుం ధరా
మరుల బహూకరింప గరిమంబున మూఁడవనాఁడు వర్తిలెం
బరమసుహ్వాన్నోజ్జ్వలమయి ప్రాఁకెనయమ్మలు నాఁటివేకువన్. 369

మ. నరులం గూర్చినకొప్పుతోఁ బసపుమిన్నల్దేఱునెమ్మోముతో
గరిమన్నాగమసానిప్రోలుదిరుగం గాఱంతులై తూర్యముల్
మొరయంగాఁ గడునొప్పె నాకబలియాలోకాటికాపేటికల్
సరసాప్తిం జదివించి రాప్తులగురాజన్యుల్గురుల్మెఱఁగన్. 370

చ. అతికృతులై నృపోపకృతులై హితులై తనరారుధారిణీ
పతు లతులప్రభిం బురముఁ బాసి గృహంబుల కేఁగి రంత రు
ద్వ్రితిపరిపంథి రాజసుతవర్తి సుకీర్తితనూజ కిచ్చె నూ
ర్జితగుణరత్నపేటికలఁ జేటికలం బదివేల ప్రేమ్మిడిన్. 371

క. ధాటీఘోటీఘుటితవ, రాటీబోటీహృదార్తరవుఁ డజ్జగతీ
తాటంకవతీపతిపట, పేటీకోటీశతంబు బిడ్డకు నిచ్చెన్. 372

శా. సౌరభ్యాహృతివిశ్వభూజనమనస్సంతాపము ల్విస్తృతాం
భోరుద్రాగకరంకహృద్విహరణంబు ల్సారకర్పూరక
స్తూరీసాంకవగంధసారఘుసృణస్తోమంబుతో నిచ్చె సు
భూరిరత్నంబున కీడువారముఁ సొమ్ము ల్రాజు దేజంబునన్. 373

ఉ. ఆహతగంధవాహముల నద్భుతహేషణదంభదూషణ
వ్యాహృతిభర్జితద్యుమణివాహములం గతిభిన్నమానస
వ్యూహములం గులీనమహిమోజ్జ్వలవాహములం గఠోరవీ
రాహితచిత్తభల్లుఁ డగునల్లుని కిచ్చె సుకీర్తికీర్తికిన్. 374

మ. కటకస్థాతృమతంగజప్రభుమదౌత్కంఠ్యంబు వారించి యు
త్కటన క్షోణిపుచేతఁ బ్రాభృతముగాఁ గైకొన్నవైంధ్యద్విప
చ్ఛటలం భిన్నదిశావశాప్రియులఁ జంచజ్జంగమగ్రావధీ
ఘటనమూర్తుల నిచ్చె నల్లునకు భూకాంతుం డుదాత్తస్పృహన్. 375

క. అరదంబులఁ గుటిలాహిత, దరదంబులఁ గేతుపవనదళితప్రావృ
ట్ఛరదంబుల భరనరది, గ్ద్విరదంబుల నిచ్చె భూమివిభుఁ డల్లునికిన్. 376

వ. వెండియుం బేరుగలవస్తువు లిచ్చి జామాత నాదరించి తాను నుపకృతుండై సుకీర్తి
యాఁడుబిడ్డ నాలోకించి యప్పు డశ్రుమిశ్రితాక్షుండై యిట్లనియె. 377

క. జనియించినయింటికిఁ జొ,చ్చినయింటికిఁ గ్రొత్తక్రొత్తసిరిగా సరిరా
వనబోండ్లు మేలుమే లన, మనుమీ మానుమతుల మైనమా కిం పొలయున్. 378

చ. మలసి ఋణానుబంధమహిమన్ హృదయేశ్వరుఁ డత్తి నత్తమా
మలతలగాకయుండఁ బతిమాన్తురు కాంతలు వారికన్నఁడున్
గలుగవు వన్నెవాసు లటుగావునఁ బుట్టినచోటు బుద్ధిలోఁ
దలఁచి తదంఘ్రిభక్తి పరతంత్రవు గమ్ము కుమారికామణీ. 379

చ. కృతనుతశీలయైనసతికిం బతిపంటిగురుండు లేఁడు ని
శ్చిత మిది యమ్మునీషికి విశిష్టగురు ల్దలిదండ్రు లమ్మహా
మతు లుసురన్న విప్రుఁ బరిమార్చినపాపము వచ్చుఁ గాన నీ
మతముఁ దలంచి యత్తకును మామకు సేవయొనర్పు మోర్పునన్. 380

సీ. అత్తమామలచిత్త మలర వర్తిలవమ్మ ధవుని దైవంబుగఁ దలఁపవమ్మ
తోడికోడండ్రపొత్తును బాయనీకమ్మ మఱఁదులఁ గని మని తిరుగవమ్మ
యనుఁగుఁజుట్టములపట్టున వెట్టగాకమ్మ పఱవుళ్ళపై రక్తి వదలకమ్మ
కాఁగానిచెలుల డగ్గఱి చరింపకుమమ్మ యుత్తమస్త్రీలపొం దుడుగకమ్మ

తే. తోడుతోడైన నందనుతోడనైన, నొంటిపాటున భాషించు టుడుగవమ్మ
పనులఁ గొనకమ్మ భూసురాంగనలచేత, వ్రేలఁ జూపించుకొనక జీవింపవమ్మ. 381

ఉ. శ్రీవరవర్ణినీదనుజశిక్షణదీక్షులయట్లు దేవియున్
దేవరబోలి నీవు భవదీయవిభుండు నఖండసౌఖ్యసం
భావితులై మహాతనుకుమారు నఖర్వసుపర్వహర్మ్య నా
శావినుతైకకీర్తిధను జంపతు లూర్జితలీలఁ గాంచుఁడీ. 382

శా. తల్లీ నిన్నెడఁబాసి యుండెడొకముహూర్తంబైన సైరింప నా
యుల్లం బోర్చునె పుత్రి నీక నిను నయ్యో దైవ మిట్లిచ్చె నే
వెల్లింబోయినవంతఁ గుందవలసె న్వియ్యంబుఁ బ్రార్థించి వి
ద్యుల్లేఖానిభదేహ నిన్బిలువఁబుత్తున్ శీఘ్రకాలంబునన్. 383

వ. అని సుకీర్తి యార్తిం దలవంచుకొనియె నంతఁ దదీయసతి కాంతిమతి పుత్త్రిం గవుం
గిలించుకొనుచుఁ గన్నీరుకరతలంబునం దుడిచి డగ్గుత్తికఁ బెట్టి యెట్టకేలకు ధైర్యంబు
చిక్కంబట్టి యిట్లనియె. 384

క. నాయనుజాఁడు మత్సిల్లుం, డీయిలు నాయిలు సుసేనుఁ డీజయసేనుం
డోయబలా నీపెనిమిటి, హాయసమున నేయిదొరుఁగుబా గేర్పడియెన్. 385

చ. ఇరువుర మేను లారయఁగ నెక్కడ నుండిననేమి యిక్కడం
దరలదు గాదె మాయనువితానము నిన్నదె వర్తమానవ

త్సరమునఁ బిల్వఁబంచెద విశాలకు నెమ్మదినుండు పోయి క్ర
మ్మఱియెద నంచుఁ బుత్త్రిఁ దగుమాటలఁ దేర్చి సగౌరవంబునన్. 396

వ. వివిధాభరణంబులు చిత్రవస్త్రంబులు పరిమళప్రముఖంబు లగుసర్వవస్తువు లిచ్చి బంధుజనుల నియోగంబు పనిచి చతురంతయానాధిరూఢ యగుచుఁ జతురంగసేనాపరివృతుండగుసుకీర్తితోన మరలి పురంబున కరిగి సుఖం బుండె. 387

ఉ. ఆజయసేనుఁ డంతఁ బరమాదరణంబున బ్రహ్మరాక్షసుం
బూజలఁ దన్పి కేల్మొగిచి పొండిఁక మీరన నుత్సహించి గో
త్రాజరదైత్యుఁ డానరనరాత్మజు మన్నన సేసిపోయె నం
భోజభవాలయంబునకుఁ బుష్పకమెక్కి సురల్ భజింపఁగన్. 388

వ. ఆరాత్రి మజ్జనభోజనాదికార్యంబు లాచరించి. 389

సీ. చంద్రికపూవన్నె జిలుఁగుఁ గుప్పసములవమేల్కట్టు దంతపుఁగోళ్ళపట్టెమంచ
మెఱుఁగుబిల్లలుపట్టుపఱుపుకప్రపుఁబుక్కసురటి క్రొవ్విరులు కస్తూరిరాయి
పూప్రుగట్టినగందపొడికదంబము పెట్టె కలపంబు చికిలిబాగాలబరణి
పండుటాకులు నానవాల్పానకములును గండచక్కెర తెల్లపిండివంట
తే. సంజసరిపట్టుబకదారిజాతిపారు, వనులు గుజరాతికెంపుదీపములు బూతు
చిత్రపటములు కుడిసిరుచెంబుగలిగి, తవరుసదనంబు రాజనందనుఁడు సొచ్చె. 390

సీ. మంచికప్రము మేళవించినపన్నీట సరసాళిజనము మజ్జనముఁజేసి
జిలుగుమాంధాళి కుచ్చెలఁబోసి కట్టి దేహమునఁ గుంకుమరసం బప్పళించి
చికిలిపైఠాణికంచుకము గీలించి చొక్కము లైనమణులహారములువైచి
సొగసుగా నుదుటఁ గస్తూరిరేఖ యమర్చి కళుకులు ముద్దుచొక్కాలు ఘటించి
తే. గోరజవ్వాదిపదనిచ్చి గూడదువ్వి, కుసుమగర్భంబుగా జాఱుకొప్పుఁబెట్టి
చవులచేర్చుక్కు సీమంతసరణిఁగూర్చి, కన్య నిష్టాన్నసంతుష్టఁగా నొనర్చె. 391

ఉ. కూరిమి బుజ్జగించి యనుఁగుంజెలువ ల్దనుఁదేర సమ్మదాం
కూరమహావిలంబమునకుం బనిలే దనఁ బోవపోకుమం
చూఱటలేక సిగ్గుతెరవుండగ ముందఱఁబోయి పిమ్మటం
గ్రూరవిషాణమేషమయి కొమ్మ చనుం జనలేక క్రమ్మఱున్. 392

ఆ. వనిత నిలిచి నిలిచి వచ్చుచు మంజీర, మండనములు మాని మాని మొరయ
లజ్జ విడువరాదు లావణ్యవతులకుఁ, బ్రాణనాథుతగులుఁ బాయరాదు. 393

వ. ఇట్లు కేళిమందిరంబు చేరం దెచ్చి 394

ఆ. చెలులు బలిమిఁజేసి పిలిచినఁ దప్పంబు, చేరరాక సిగ్గు చేర్లకొనఁగఁ
గ్రమ్మఱియును మోము కొండొకమాపట్టఁ, దలుపు దండగొనుచు నిలిచియుండె.

క. రతిబోటులంత మంద, స్మితచంద్రికవదనపర్వశీతద్యుతులం
దతులగతి మెఱయఁ దేజో, న్వితునకు నృపసూతి కిట్లనిరి నేర్పొలయన్. 396

క. ఈపాఁపపూఁప వయసుది, నీపాదములాన మెత్తనిది పేర్కొనరా
దేపనిపాటల నేనియుఁ, గాపాడుదుగాని గాసిఁ గావింపకుమీ. 397

తే. ఎంతతమకంబు గలిగిన నిగురుబోండ్లు, చేర నొల్లరు మగవారు చేరుదనుక
నది యథార్థీకరించి నీయలరుబోఁడిఁ, గదిసి పిలుతువుగాని కొంకెదవుసుమ్మి. 398

క. అని నగుచు మగువలందఱు, పని నెపమున నొక్కరొక్కరె పఱచిన లజ్జా
వనతాస్య యగుచు నంగన, మనమున నునుసిగ్గు దేరి మారార్తిన్. 399

ఉ. ఉవ్విళులూఱుచు న్వికసితోత్పలలోచన చూచు వల్లభున్
దవ్వులజూచు భర్త దను వర్తిలిఁ జూచినఁ జూడ దంతలో
బువ్విలు వంచిఁ బాణ మరి బోసి దయుంబున డాసి శింజినిం
జివ్వనఁ బాపి యేసె నలచిత్తజుఁ డిద్దఱ సవ్యసాచియై. 400

క. ఆత్తఱి రాజకుమారుం, డెత్తినతమకమున ననునయోక్తుల సరసా
యత్తవిచేష్టలఁ గన్నియ, చిత్తము గరఁగించి సజ్జఁ జేరఁగఁ దెచ్చెన్. 401

సీ. మగువ నీకంకణమణుల నర్ఘ్యము లని పరికించు నెపమునఁ గరముఁ బట్టె
నెత్తమ్మితావు లీనెడు నీమొగం బని మూర్కొనువిధమున ముద్దుఁ బెట్టె
లేమ నీకంఠమాలిక దొడ్డసొమ్మని తడవులాగున ఘనస్తనములంటె
బిఱుచుట్టుబిగువున విఱుగదే నడుమని సడలించుగతి జీరముడి వదల్చె
తే. నాఁతినీయొమ్మునాయొమ్మునకు సమాన, మయ్యెడినొ కాదొ యాఁగాములరయవలయు
నని మహాకైతవంబున నధిపపుత్త్రుఁ, డంబుజాననపరిరంభ మాచరించె. 402

ఉ. వేడుక లంకురింపఁ బృథివీవరుఁ గౌఁగిలి మందుసోఁకి సి
గ్గూడని బాడిన న్నగుఁ బ్రియుండు హసించినఁ బిల్వ మాఱుమా
టాడు మొగంబునం దెలివి యచ్చుపడం దఱితోడ నిమ్మనన్
వీడియ మిచ్చుఁ గన్నులకు విందగుచుం గలకంఠి వేమఱున్. 403

ఉ. జీనువముక్కుతోడఁ బ్రతిసేయఁగవచ్చిన గోరఁ దీరుగా
నీనియ లొల్చి చుట్టి తనకిచ్చిననాగరఖండ ముర్వరా
జానిసగంబు వోఁ గొఱికి చానరదంబుల కందియియ్య నా
లో నవినొప్పె వజ్రములలోఁ దళుకొత్తెడుకుందనం బనన్. 404

ఉ. చాతురిమీఱ మస్తకము సందిట బిగ్గరఁ గ్రుచ్చిపట్టి యా
నాఁతిసుధాధరంబు రదనంబున నొక్కనఁ దాళలేక ధీ

గాతిశయాశ్వ మేది బాహుళార్చును కన్నరమూసి వల్లభుం
జేతుఁ ద్రోవి రాజముఖి సీత్కరణం బొనరించెఁ బల్మఱున్. 405

ఉ. అంగజసాంపరాయము సమాప్తివహించిన నిర్భరత్రపా
లింగితచిత్తయై యబల లేచి కటిన్స్రములాంబరాంచలం
బుం గదియించి హేమమణిపుత్రిక చాటున కేగుచోఁ బున
స్సంగమవాంఛ పుట్టె నృపజన్మున కిష్టవిలోకనాయతిన్. 406

వ. ఇట్లిచ్ఛామయరూపవిలాసంబులం బొదలి సుఖించి రద్దంపతులు మఱియును. 407

సీ. సురభిపుష్పామోదఁ జొక్కించె నారామసీమ నారాజన్యచిత్తజుండు
కలహంసగమనఁ దెప్పలఁదేల్చెఁ గాసారతటముల నానృపోత్తమసుతుండు
కంఠీరవవలగ్నఁ గరఁగించెఁ గృతకాద్రిగుహల నద్ధాత్రీశకుంజరుండు
కలకంఠి తనురాగ మొలయించెఁ జివురుఁజప్పరముల నవ్వైరిభంజనుండు
తే. గారుడాశ్మచ్ఛటాచ్ఛన్నకనకసౌధ, పాళికల నావితీర్ణవిభ్రాజితుండు
రతులఁ బొలయించె నాశరద్రాజవదన, నతిశయప్రీతిలతిక మాటాకులిడఁగ. 408

క. మహిళారత్నంబును న, మ్మహిరమణసుతుండు భోగమహనీయకళా
విహారలీల నుండిరని యల, బహుమానుఁడు క్రకచుఁ జూచి పలికె న్మఱియున్.

క. దొరికినవిశ్వంభరిత్రి, పరకన్యక విడిచె వెఱ్ఱివాఁడై యడవిన్
మరణమయి మనినమందుఁడు, పురుడింపఁగ నీకు దోడుఁ బోవఁడె క్రకచా. 410

ఆ. తనకుఁ దెవులు మూఁడె నని భార్య సెప్పిన, నీవు దానిమాట నిజముసేసి
నెయ్యుఁ డనక నన్ను నిర్జింపఁజూచితి, చెడుఁగ నిన్ను విశ్వసింప నగునె. 411

క. వెడమాయలపుట్టిల్లగు, చెడుగుం గళ్ళాలు పాపశేషంబునఁ జే
పడినకతంబునఁ గాఁపుర, గొడు కొక్కఁడు రాజబాధ గుండఁడె తొల్లిన్. 412

క. నావిని జలచరరమణుం, డావానరవిభుని కనియె నదియెట్లు ధరా
దేవస్తుత యాకథఁ జెపు,మా వినియెద ననిన నతని కతఁ డిట్లనియెన్. 413

సీ. ఆరసాతలగభీరాపారజలఖేయ మానాకరమ్యసాలాభిరామ
మాచంద్రమండలవ్యాయామమణిసౌధ మాబ్రహ్మశుద్ధవిప్రాన్వవాయ
మాప్రాణపవనశౌర్యారూఢనక్షత్ర మాఫలోద్యమసముద్యమకిరాట
మాదార్ఢ్యధర్మకార్యారంభచరణజంబాచక్రవాళశైలాశుతురగ
తే. మాంబరప్రాంశుదానధారాఢ్యనాగ, మాధ్రువస్థానపథశతాంగాతిశయము
బ్రహ్మకైనను బ్రస్తుతింపఁగఁదరంబె, భూపగురునూపురంబు కాంచీపురంబు. 414

క. అలకాంచితమయి తనరిన, యలకాంచివిహారభ్రమ్రుఁడను పేర మహా

హాలికుఁ డొకఁ డుండు నలంది, క్కాలబాహుం గలిమిచట్టుకొడు కితఁ డనఁగన్.

సీ. ఆలగుంపులు గొఱియలదొడ్లు లేఁబూరియెనుములమునిమంద లెడ్లకదుపు
లులుగరంబులు వాఱుపాలమువాకిటఁ బదికట్టుబండ్లింటికిఁ జొట్టుమగులు
తలుపుదూలము కొట్టములు సోగరాగాడినుచ్చు ముంగిట రెండు రచ్చమాకు
లీనుగోడిగె వేగురింటిబిడ్డలు మూళ్లతార్పులు నూబపాఁతిఱలఁ గొలుచు

తే. కలుపుకలిలేరుదండయుఁగమ్మతీగ, పాగడము పూసె నానెట్టె బవిరపడిగె
చుక్కబొట్టును జిటిపొటిసొమ్ము గలిగి, కాఁపురము సేయుఁ సవ్వీటఁ గాఁపుకొడుకు.

క. వానికి నిచ్ఛావతి యనఁ, గా నొకయిల్లాలు గలదు కమనీయవయో
నూనవనంబున నది జా, రానందలతాలవాలమై పత్రిల్లున్. 417

వ. అది యొక్కనాఁడు. 418

చ. తలఁ బెనుగుండఁ దాల్చి వితతస్తనభారమున న్వలగ్న మా
కులత వహింపఁ గాఁప వలిగుబ్బెత పట్టపగ ల్జలాశ ని
ర్వ్యాలువడి మన్మథాస్త్రపటలీనిశితాక్షకటాక్షమాలికల్
గెలఁకులఁబర్వ వేగవతికిం జని తత్తటినీతటంబునన్. 419

ఉ. కోమలధూళిధూసరితకుంతలు నాతపరక్తరక్తదృ
క్తామరసుం గటీరపరిధాననిబద్ధకరాసిఁ బాదర
క్షామిళదంఘ్రిపద్మముఖసంస్తరణేతరచిత్తు గాఢచిం
తామయుఁ శూద్రు నధ్వజనితశ్రమపీడితుఁ గాంచె నొక్కనిన్. 420

క. కాంచి దృగంచలశోభా, చంచచ్చంద్రాతపమున శాంతశ్రముఁ గా
వించి యలవిందునకు మదిఁ, గొంచించక హాలికలికుచకుచ యిట్లనియెన్. 421

మ. నిలువం జోటులు లేవె నీకుఁ జెపుమా నీరాటి కీవేల హా
తెలిసెం బాంథగతాగతైతదిభపృథ్వీభృత్పురస్త్రీకళా
కలితాస్యద్విజరాజబింబకృతసాక్షాత్కారసంభావనా
కలనన్ దూరపథప్రయాణజనితగ్లానిం ద్యజింపం జుమీ. 422

క. కలదుగదా యని మోవిన్, బలుమింములు పందడింపఁ బలికినఁ జింతా
కులహృదయుఁ డగుట వాఁ డ,చ్చెలిమాటలు వినక సరకుసేయకయుండెన్. 423

వ. అట్లదత్తప్రతివచనుండై యుండ నమ్మిండతె వెండియుఁ దెరువరి నీక్షించి. 424

శా. అంపంజాలము చింత నీమనసు చీకాకౌట నామాట లా
లింపం గూడదు నేఁడు క్రొమ్మెఱుఁగుదూలె న్నేను వీక్షించినన్
సొం పొక్కింతయు గానరా దెఱుఁగవచ్చుం జెల్లఁబో చుట్టమా
కొంపం బో రుదయించి రావుగద నాకుం జెప్పుమా నీకథల్. 425

క. అని సరిదాఁకంబలికిన, విని కొండొకమనను పల్లవించిన దానిం
గనుఁగొని యతఁ డను నా; డ్వునఁ దెలిసితి వింటఁబోరు పుట్టుట తరుణీ. 426

ఉ. నేర మొకింతలేమియును నిర్దయ లైనను గన్నతల్లి దు
ష్కార్యరత కోర్చి రాయుఁ దనకోడలి రేలు పగళ్లు కంట న
గ్గోరము జూడలేక మదిఁ గుందుచు నిల్దగనాడి పోయితిన్
వారణలేక రాజుఁ గొలువం జిరకాలము దండుఁజేసితిన్. 427

ఉ. నా కవనీశుఁ డిచ్చె నదనం గదనంబున నస్మదీయబా
హాకరవాలధారభయదారులు గూలినఁ జూచి మెచ్చి కో
రాకృతకృత్యయందు సవరాలు వరాలు సరాలు రూకలుం
గోకలు మానికంపుఁదళుకుల్ మృగనాభిజవాదికప్రముల్. 428

ఉ. ఆకమనీయవస్తుతతు లన్నియుఁ దెచ్చి నమస్కరించి యు
త్సేకరసం బెలర్పఁ దనచేతికి నిచ్చిన వాని నన్నియున్
గైకొని జల్లి బాష్పకలికాతరళీకృతలోచనాంతరై
కాకుతనంబు సేసె గొడుకా యిఁక నేమన నేర్తుఁ గోడలిన్. 429

ఉ. తిట్టినఁ దిట్టు బెట్టుఁ జిటిదిండికిఁ గొల్చిన కొల్చు సాగ ది
చ్చిట్టకమన్న మాతులకుఁ జేతులు సాఁచు నొకప్పుడేని యి
ల్పట్టను సంతకూటములఁ బాయదు చేయదు చెప్పినట్టు నీ
అట్టడిజంత యిల్వెఱిచె రాతనయా యనయానుషంగతిన్. 430

క. కాపురమున వెండియు నది, గావించినపనులు పెక్కుగల వవి నాకే
లా వినుపింపఁగఁ బిమ్మట, నీవె యెఱింగెదవు డాఁగునే యపకీర్తుల్. 431

క. నీవఁట యది యాఁట నలసిన, త్రోవం జనుఁ డింక మమ్ము దూఱఁగఁ బనిలే
దీవఱదను కారోఁతల, దేవళ్లంబడితి విసివితిం గోడలిచేన్. 432

చ. కొలపగ గాక యత్తకును గోడలికిం బరికింప నెయ్యముల్
గలవె పలానిమచ్చరముఁ గైకొని యీముదిముండ చెప్పెడున్
బలుమఱు నండ్రు దానిగుణభంగు లెఱుంగనివారు సర్వమున్
దలిసెడుఁ గాదె చేయఁగలితే మఱి దాఁగునె పుణ్యపాపముల్. 433

క. పూవకపూచెం గడపట, కాపకయు న్గాచె ననుచుఁ గడగన్నులఁ గెం
పావహిలఁ దల్లిసెప్పిన, యావాక్యము లన్నతమయములని యవ్వేళన్ 441

తే. తల్లి పలుకులు గాదనఁ దాల్మిలేక, యుత్తమాంగనఁ గులకాంత నొందువనక
బ్రతుకుభాగ్యము విడిచి నిర్భరవిరక్తి, నరుగుదెంచితి ననిన నయ్యంబుజాక్షి. 435

ఉ. ఆతనిఁ జూచి యిట్లనియె నట్టిద తప్పదు నాఁటి నీతితో
జాతి దలంచి సిగ్గులకుఁ జచ్చుచునుండిన నుండెగాక కా
మాతురతాతిరేకమున నాఁడిపోకలఁ బోవఁజూచినన్
వేతరవుండి పట్టుకొన నీరజగర్భునకైన శక్యమే. 436

క. కులసతి యుత్తమురాలని, తెలిసియు నీతల్లి మనసు తెలిసియు దగదీ
యాలుక మటివెట్టి తెలిసెన్, దల యోకలి చుట్టు మనువిధం బిదిగాదే. 437

క. నావిని యతఁ డిట్లనుఁ జెడు, త్రోవలఁ బోకుండ మదపతుల నెప్పటికిన్
గావఁగరాదా పతులకు, నీవనియెదొ యెల్లవారనిరో యిబ్భంగిన్. 438

క. మిన్నులపైఁ బోవదుగద, యిన్నేలనెకద మృగాక్షి యిటు లెవ్వరికిన్
గన్నాఁదకున్నెఁ జెపు మన, నన్నేలఁతుక నవ్వి వాని కపు డిట్లనియెన్. 439

క. పరసతి నని చని యనుఁగుం, బురుషునితోఁగూడి నిలయమున నాఁడొసఁగన్
సురతసుఖశుల్కమును గొని, యిరవందగ నీకు విత్తమిత్తుం బుత్తున్. 440

క. ననుఁ జూడఁగలవె తొల్లిటి, ఘనజఘనలకైతవంబు కతలుం గితలున్
వినిపింప నేటి కన్నియుఁ, గనుఁగొనియెదుగాక నేఁ డఖండప్రీతిన్. 441

ఉ. ఇచ్చట నుండనేల తొలియిర్లుపడం బసిబిడ్డతల్లితో
నచ్చితి నేఁ బ్రవాసి నిలువన్వలెఁ బ్రొద్దుదయించుదాఁకనం
చచ్చుపడంగఁ బల్కి తమయాతనితోఁ దలసాఁపనిల్చి యో
ముచ్చటకాఁపయేనయట ముందటికార్యము లాచరించెదన్. 442

క. అని వేగవతీజలములఁ, గొని యామణిమంతుఁ దోడుకొని మృదుగతులన్
జనియె నొరు లెఱుఁగకుండం, దనయిలు రెడిసాని యపు డతని కతిఁగించెన్. 443

ఉ. అంతట వేఁడివేలు పపరాద్రిఁ దిరోహితుఁ డయ్యె వాసరాం
తాంతరుచు ల్సెలంగెఁ గలయం దొలిచీకటిపర్వె సీరిసీ
మంతినిమాటమీఁద మణిమంతుఁడు చీరముసుం గొనర్చి యొ
క్కింతభయంబులేక పడి నేగెఁ గృషీవలునిల్లుచేరఁగన్. 444

వ. ఏగి యుత్కండోత్కలికుం డగుహాలికున కిట్లనియె. 445

ఉ. నాపడుబాటు కేపగప నా కనుకూలగతిం జరించునీ
పాపనితల్లి కీవికచపంకజలోచనకై దురంతసం
తాపముఁ బొందెదం దగినతావిది గావున వచ్చినాఁడ నేఁ
డీపనిగాడిదండ పనియించి ప్రభాతమునందుఁ బోయెదన్. 446

క. ఉండుచునా యన నాయన, మండుచు నిట్లనియె మంచిమాటే యిది మా

యిండులు విడుదులె పురి గుడి,గుండంబులు లేవె పండుకొను మచ్చోటన్. 447

క. పాసఁగ దని ముక్కు దున్నిన, పసరముగతి రేఁగి రెడ్డి పలికిన నాలోఁ
బసిబిడ్డ నెత్తుకొని సం,తసమున రెడిసానివచ్చి తనపతి కనియెన్. 448

ఉ. చెప్పగ మదేమి యేలరాద సేసెదు నాకిటువంటి తెల్వి గం
చప్పలుగాకి తా నెఱుఁగన ట్లడుగం బ్రియుఁ జూచి వాఁ డనున్
గప్పినమబ్బులో నితఁ డొకం డిదె వాకిట నిల్చి చోటుకై
యొప్పెడు నెన్నఁడేనియు నెఱుంగుదునో ననుఁ దా నెఱుంగునో 449

ఉ. అలఁటు చంటిపాఁపడఁట యంగడిలేదె పచారముల్ గృహం
బేల ప్రవాసి గాఁడె తన కెక్కడనైనఁ బరుండరాదె యీ
నేలయెగాని నిల్వఁ బెఱనేల మనోజ్ఞముగాదె యంకచం
డాలముగాదె యిట్లునికి నా నది రెడ్డినిఁ జూచి యిట్లనున్. 450

ఉ. అలఁటు చంటిపాఁపడఁట యాయన యెంతటివాఁడొ యేరికిన్
జాలిది గాదె యిల్వెడలఁజాలనివారు బయళ్ళనుందురె
వేలుపులైనఁ దక్కరుల వేఁడర యక్క అపాటునం జలం
బేల పరుండనిమ్ము మన కిప్పని పుణ్యముగాదె వల్లభా. 451

క. పసిబిడ్డతల్లితోఁ గ,క్కస మొండొకదెసకు నరుగఁగా నిశనికి ని
వ్వసుధఁ దలఁ గట్టుకొనియెదె, కసరకు నేఁడెల్ల నుండుఁ గా కిచ్చోటన్. 452

క. చాలుఁ బిసాళింపకు మని, యాలరిరెడిసాని మగని నదలించి సుతుం
డాలును నీవును నిచ్చోఁ, దాలిమి వసియింపు మని యతని లాలించెన్. 453

వ. ఇట్లుపలాలితుండై మణిమంతుం డయ్యింటిపసులకొట్టంబున నుండె నంత. 454

సీ. కలదండి పసిఁబిండి కాఁచి చేమిరిఁబెట్టి యొఱగకుండఁగఁబట్టి యుట్టినొట్టి
కోళ్ళసంకటితోడఁ గూడు నీళ్ళిడి జాగు సెరపక బంటుబానిసలఁ బనిచి
తనివెచ్చకలినీటఁ దా నమర్చి యనుంగునిసువు జోవలఁబాడి నిద్రఁబుచ్చి
యోతువు గొనిపోవకుండఁ గూయిడదెచ్చి కోడితండంబులఁ గూండ్లగమ్మి
తే దాలిఁ గాఁగిన నీరాడి నీలికమ్మి, మడుఁగుఁ జైఁగప్పుకొని కాళ్ళు ముడిచిపట్టి
మంచమునఁ గూలి నిదురించుమగనిలేపి, కూరయును వెన్నఁ బడవైచి కూడొసంగి.

తే. సన్నజాదపునేఁతిమంచంబుమీఁద, దుద్దుగంబడిఁ బఱచి నిద్దురకుఁ దూలు
మగనిఁ గూర్కకు మనుచు నమ్మాయలాఁడి,వెడదగంగాళమునఁ గూడుగుడిచిలేచి.

క. గుడుసుంబోఁకలు బ్రద్ద,ల్వడ ఒోఁకటఁ గుమ్మితెచ్చి పతికిడి సున్నం
బిడక యొకకొన్నిసున్నం,బిడి యొండొకకొన్నిమడుపు లిచ్చుచుఁ బలికెన్. 457

క. మగవాఁ డవఁగాఁ డుమ్మెద, పొగడుం బ్రాయమునఁ గన్నపూవుల నెల్లన్
దగిలి రమియించుఁ గలదే, మగవానికి నెందు సరిసమానము జగతిన్. 458

ఉ. వారణలేక హస్తిగిరివల్లభు సేవకు వచ్చిపోవుచు
న్నారిమిటారు లీపురమునం గల రచ్చవురాకుబోండ్లతోఁ
దారసమైనతీరు గలదాని నొకానొకబోటి నెన్నఁడై
నా రతిఁ దేల్చవే కడువినం బ్రియమయ్యెడు నాకు నింతయున్. 459

చ. పలుచనిమేను నిబ్బరపుఁ బ్రాయము వాఁడవు కంచి కెప్పుడుం
గలిగిన రెడ్డివిం గొనఁగఁ గర్తవు కాఁపుర మెచ్చు నిన్ను నే
వెలయొలనాగ పిల్వ దది వేడుకఁ బోలిన నీకుఁ జిత్తమే
పొలఁతుకమీఁద నుండు నిది బొంకక నాకెఱుఁగంగఁ జెప్పుమా. 460

క. తడవుల నుండియు నిది ని, న్నడిగెద నని యుంటు మఱతు నటుటయుఁ గాఁపుం
గొడుకు విడియంపుసొంపుం, జడుపుం బెనఁగొనఁగ నప్పసాళికి ననియెన్ 461

ఉ. ధీరత మంచిదానిపగిదిన్ వ్యభిచారిణుల వేఁడిమాట లే
తీరున నైనఁ బిల్చుకొని తిట్టుదుఁ గొట్టుదు నంచుఁ జూచెదే
యూరకయున్న జాల్వెఱతు నుండు మెఱుంగుదు నిన్నుఁ బోల ది
క్కేరడ మిట్టిగోల కెత్తేఁగింపక యెవ్వరితోడఁ జెప్పుదున్. 462

క. నావిని వెండియు వలయి, చ్చావతి పతిఁ జూచి పలికె సరసత నేనై
కావలెనని వేఁడుకునఁట, వావలనం గనలుపుట్టు నా యింతైనన్. 463

క. వేడుక పుట్టెడు విన నా, తోడు సుమీ చెప్పుచున్న దోషము లేదే
పేఁడియఁ బోయితి వనఁ జలి, వీడి కృషీవలుఁడు నవ్వి వెలఁదికి ననియెన్. 464

ఉ. ఒట్టవు సత్య మే నెఱుఁగ నొండొకబోగము దానిఁ గాంచికా
పట్టణమందుఁ గూడి గడపె మన వాకట నాడి పద్యముం
గట్టినవీటి లంజగుత్తిగాఁ దిరుగాడ నెఱుంగవే మొ నా
చుట్టఱికంబునం బ్రియము సుమ్ముఁక మాటలు వేయునేటికిన్. 465

ఉ. నావిని గోరగింప నయనంబులు విస్ఫురితాధరోష్ఠయై
యా వెడమాయలాఁడి యను నాతని కోరి మెఱుంగుబోఁడు లే
కై పడినైన వేఁడుదురు గాదె మొఱుంగు లెఱుంగఁగోరువా
రై వినరానిమాట లకటా మగవానికిఁ జెప్పవచ్చునే. 466

క. దాపురము లేక యీ క్రియ, గాపురములు సేయుచున్న గరితలతో నీ
తీపువములు వాకృత్తురె, కాఁపుల నిను వంటివారిఁ గానవె తులువా. 467

క. అని కలసి పులుకపులుకున, దనుజూడం జూడఁబట్టి తన్నుం గొట్టెన్
దనివిసనఁ దిట్టె ననలుం, గొనబుగ రొద మగని దెగనిక్కొండాటమునన్. 468

ఉ. కావర మెత్తి యిట్లు తనుఁ గాత్రియఁ బెట్టుచు నున్నదాని ని
చ్ఛావతిఁ జూచి లేచి రభసంబున రెడ్డవపల్కె నోసి నీ
చేవ యెఱింగి కాదె మును జెప్పక గుంజిలి పెట్టియుంటి నీ
వే పఱదన్న వేఁడుకొనవే మఱియేనయి చెప్పినాఁడనే. 469

క. నాతోడని నన్నడుగుట, యీతెగు దెంపునకు మగిసె నిఁక నేమనుచున్
రాతిగొడు కతఁడు పాలసం, జాతకిణాశ్మాతికఠినశయమునఁ జఱిచెన్. 470

వ. ఇట్లు వ్రేటుపడి దండతాడితభుజంగియుంబోలె నమ్మోహనాంగి నింగిముట్టినయలు
కం బట్టిన సికవీడి నిలువంబడి యిలువెలువడి. 471

క. అడికలం బడితినో అం,కాడితినో యిల్లు ముంగిలననో తలితోఁ
గూడననో నీళ్లననో, కూడునె యిల్లాలి నన్నుఁ గొట్టం దిట్టన్. 472

క. విరసమునఁ గొట్టుపడి నా,సరిగరితలలోన బ్రతుక సైఁతునె మఱినే
నురిఁ బోదు త్రాటఁ బోదున్, ధరియింతునె సైఁపు మింతదడ విన్పోటన్.

క. ననుఁ గన్నతల్లి ప్రజలకు, వినిపించినపిదప ననుచు వెసఁ బుట్టిల్లం
దునికి యటకేగు కైతవ,మున నుపవల్లభునినికటమున కదిపోయెన్. 474

క. ఏతెంచి నిర్భరుద్ధ, ప్రీతి న్మణిమంతుఁ గ్రుచ్చి బిగికౌఁగిటవ్వా
జ్జాతపృథుప్రథనంబున, శాతోదరి పెనఁగె రెండుజాములవ్వేళన్. 675

క. విసువక చనుమొనకెడున,ప్పసిపాఁపఁడు తల్లి దాఁపుఁ బాయుటఁ గడువె
(క్కసమున నాఁకలి గొని తా,) నసురుసురై చెవులు గింద్రమున వాపోయెన్.

వ. అయ్యేడ్పు విని యుపపతికి నయ్యువతి యిట్లనియె. 477

చ. అడలెడుఁ జంటిపాఁపఁ డదె యాఁకొని వానికి నేను జన్నుబా
లిడి చనుదెంతు నింటిమగఁ డింతయెఱుంగకయుండ నీవు నా
యొడన వసించి యేమినిను వేడ్చెదు రెడ్డన నాకుఁ దెల్పుమం
చడుగు మతండు చంటికొఱకై యని నిక్కువ మొప్పఁ జెప్పెదన్. 478

ఉ. చెప్పినఁ దల్లి యొందరిగెఁ జిన్నికుమారుని డించి సర్వముం
జెప్పఁగదయ్య యివ్విధము చిత్రము నాకని వేఁడు మాతఁ డి
ట్లొప్పనిమోముతో నను దురుక్తులఁ బల్కుచు మంకుబుద్ధి యే
తప్పునులేమి నిల్వెడలి తల్లిగృహంబున కేగె నంతగన్. 479

క. నావిని మాయాతనితో, నీవను నుతు విడిచిపోయెనే యకటా నీ
దేవియుఁ బుట్టింటికి న,య్యో వ్యాపలదని మాన్ప కొట్టులుండితి విచటన్. 480

ఉ. ఐన నిఁకేమి సేయఁగల మాకట నేఁడ్చు కుమారుఁ బట్టి తె
ట్లీని కిరోసరించి నిలు మాపు మదీయవధూటి వచ్చి నీ
కానక కన్నపట్టి కిదుఁ గాని ఘనస్తనదుగ్ధ మంచు స
స్నాన మెలర్ప వాఁడు మనుమానవములే కతఁ డోసరించినన్. 481

వ. పంతంబు చెల్లించుకొనుదాన నని చెప్పిన మణిమంతుం డమ్మాటలు కాఁపుకొడుకున కెఱింగించె నెఱింగించిన. 482

ఉ. ఉండెదఁ జెప్పినట్లు విలుపోపనియాఁకట నేడ్చి యేడ్చి య
క్కుండిననంటిపాఁపఁ డిపుడేమగునో మతిలేరు బిడ్డ లో
కృం డిది వీఁడు నాకొడుకు గాఁడు భవత్తనయుండు సత్కృపా
మండన వీనిఁ బ్రోచికొనుమా యని హాలికుఁ డోసరించినన్. 483

క. అప్పలువచెలువ జారుని, దుప్పటిముసు కలవరించి తోరపుమురిపం
బుప్పతిలఁ గులుకునడలం, జొప్పేర్పడకుండ దనశిశువుకడ కరిగెన్. 484

తే. అరిగి పెరిగినయాఁకట నతిచి యతిచి, యేడ్చు విడువనితనపట్టి నెత్తి పట్టి
కులికి చన్నిచ్చి పొత్తిపొత్తుల నమర్చి, మగనికెంగేలఁ జెనకి యమ్మగువ వెడలె.

క. అలరితనమున లీలం, గేలం దనుఁ జెనకి చనినగిరికుచ తనయి
ల్లాలని తెలియక పరుని, ల్లాలని యారెడ్డిబిడ్డఁ డడరు విరాళిన్. 486

శా. రావే నల్లనిగుమ్మ నీవనుచు నారాటంబునన్ రెడ్డి నా
నావిభ్రాంతులఁ గుబ్బతిల్లు నెడ వోన స్నీనకేతుండు కీ
ళ్ళావై చెం గొలకచ్చులం బొడిచెఁ గాలం గేల మర్దించె నా
పోప న్నమ్మెటఁ గొట్టెఁ దిట్టెఁ జిఱునిప్పు ల్రాల్చె నేత్రంబులన్. 487

క. చేసెడువలరాయనికై, కాసములకుఁ గాక జడిసెఁ గాపుంగొడు కా
లో నుదతిఁ దెచ్చుటకు ని, ద్రాసక్తుని మీఁటెఁ జన్నుద్రావెడుకొడుకున్. 488

క. మీటుటయు మిట్టిపడి య,చ్చోట న్రుధిరంబు గ్రమ్మ స్రుక్కుచు నోడ లా
రాటపడఁ జంటిపాపఁడు, కాటుకకన్నీరుదొరఁగఁ గావున నేడ్చెన్. 489

వ. అయ్యేడుపు విని యిచ్చాపతి యుపపతి కిట్లనియె. 490

క. కొడుకుం గుట్టకుఁ జనుబా, లిడి నీతో రతులఁ బెనఁగ నేతెంచుచు నా
కడకేలం దాఁకించితి, గడుదెబ్బకపుట్టి పొఱలఁ గా మారెడ్డిన్. 491

చ. తమకముపుట్టి నేఁ డదికతంబున రెడ్డన నిద్రఁబోవుతేఁ
గొమరుని నేడిపించె నదిగో తిరుగంబడి చన్నొసంగి ర
మ్మె మకల నందు వన్నుటకుఁ బొమ్మని నీవనుపం దృఢానురా
గమునఁ బ్రియుంబుఁ జెప్పి నవు గౌఁగిటఁ జేర్చి సుఖించుదానికిన్. 492

శా. పోరం బోచ్చెఁగదయ్య యాఁకటికి నీపుత్రుం డరో యింటికిం
రారాదా కడిపాని యిట్లలముం గాఁబట్టఁగా వచ్చునే
దూరక్షోణి వసింపు చన్నొసఁగఁబుత్తుం గూర్మి నిల్లాల నీ
కూరిన్ లోపలికంచుఁ బల్కు మతఁడుండుం గొంది నంచాడినన్ 493

క. కలితనమునఁ జని యలనా, పలుకుం బంతంబు చెల్లుబడిగా రేడ్డిన్
గలసి యొకముదుపుఁ గైకొని, పిలిచిన నీకిత్తు నేరెపెట్టుదు మగనిన్ 494

వ. అని యుప్పు డప్పసాని మణిమంతుం దతిమిన నతం డది పలుకుమన్నట్లు పలికె
నమ్మాటలు విని కర్షకుం డుత్కర్షింపుచు నిట్లనియె. 495

క. ఎడగలుగ నుండెఁ దనమే, న్వడకొడు మఱపనులవంటి వారము చనుబా
లిడుఁగాని పుణ్యమయ్యెడు, విడనాడక యిటుకుఁ బనుపవే యిల్లాలిన్. 496

క. నావానిమాటలకు లో,లో వెడవెడ నగుచు నింటిలోపలి కలయి
చ్చావతి పోయెం బోయినఁ, గోవరపుంప్రేమఁ గాఁపుకొడుకవ్వేళన్. 497

ఉ. కేలగలించిపట్టి కతికిం బిలుబీకులుసేయ లోనుగా
కాలరిజంత నేఁజెడితి నమ్మక సిగ్గులవాఁడవౌదు నీ
యాలనె వింతదాన మగనాల నరో తెకతేఱ నన్నుఁ ద్రా
ల్మాలుపఁ జూచెదో తెగర మామగవార లెఱింగిరేనియున్. 498

ఉ. మేనికిఁ జేటుగాదె పులిమీసల నుయ్యెలలూఁగ మాను నేఁ
గానటువంటిదానఁ గొఱగానిపను ల్దలమీఁదవచ్చునే
రానిఁకఁజాలుఁ జే విడువరా యని సూత్త్రరసంబున న్సతో
జానన పల్కెన్ వాలికఁ దాజగతాఁగకుఁ బ్రీతి నిట్లనెన్. 499

క. ఇటువంటిదాన వేలా, చిటిపొటికేం గేల నన్నుఁ జెనకితి నినుబా
యుట ప్రాణంబులఁ బాయుట, కుటిలాలక కరుణలేదకో యిట్లాడన్. 500

క. అని బాఁతిఁబాఁతిపెట్టిన, పెనుబ్రాతవరాలసోలఁ బెకలించి ఘన
స్తన కిచ్చి త్రుచ్చి కౌఁగిట, నెనయించెం బంచబాణుఁ డెసకొల్పంగన్. 501

క. అది యాత్తెఱఁగున నతనిన్, గదియంబడనిచ్చి వెఱపుగలదానిగతిన్
గుదులుకొను నేలబుసకో, ట్టైద యను నేనెట్లుచేపడితి నను నడలున్. 502

క. పోవలె వడిగా వడిగా, శేవయ్యా ప్రక్కలోన శేకుంటే నేఁ
గావఁడు మగఁడని యలయు, చ్చానతి కర్షకునిఁ ద్రోచెఁ జడికిలబడఁగన్. 503

వ. కరపాతంబుకంటె మున్నుగా లేచి యప్పలువచెలువ [illegible] కన్నులసొం[illegible] పాముతింపఁ
జని విత్తమిచ్చి పంతంబు చెల్లెఁగదా యని జారుని నవశరంబునం జతిచి దక్కలి

గింతపెట్టె నప్పుడు చతుర్ఘటికావశేషంబుగా రాత్రి చనియె దిక్కులు ప్రకాశ ప్రతతిం బొందెఁ బిచ్చుకలు పిచపిచ మనియెఁ గాకంబులు గూకలిడియె దధిమథనఘుమఘుమధ్వానంబులు నెరసె గోవత్సకోలాహలంబులు వినవయ్యె నయ్యెడ గృహంబు వెడలి పెరటు చొచ్చి వచ్చుటకు విహారభద్రుండు పోయినఁ గనువేచుకునియుండె. 504

క. అప్పు డిచ్ఛాపతి యచ్చో, నుపవల్లభు నిలువఁబనిచి యొంటక యిలుసొ
చ్చి పాడవుగల మచ్చుపయిం, గపటవ్యాపార మమరఁగాఁ గూర్చుండెన్. 505

క. వాలికుం డాలోపల లో,పలికిం జను దంచి మచ్చుపైఁ దనయిల్లాల్
నిలిచినతెఱఁ గెఱుఁగక యప్పు, డిలువెడలినబుద్ధి నిశ్చయించి కనలుచోన్. 506

ఉ. ఈలువు వంగడంబు గల దీజవరాలని యేలి రొక్కరో
క్కాలిడి యొట్టిలంకు తడక న్వరియించితి దీని నక్కటా
చాలు సహింప దీచెనఁటిసంగతి యొండొకమాయపన్నియో
యాలరిజంతఁ జంపి సుఖినై యొకదిక్కునఁ బెండ్లియాడెదన్. 507

వ. అని వాలిమ్ముని యాడుగఱచి మీసంబులు దీటుచుండ నయ్యండజయాన మచ్చు
డిగ్గి నుతికి యెదుర నిలువంబడి యిట్లనియె. 508

ఉ. ఈలువు వంగడంబు గలదే మనుబోంట్లకు నీకుఁగాక రో
క్కాలిడి యొట్టిలంకుతడక న్వరియించుట రోఁతగాదె నీ
కేలసహింతు నన్ను మడియింపు మొకానొకచోటఁ బెండ్లిఁగ
మ్మాలనె నీకు నేఁ దగుదునా చను నీ కిటులాడ నిచ్చలున్. 509

ఉ. నిక్కము రెడ్డిబిడ్డవని నిన్మది నమ్మి గృహంబుఁ జేరి యీ
దిక్కున నున్నశూద్రసుదతి న్మనుపిచ్చి రమించినాఁడ వి
త్తెక్కలిలంకు నాకుఁ గలదే యని ముందలఁ బట్టి యీడ్చి యా
రక్కసదన్ను మక్కు చెదరం జరణంబున వాని నెవ్వడిన్. 510

ఉ. తన్నిన వాఁడు తచ్ఛరణతామరసంబుల వ్రాలి నిన్ను నే
మన్నది లేదు నావలన నన్నియు నేరము లోర్చుకొమ్ము నా
పిన్నతనం బొకళ్లచెవిఁ బెట్టకు పెట్టిన సిగ్గుపోవు నా
పన్నియ యన్న మా నగరివారికి దండుగఁ బెట్టని మ్మగున్. 511

క. చెలువకును కాఁపురంబని, పతిపరి యగుతాల్మి నట్లు ప్రార్థింపంగాఁ
గులఁగట నేగుచుఁ దలవరు, లరిమురికఠ్ఠకునిమాట లాలించి తగన్. 512

క. గిలుకలువైచిన గుదియలు, ఘుఘుఘుల్లున నూఁదికొనుచుఁ గదిసెం జని యా
వాలికునిఁ గొని చని ఘనతన్, తలవల్లభు మ్రోల నిలుపఁ దప్పేర్పడఁగన్. 513

క. నరపతి దండుగఁ గొని యా,ప్పురి వెడలం గొట్టె నపుడు భువనచరాదు
ల్పరియాలగు నీకు నుదా, హరణం బిది యనుచు వానరాగ్రణి చెప్పెన్. 514

వ. చెప్పి వెండియు బహుమానుండు. 515

క కులువా నీయిల్లాల,య్యాలి వేణికిఁ దోడుబోయినది దానిమ్మపో
ల్తులకుఁ దెగఁజూచితివి నీ,తలద్రివ్వను బొలిసిపోయెదవు తరువాతన్. 516

క. చేపడినసొమ్ము నూరం,బై పోయె న్మోసమయ్యె నని యంతస్సం
తాపమునఁ బొక్కెఁ పొలకు, మీపాటిం బొమ్మ చాలు నింటికిఁ గ్రకచా. 517

క క్రౌంచామూఢుని నిను దక్కించుట యన నెంత సింధుకీలాలమునన్
వంచింపఁబడదె మున్నొక,వంచక మఖిజాతకనుతవల్లభుచేతన్. 518

క. నావిని కాననచరగో, త్రావరు నీక్షించి పలికెఁ గ్రకచుఁడు నయవి
ద్యావైభవగుణసుభగం, భావుక వివరింపు మాయుపాఖ్యానంబున్. 5 9

ఆ. కుటిలుఁ డప్రయోజకుఁడు వీఁడు వీనితో, నేటిజోలి నన్నుబోఁటి కనక
వివరపుట్టఁజెప్పవే నిష్కళంకస్వ,భావ నాపుఁ డలరి ప్లవగవిభుఁడు 520

వ క్రకచునకు నక్కథఁ జెప్పందొణంగె. 521

సీ. కలిగొట్టు మోఁదుగు కానుఁగు గలుగువావిలి మేడి నేరేడు సెలసు బలుసు
మర్రి మంకెన మద్ది మారేడు బూరుగు గోరంట లొద్దుగు క్రోవి రావి
జాల్వి మామిడి జీడి కుసుగుడు మొలఁగుపాపట చంద్ర పసిరిక పాల రేల
పొన్న బొట్టుగు పోఁక పొగడ దాడిమ మిప్ప గుముడందు గురువింద గోను రేను
తే. చిల్ల చింత మొగలి చీకిరే ణుాడుగ, నిమ్మ తమ్మ తుమకి నెమ్మి జమ్మి
వేగి వేము మొదలుగాఁ గలమ్రాకుల,కాన నగుచు నొక్కకాన మెఱయు. 522

వ. కరపుటికాంతరాళచులుకక్రమణాయితసింధుసర్వతః
పరివృతకృత్ప్రరోదములు వానిన దర్ఘటజాన్యపాణిజ
రఘరితములై నభోగతికిఁ జాలక పల్వలము ల్భజించె నాఁ
గర మలరు న్సమగ్రబలకాయము లవ్వనికొలులాయముల్. 523

ఉ. ఆహృతజంతుభీషణబలాభ్యుదయాప్తి గుహాసురక్తి గో
త్రాహితవృత్తి వజ్రకఠినాతిశయాకృతి శౌర్యగర్వరే
ఖాహమికం బ్రసిద్ధరుధిరామృతపారణజంభదానవో
త్సాహవిఘూర్ణితచందమునఁ దద్గహనంబునఁ గ్రాలుబెబ్బులుల్. 524

మ చరణప్రాంతచరిష్ణువు ల్నిరుపమోచ్చస్థానసంక్రీడన
స్ఫురణం జన్మఘనత్వమంద నరుదెంచుం గీడు మీ కంచు ను

త్సరబుద్ధిం బలెఁ జిందుమేఘముల దంతత్రోటికోటిం జలా
హరణారంభణజృంభణంబులు దదీయవ్యాళశుండాలముల్. 525

మ. తనరస్ముల్కవిసంభవాండభువనధ్వాంతచ్ఛిదాచంచువు
ల్వినఁజెప్ప న్వేఱఁ గేమహాతిమిరపాళి న్వచ్చిపోఁ దోలఁగే
భని రథ్యోత్థరజోదరస్తిమితదీక్షాభోగుఁడై హేళిగ
న్గాన నగ్ఘోరతరాటవి న్మనువెలుంగు ల్గుంపులై వేసవిన్. 526

శా. పైపైఁ బ్రాణివధప్రధానగుణ మొప్పం గారగారద్యుతుల్
దీపింప న్విషమాంబరభ్రమిఁ బ్రభీతిం జేయ నత్యుత్కటా
టోపం బుగ్రగజాహృతివ్యసనకండూలంబు గా నుండుగుం
పై పంచాస్యము లయ్యరణ్యమునఁ బంచాస్యప్రకారంబునన్. 527

శా. క్రందై వెల్వడు ఘుర్ఘురధ్వనిమృదంగస్థాయి గాఁ దాలుని
ష్యందస్థూలవిశాలలాలసవరంబై యొప్పుశృంగోద్ధతిం
జిందుల్ ద్రొక్కఁ గుడుంగరంగముల నిస్సీమత్వరాతిభ్రమిం
బందుల్ దిఙ్మృగయుచ్ఛిదాగుణపరిస్పందుల్ దదుగ్రాటవిన్. 528

క. అలఘుతరవారిధారా, దళితప్రతికూల సకలధరణీభృత్సం
కులమై యొకసెలయే ఱ, ప్పొలమున జగదేకవీరుపోలిక నమరున్. 529

వ. అది రామలక్ష్మణాలంకృతంబై పంచవటస్థానంబును సత్వసంపన్నంబై సమీరణంబును గజగవయవిహారయోగ్యంబై కిష్కింధానగరంబును సుపానీతపరమహంసంబై వేదాంతశాస్త్రంబును నఖండశబ్దక్రియానిరూపణంబై వ్యాకరణంబును బ్రబోధితనిగమజాలంబై ధర్మంబును ఘనరసప్రధానంబై విద్వత్ప్రబంధంబు ననుకరించిన యమ్మహాప్రవాహంబున. 530

క. నీతికళానిధిగలఁ డభి,జాతుం డనుకమరవిభుఁడు సంతతపంక
స్థాతృత నొందియు నద్భుత, మాతం డేవంకఁ బంక మంటక తిరుగున్. 531

శా. ఆతాఁ బే లోకనాఁటిరేయి ధరణీవ్యాపారలిప్సాపరం
బై తానంబులఁ బాసి తీరశరతృణ్యావీథుల న్నిల్వ భూ
జాతచ్ఛాయలశీతలానిలకృతాంచద్వాలుకాలేఖికా
ప్రాతాభ్యక్రముల న్విశృంఖలగతి న్వర్తించె వర్తింపఁగన్. 532

చ. అతిమతి చిమ్చి నాఁ బొగులు నాఁకట బ్రుంగుడువంగుడై యొడల్
సుఱసుఱ స్రుక్క నయ్యడవిలో నొకనక్క తటస్ఫుటంబులన్
బొటియలఁ దోఁకఁ జొన్పి వెలిభూమికిఁ దార్చిన యొండ్రితండముల్
గొఱుకుచు వచ్చి వచ్చి యలకూర్మముఁ గాంచి ప్రహృష్టచిత్తమై. 533

క. ఘనరభసంబునఁ గదియుచు, జనునప్పు డక్కుమతవిభుఁడు స్వగతంబున ని
ట్లని తలఁచె నిప్ప్రిమాదుఁడ, వనియుండుదు సేఁటితుదకు నది బొంకయ్యెన్ 534

ఆ సకలదుష్టజంతుసంక్రాంతజలదుర్గ, సీమనుండు వెట్టచెట్టలేక
చెడుగుఁబాము గాముచేఁ బెద్దమీనుచే, నీరుకుక్కచేత నెగడుచేత, 535

ఆ. గొయ్యపుర్వు గ్రొవ్వి రోధోవనుంపగ, కగసి తెగినపగిది నిట్టులేల
జంతువంబు విడిచి చనుదెంచి నా బుద్ధి,పుర్వుమేయఁ బెట్ట బొందఁ గంటి. 536

క కాలంబు దాఁట నెవ్వరు, చాలఁగు రని వగచి విరసాదవిషాద
జ్వాలం దూలి కబంధచ, రాలంకరణంబు వపురుపాహితకంబై. 537

క. రాతింబలె నతినిశ్చల,రీతి న్నిలుచుటయుఁ గని గరీయఃక్షుద్బా
ధాతురక్షళంబు జంబుక, మాతతదంష్ట్రికలఁ గచ్ఛపాగ్రణిఁ బట్టెన్. 538

క. పొదివి తెకతేఁటఁ గలిగెం, గద నాకీకమ్మతేనెకరుఁడని దానిన్
దుదకోఱలు కోరలుపోఁ, గొదలే కటునిటుఁ బొరల్చి కొఱుకుచు నుండెన్. 539

క. విఱుగుట గానక నెరయం దఱతఱకలు నాఁటఁ గొంతదడ వది గొఱికెన్
గొఱికిన నొగులదు పగులదు, చిఱుమొఱకలు పోయెఁ బుల్లసిలె దంతంబుల్. 540

వ. ఇట్లు మృగధూర్తదశనదంశనసిర్వ్యాకలితమర్మంబై యకూర్మంబు తనలో
నిట్లని వితర్కించె. 541

చ. జరుగదు రోసి పో విడువఁజాలదు వేసటలేక కోఱలం
గొఱికెడు దీనికేమితుద గోరము వాటిలె నాయుపాయ మం
దఱుఁ గొనియాడ నిచ్చెనఁటినక్క దటాలునఁ దక్కఁ బెట్టి యే
మఱక ననశ్వరం బయినమగ్నడఁ గాంచెద నీరుసొచ్చెదన్. 542

క. అని నిశ్చయించి ధీర,త్వనిరూఢుం డగుచుఁ గమఠవరుఁ డానక్కన్
గనుఁగొని యిట్లను నేలా,తను వ్యయ మల్లిపోయెదవు పిసవెత్తెన్. 543

క మఱవక యేఁడులుఁ బూఁడులు, గొఱికిన నాయొడలు మృదువగునె నీకేలా
వెరవిడిచందము పుట్టెన్, దరిదీనికి వెరవుఁ జెప్పెద న్వినుమర్థిన్. 544

క. నానకమృదుమార్గమునకు, రానేరదు మేన నీచరణ మనఘా నా
పై నునిచి యేతిదంబు, స్థానములోఁ బెట్టి కొంతదడ వట్లయినన్. 545

క. చెన్నార నపుడు చేసిన, వెన్నవలె మెత్తనగుదు విపులపసాసం
పన్నము నుమ్మీ తను వాఁ, కొన్నమహోత్సవకు నీకు గుడుపఁగవచ్చున్. 546

క. తనివిసవఁ దినకపోవని, మనమునఁ దలపోసి రోసి మనుగడపై నీ
కనువైనవెరవుఁ జెప్పితి, నని కూర్మప్రవరుఁ డాడె నట్లాడుటయున్. 547

వ. అప్పలుకులు సిద్ధాంతీకరించి యావంచకం బట్లచేసెఁ జేసి ముహూర్తమాత్ర మూ
రకుండి యయ్యభిజాతున కిట్లనియె 548

క. తడవయ్యె నీటిలో ని, న్నిడి మే చేమైన నానెనే తనివిసనన్
గుడువవలె నిజముఁ జెపుమా, జడియక నీ వనిన వారిసత్వము తనలోన్ 549

క. ఈవంచకంబు నామా, యావాగురఁ జిక్కి దక్కి నసుపంచకమున్
చావిర్భూతోత్కలికా, ప్రావృతమై యపుడు కచ్ఛపం బిట్లనియెన్. 550

క. అనుమోదక మంటఁగ నా, నె సమృద్ధము లంగకములు నీపాదము క్రిం
దిసుమంతనాన దెవ్విధి, మెసవెదు నీవంటి కిట్లు మృదువై యుండున్. 551

క. మెత్తనగుఁగాని శీఘ్రము, గుత్తముగా వెన్ను ద్రొక్కకొనియున్న పదం
బెత్తుము నీరంటఁగవలెఁ, జిత్తము సుఖపారణావశీకరమైనన్. 552

క. పోఁగుఁగఁబో యీ వాఁకట, జాగేమిటికంచుఁ బలుక సంతుద్బాధా
జాగరణబుద్ధి జంబుక, మాగోచరమాట నిశ్చయము పొమ్మనుచున్. 553

క. పై దారుణముగ నూఁదిన, పాదము దివియుటయు గచ్ఛపము సంతోష
ప్రాదుర్భావప్రాప్తము, హాదంచద్వేగ మగుచు నురువడిఁ బఱచెన్. 554

క. క్రకచా యీచాదృవనన, క్కసు మోసము గల్గియుండఁగా మఱి నినుబోఁ
టికిఁ దగులు బెంత యని కీ, శకులాగ్రణి చెప్పి మఱియుఁ జలచరుఁ బలికెన్.

క. వెడమాయ నక్క మాటల, కడవికిఁ జని తిరిగి వచ్చి యప్పటియుం దా
నడవిఁ బడి బడుగుహరిచేఁ, గడతేఱినగర్దభమ్ము గాఁ జూమ్ము శఠా. 556

క. అనినవిని శింశుమారుఁడు, వనచరు నీక్షించి యింత వాఁడవు గాకుం
డిన మదిసి ముప్పాదనుకా, మనుదే యిది తెలియఁబలుకుమా వినవలతున్. 557

వ. అని యడిగిన బహుమానుండు. 558

సీ. కల దొకదుర్గాంతకాంతార మరవిందబంధుఘృణ్యంతర్ధిపాదపంబు
దీర్ఘదంష్ట్రాభిఖ్యఁ దేజరిల్లుమహోగ్రసింహ మవ్వే నివసించియుండు
దానికి ఘటకాభిధానజంబుక మొకం డుహారహం బాప్తకృత్యము లొనర్చు
చట్లు కొండొకకాల మరిగినఁ గర్మానుకూలత నసదృత్తసుకుక్షిరోగ

తే. మసృణతరవేదనాకంపమాన మగుచు, వెగ్గలంబైనధృతి జారి యగ్గజారి
పొఱలు నాపోవు నలమరుఁ బొక్కు స్రుక్కు, బోరగిలఁబడు నిట్టూరుపులు నిగుడ్చు.

క. ఈరీతిఁ గడుపునొప్పిం, గూరార్తిని యుండికి గోఁడు గుడుచుచు నుండా
లారి యొకనాఁడు నిజర, క్షారసంఘట్టకఘటకుఁ గనుఁగొని పలికెన్. 560

చ. తినదెసఁ జూచినాఁడవకదా ఘటకా కటకాంతభూమికిం
జని యితగోపనం బమరఁ జంపి శరీరము తెచ్చి లోపలం

గనుఁగొనవైన గర్దభముకందనగాయ గ్రహించి తెచ్చి యి

[illegible] నిలుపుపానిపోఁ జలిదిఁ జేకొని యుండెడు జీవితంబులన్. 561

చ. తడవునఁ జత్తుఁ బొమ్మనినఁ దచ్ఛరణంబుల సమ్మదంబునం

బడిపడి లేచి యప్పనికిఁ బొల్పడి జంబుక మేగి యొక్కచో

గడుకృశమైనదాని నొకగర్దభముం గని చేరి యిట్లనున్

బడలితి వేల రాసభ శుభంబగు నాకతఁగింపవే యనన్. 562

వ. గర్దభంబు జంబుకంబున కిట్లనియె. 563

క. చాకలవాని కధీనమనై కోకలు మోసి తెత్తు నాపణవీథి

వ్యాకీర్ణ ప్రీహిఁ కుష, స్వీకృతి మేన్ బ్రోతు నెట్లు చిక్కకయుండున్. 564

క. కానఁ గనని పాపకర్ముఁడు, తను నాహారాధి విధులఁ దనుపఁడు మేయన్

జననీఁడు కాలుగట్టు, న్మనుటయుఁ జచ్చుటయుఁ గాదు మద్విధ ఘనఘా. 565

ఉత్సా. మేను పొందుగాదు లేదు మేఁత సౌఖ్య మక్కటా

కైనవానిచేతి పేనుచందమైతి నంచు న

త్యూనసంబుతోడనున్న వార్త లేని నెయ్యమున్

గావరాఁ జెనంటి జంబుకంబు దాని కిట్లనెన్. 566

మత్తకోకిల. కాఁక గుంటివి గావు భీఁకువు గావు గర్దభముఖ్య ని

కేలయి ద్విధి నెవ్వచేఁ గృశియింపఁబోదము రమ్ము మ

త్కేళికాననశాద్వలంబులఁ గ్రీడసల్పఁగ మర్త్యసే

వాలఘుత్వము చాలు నీకు నవారివారితృణావళుల్. 567

క. అని చెలువు గులుకుపలుకుల, మనమూటించుటయుఁ దేటి మనజానధీనం

బున నున్కి కష్ట మని ఖర, మనయంబై నక్కబడి మహాటవి కరిగెన్. 568

క. అరిగినఁ బరిచితపటసం, భరమున్ ఖరము న్వమున్తబలగర్దభశే

ఖరముం గురవము ఖరమున్, హరిపాలం బెట్టె నక్క యుక్కటికమునన్. 569

క. నెతిసరిగ దానిపైఁ బడి, కఱపన్ లాఘవము లేమి గాళ్ళదుచ్చము న

ద్యఱుపం గదిసిన నత్తెఱఁ, గెఱఁగి ఖరం బదరి తిరిగి యేగుచు నుండెన్. 570

క. గుసుకొత్తుచున్నగాడిద, గనుఁగొని సింహంబు వలికె ఘటకునితో నీ

చనుఖరము దరిమికొన నా, తనువున వడిలేదు తెమ్ము దగ్గఱఁజేరన్. 571

చ. చనుమున పట్లకాక యని జంబుక మప్పుడు గర్దభంబుఁ జే

ర వరిగి యేలపోయెద కటా వసనంబుల మోవ బస్తుఁగన్

పనరఁగ వేడ్క యయ్యెడినొ వల్దిటువంటికుబుద్ధు లిప్పనం

బునఁ గొన మేఁపు నీళ్లు గఱవో పతిమన్నన నీకుఁ జాలదో. 572

వ. తమ్మునిన గర్దభంబు జంబుకంబున కిట్లనియె. 573

క. కేసరివధ కుద్యోగముఁ, జేసిన నగ్గమక మెఱిఁగి చెలికాఁడా సం
త్రాసమునఁ దలఁగి వచ్చితి, గాసిలి ప్రాణములు తీఁపుగా యెవ్వరికిన్. 574

క. నావిని ఘటకుం డనుఁ దగ,వా వెరవఁగ నధిపుఁ డట్టివాఁడా నిను సం
భావించుట కిట్లోరయం,గా వచ్చుట యిందుకేల గళవళమందన్. 575

చ. రవరవ గ్రొత్తక్రొత్త యగుటం జనియించెను నీవు నేఁడు రే
పవుటయు మమ్ము మీరఁ జనునంతయు నీయెడ కొంక నేల ర
మ్మవసర మిప్పు డంచుఁ జను నాఖరను న్మరలించి తెచ్చి గా
రవగుణ మెక్క నక్క మృగరాణ్ణికటంబున బెట్టెఁబెట్టినన్. 576

తే. కలుకలుకునఁ గుత్తుకఁ గఱచి విఱచి, నక్క నక్కఁజేరి కుండాలవైరి
గర్దభము కుక్షిభేదించి కర్ణహృదయ, ముదయు దాహ్లాదమున దివ్య మోపననక.

వ. ఏను సెలయేటిజలంబు లానివచ్చెద నని చెప్పి యాడు గామడగా నరిగిన. 578

సీ. ఖరశరీరము విప్పుగా గొప్పలగుదంతకుంతసంఘంబులఁ గ్రుచ్చి క్రుచ్చి
మృగధూర్త మాకర్ణహృదయంబు భేదించి యది యనర్ఘ్యం బగు టెఱిఁగి కాడ
యతుఃరంహము సింహ మాశించె భక్షింప నత్యాజ్య మివ్వస్తు వనుచుఁ దాన
భక్షించి పరిశుద్ధుపగిది నూరకయుండె నపుడు కంఠీరవ మరుగుదెంచి
తే. కొనవలయు నౌషధంబు దెమ్మనినఁ గొంకు, కొసరుతే కది పలికె నోకుంభివైరి
గర్దభాకారమున లేదు కర్ణహృదయ, మదియ కలిగిన నిన్నేల కదియవచ్చు. 579

సీ. అని నక్క తక్క కిట్లాడుమాటలు యథార్థీకరించి యాదల్పఁ దెరువులేమి
నుడిగెఁ గేసరి యూరకుండెన ట్లావంచకము మహాకపటవాక్యములు నమ్మి
గహనమండలి సొచ్చి క్రమ్మఱ మఱియు నేతెంచి దుర్వ్యాధితద్విరదవైరిఁ
జేరి తద్దంష్ట్రిలదారినఖరముగాఁ దలఁపకు నన్నని బలిముఖుండు
తే. పలుక నేమియు ననక యజ్జలచరుండు, లబ్ధనాశవ్యథాజాతలఘుగుణేత
రావిలపిపాస దీఱ నీ రానిచనియె, నద్భుతత్వరతోడ నిల్లాలిఁ జూడ. 580

క. అని విష్ణుశర్ముఁ డాదర,మునఁ జెప్పినరాజసుతులు ముదమున గురునిన్
గనుఁగొని పంచమతంత్రం, బనఘా మాతోడఁ జెప్పుమని యడుగుటయున్. 581

మ. అతి హృద్బోద్ధ్రిపమోహ భక్తినతదివ్యవ్యూహ విధ్యూర్జిత
క్రతుపుంజార్చితపాద వర్ధితపటుప్రహ్లాద పుణ్యవ్రతా
యతనాథ్వన్య జగత్త్రయీభరణవిద్యాధన్య త్రయ్యంతకీ
ర్తితపీతాంబర కృత్తిధారణశుగాధివ్యాధినిర్వారణా. 582

క. ఆదృతశుకముక్తిమహా, పాదపకిసలాయమానపదయుగనానా
వేదశిరఃప్రకరస్తుత, సాదరవ్యాపారదీనజనమందారా. 583

మాలిని. హరిముఖసురమౌళిన్యస్తపాదాంబుజాతా
పరహితరతధామప్రాంతయుక్పారిజాతా
పరుషతరవిలోకప్రాంశుధూతారిజాతా
చరణశరణరక్షాజాగరూకైకచేతా. 584

గద్య. ఇది శ్రీవేంకటనాథ కరుణాలబ్ధసరససాహిత్యనిత్యకవితావిలాస సకలసుకవిస్తుతిభాషణోల్లాస రాజకులపారావారపర్వశర్వరీరమణ నీతిశాస్త్రమార్గపరిశ్రమణ ధైర్యపర్యాయధిక్కృతనీహారపర్వతరాజకుమార విస్సహాయప్రబంధనిర్మాణ భోజ భూదార సుధామధుర భారతీసనాథ వేంకటనాథప్రణీతం బైన పంచతంత్రంబున లబ్ధనాశం బన్నది చతుర్థాశ్వాసము.

---

వ. సక్తుచూర్ణపాండురాకృతుండును విషాదవిహ్వలుండును నయ్యె నిది మనోరథరాజ్యపాలనఫలం బని చెప్పి యప్పల్లవాధర సుముహూర్తంబునఁ గుమారుం గాంచి పంచమదివసంబున. 19

క. అత్తలలేనికుమారునిఁ, బొత్తులలో నునిచి కూర్చిఁ బురుషుని రక్షా
వృత్తికి నియమించి ధరా, భృత్తులితోరోజ జననిగృహమున కరిగెన్. 20

క. ఆలోఁ బెంపుడునకులము, బాలునకుం గాపువెట్టి బ్రాహ్మణుఁడు నికే
తాళిందమునకుఁ జనియెం, గాలోరగ మపుడు బిలముఖము వెలువడుచున్. 21

క. అలభూమిసురతనూభవు, తలిమంబునఁ బఱచి నూర్జితక్రోధసమా
కులమై నకులము చీఱుచున్, బలువాతన్ గఱచి ద్రుంచి పాఱగవైచెన్. 22

ఉ. ఆసమయంబున న్మహీసురాగ్రణి పుత్త్రుఁ దలంచి గాఢసం
త్రాసము పేర్మి లోఁగిటికి గ్రమ్మర వచ్చుచు నుండఁ జూచి యు
ల్లాసరసం బెలర్ప నకులంబు ఫణిస్రవదస్రపంకసం
భాసితవక్త్రమై యెదురఁ బర్వి పదాబ్జములం బెనంగినన్. 23

చ. ప్రకటభుజంగమక్షతజపంకవిలిప్తముఖంబు నయ్యహో
నకులముఁ జూచి భూమిసురుఁ డాహతభీతపరీతచిత్తుఁడై
యొకగడెసేపు రిమ్మగొని యుండి పదంపడి తేటి నిష్పరీ
క్షకుఁ డసమీక్ష్యకారియును గావున రోషవశుండు గావునన్. 24

క. ఇప్పుడు చంపె న్వదనము, చెప్పకె చెప్పెడును రక్తసిక్తంబయి నా
కుప్పాకలువోలెఁ గలిగిన, యిప్పాపని దీనికేన యిచ్చితి మెసవన్. 25

క. సతిమాట మీఱ కన్నె, త్సుతుదగ్గఱఁ గాచియుండఁ జూచిన నీదు
స్థితి వచ్చెనె నాకుత్సిత, మతిగూల న్నకుల ముచితమా కావలికిన్. 26

క. అని కన్నుల జేవుఱుగీ, లొక్కన లగుడం బెత్తి విసరికొట్టిన వెలికిన్
గనుగ్రుడ్లు వెడల నొప్పిం, బనివి యహో నకుల మపుడు ప్రాణము విడిచెన్. 27

చ. నకులముఁ జంపి పోయి సదనంబున భూమిసురుండు గన్గొనం
జికిలిమడుంగుపానుపునఁ జెక్కుచెమర్పక యున్నపుత్త్రకున్
బ్రకటభుజంగభంగములఁ బ్రాంతమునం గని తెచ్చఁబోయి యే
టికి నిటు సేసితిం గలువరించి యయో నను రోయ నుత్తముల్. 28

వ. అని యుదరతాడనంబుఁ జేసికొనుచు బ్రాహ్మణుం డుచ్చైస్స్వనంబున రోదనంబు సేయందొడంగె నక్కలకలంబు చేరువఁ బుట్టినింటనునికిం జేసి యాకర్ణించి యాజ్ఞసేని గృహంబునకు వచ్చి బ్రాణేశ్వరు నాలోకించి. 29

క. కడిఖండలైనపాము, క్కడిది కడుం బ్రేమఁ బెంపఁగా రాజిలు పెం
పుడునకుల మేలపాలిసెం, దడయక నీ వేటికేడ్చెదవు చెప్పు వనరూ. 30

క. ఈలక్షణములలీలన్, మూలాలై యున్న జాయ సుగుణనికాయన్
వేలాతీతప్రీతిం, బాలితనిజగోత్ర సమితిపతి యిట్లనియెన్. 7

క. దైవముకృప గలదానవు, గా వంధ్యాత్వంబు వీడెఁగా నీతికళా
కోవిదుఁ డగుసుతుఁ గనియెదు, గా వంశము వృద్ధిఁబొందఁగా నా కనుచున్. 8

వ. మనోరథంబునం బొట్టపోఁజలగు మగనిం గని నగుమొగంబున ఘటప్రతిభట స్తని
యిట్లనియె. 9

క. బహుళమనోరథభీషణ, గహనంబునఁ జిక్కి వెడలఁ గాననినీచో
త్సాహనుఁడు చనుస్తతజః, పిహితుం డగుసోమశర్మపితచందమునన్. 10

క. నావిని దేవికి విపులా, దేవుం డిట్లనియె గుణవతీ యెట్టెట్టూ
నీవీకథ నాతోఁ జెప్పు, మా వినియెద ననినఁ బతికి మానిని పలికెన్. 11

సీ. కలఁడు దాశార్ణభూతలమున నత్యర్థసారశర్ముఁడు సోమశర్మ యనఁగ
నతనికి నెనమండ్రు సుతు లందులో నగ్రపుత్రుండు పిత్రన్నభోక్త వాఁడు
కడుపారఁ గృష్ణపక్షశ్రాద్ధమున నొక్క భూమినిర్జరుగృహంబున భుజించి
యొకసక్తుఘటము పైతృకకర్తచేఁ గొని చని విజనప్రదేశమున నిలిచి

తే. ఘటము గలయంపిగా నీరుగా విపంచెఁ, బఱచి శయనించియెు ఉుగు గాఁ బాణి నిలిపి
యాత్మ లతమోడ్చి ధనవృద్ధనై చరింతు, నని దుడంతోద్యమంబున నతఁడు దలఁచె.

సీ. అవన సీసక్తు వమ్మెద నమ్మి యొకమేఁక గొనియెదఁ గొనకొని కొనిన మంద
కోటేట నొకరెంటి నీనెడునవియును నవియు వానికిఁ బుట్టినవియు నీన
బహువత్సరములకు బహుసహస్రంబులై నెగడెడువాని నన్నింటి విలిచి
సంతరించెద ధేనుశత మది పెట్టినకోడెలచే ధారఁ గొనిన చేల

తే. విరివిగా శైరు వి త్తింతు వేళ్ళుగోలుచు, గాఁగ మామకసస్యము ల్గడుఫలించు
పంటకొలంచమ్మి కూర్తు నపారధనము, ధనికుఁ డనినాకు నొకఁడిచ్చుఁ దనకుమారి.

క. దొడ్డతన మరసి యీక్రియ, గడ్డాయం బనిన విప్రకన్యకవలనన్
గొడ్డ కొకసుతుని గని యా, బిడ్డని మాసోమశర్మపేరే యిడుదున్. 14

క. ఆయర్భకుఁ డూర్జితగతి, హాయనపరిమితవయస్కుఁ డగుఁ బోషింపన్
సాయంతనమున గృహకా, ర్యాయత్తమనీషభామ యర్భకునిన్. 15

క. కరుణఁ దనచంక నిడుకొని, యరుగక యటువైచి పోవు ననునాలో భూ
సురుఁ డీపన్నిద్రాసం, భరముద్రితనయనుఁ డగుచు మఱియాలోనన్. 16

క. ధేనువు లేతెంచిన నటు, లైన న్వడిఁ ద్రొక్కు నాత్మజునిఁ దేవోసీ
వీని నిటువైచి పోఁదగు, నే నీచంకకు భరంబె నిసువానుకొనన్. 17

క. అని కలవరించి లగుడముఁ, గొని త్రిప్పుచు నిక్కువంబు కులపతి యనుచున్
జెనఁటిధరాసురుఁ డాగ్రహ, మున సక్తుఘటంబు భిన్నములుగా వైచెన్. 18

వ. సక్తుచూర్ణపాండురాకృతుండును విషాదవిహ్వలుండును నయ్యె నిది మనోరథరాజ్య
పాలనఫలం బనిచెప్పి యప్పల్లవాధర సుముహూర్తంబునఁ గుమారుం గాంచి
పంచమదివసంబున. 19

క. అతులలేనికుమారునిఁ, బొత్తులలో నునిచి గూర్మిఁ బురుషుని రక్షా
వృత్తికి నియమించి ధరా,కృత్తులితో రాజ జననిగృహమున కరిగెన్. 20

క. ఆలోఁ బెంపుడునకులము, బాలునకుం గాపువెట్టి బ్రాహ్మణుఁడు నికే
తాళిందమునకుఁ జనియెం, గాలోరగ మపుడు బిలముఖము వెలువడుచున్. 21

క. అలభూమిసురతనూభవు, తలిమంబునఁ బఱచి నూర్జితక్రోధసమా
కులమై నకులము చిఱుపన్, బలువాతన్ గఱచి ద్రుంచి పాఱఁగవైచెన్. 22

ఉ. ఆసమయంబున న్మహీసురాగ్రణి పుత్త్రుఁ దలంచి గాఢసం
త్రాసము పేర్మి లోఁగిటికి గ్రమ్మఱ వచ్చుచు నుండఁ జూచి యు
ల్లాసరసం బెలర్ప నకులంబు ఫణిస్రవదస్రపంకసం
భాసితవక్త్రమై యెదురఁ బర్వి పదాబ్జములం బెనంగినన్. 23

చ. ప్రకటభుజంగమక్షతజపంకవిలిప్తముఖంబు నమ్మహా
నకులముఁ జూచి భూమిసురుఁ డాహతభీతపరీతచిత్తుఁడై
యొకగడెసేపు రిమ్మగొని యుండి పదంపడి తేటి నిప్పరీ
క్షకుఁ డసమీక్ష్యకారియును గావున రోషవశుండు గావునన్. 24

క. తప్పదు చంపె న్వదనము, చెప్పక చెప్పెడును రక్తసిక్తంబు నా
కుప్పాకలు వోలెఁ గలిగిన, యుప్పాపని దీనికేన యిచ్చితి మొసవన్. 25

క. సతిమాట మీఱ కస్మ,త్సుతుదగ్గఱఁ గాచియుండఁ జూచిన నీదు
స్థితి యిచ్చెనె నాకిత్తఱి, మతిగూల న్నకుల ముచితమా కావలికిన్. 26

క. అని కన్నుల జేవుఱుగఁ, లోఁగొన లగుడం బెత్తి విసరికొట్టిన వెలికిన్
గనుగ్రుడ్లు వెడల నొప్పిం, బనివి యహో నకుల మపుడు ప్రాణము విడిచెన్. 27

చ. నకులముఁ జంపి పోయి సదనంబున భూమిసురుండు గన్గొనం
జికిలిమడుంగుపానుపునఁ జెక్కుచెమర్పక యున్నపుత్త్రకున్
బ్రకటభుజంగభంగములఁ బ్రాంతమునం గని తెచ్చఁబోయి యే
టికి నిటుసేసితిం గలువరించి యయో నను రోయ నుత్తముల్. 28

వ. అని యుదరతాడనంబుఁ జేసికొనుచు బ్రాహ్మణుం డుచ్చైస్స్వనంబున రోదనంబు
సేయందొడంగె నక్కలకలంబు చేరువఁ బుట్టినింట నునికిం జేసి యాకర్ణించి యాజ్ఞసే
ని గృహంబునకు వచ్చి బ్రాహ్మణేశ్వరు నాలోకించి. 29

క. కడిఖండ లైనపాము, న్కడిది కడుం బ్రేమఁ బెంపఁగా రాజిలు పెం
పుడునకుల మేలపాలిసెం, దడయక నీ వేటికిం డ్చెదవు చెప్పు మనఘా. 30

ఉ. పాపిని బ్రాహ్మణుం డనియె నన్నుఁ బ్రయత్న మెలర్పఁ బట్టి కా
కాపలిఁబెట్టి పుట్టినిలు గాల్వఁగ నీవటుపోవ నేను నా
లో వివరంబు మాలి మృగలోచన ముంగిస నే కిశోరర
క్షావిధి కొప్ప నేర్పఱచి జాటితి మందిరబాహ్యభూమికిన్. 31

క. ముంగిసయును మన్నిరోగము, నం గదలక కాచియుండ నందును నాలో
నం గాలసర్ప మరుదే, రం గని భవదీయపుత్త్రరక్షాబుద్ధిన్. 32

క. తలఁ గొఱికి నఱికి భుజగ, జ్వలదస్రరసాతిరక్తవదనముతో ద
వ్వుల కెదురువచ్చి నకులము, కలకంఠీ పెనఁగఁదొణఁగెఁ గాళ్ళకుఁ బ్రేళ్ళకున్. 33

తే. అపుడు పన్నగరక్తసిక్తాననంబు, బభ్రునేత్రంబుఁ గని గుండె పగిలి నొగిలి
తనయు నిర్జించెనిఁక నేటితాళి మనుచు, నువిద లగుడాభిహతి దీనిఁ యసురుఁగొంటి.

క. ఈయుగ్రాఘం బేమిటఁ, బాయు నిశాచరుఁడఁ గాక బ్రాహ్మణుఁడనె యం
చా యన యేడ్చుచుఁ జెప్పిన, నాయిభనిభయాన ఖిన్నయై మూర్ఛిల్లెన్. 35

వ. మూర్ఛిల్లి యొట్టకేలకుం దెలిసి కన్నీరు కరతలంబునం దుడిచికొనుచు సతి పతికి గద్గదస్వరయై యిట్లనియె. 36

క. కుపరీక్షితము కుదృష్టము, కుపరామృష్టంబు మఱియుఁ గుశ్రుతముం గో
నుపురుషుఁడు నాపితుని క్రియ, నపరిమితాపత్పరీతుఁడై చెడిపోవున్. 37

క. అనినవిని భూసురుఁడు సతిఁ, గనుగొని యోవంశపాలికా! మంగలి యే
పనిఁ జేసి చచ్చె నీకథ, విననిష్టం బయ్యెఁ జెప్పవే నాకనుడున్. 38

వ. యాజ్ఞసేని యిట్లని చెప్పం దొడంగె. 39

చ. జడమతిభార్య యొక్కసతిసాని విదర్భనివీటనుండి సొం
పడరఁగఁ గగ్గలబ్ధిఁ గడుపై కడుఁబైకొనుదండినొప్పాలం
బడి యది పుత్త్రుఁ గాంచి పిదపం బరలోకముఁ జేరె నంతలో
నడల దొడంగె నాకటికి నారసి చన్నిడలేమి బాలుఁడున్. 40

క. చుట్టంబులు పక్కంబులు, కట్టడిదయ్యె వీఁడు తల్లిగండము తలగా
బుట్టె నపలక్షణుం డికఁ, గట్టా యెవ్వారి జెఱుపఁగా నున్నాఁడో. 41

ఆ. ఇంట నుండఁగూడ దిప్పుడ గొని చని, గుంటనైనఁ బెద్దకుంటనైనఁ
బెంటనైన వైచి యింటికి నరుదెండ, నంగ నద్దురుక్తు లాలకించి. 42

క. అయిదేండ్లఁ గూలి కప్పట, లాయముగా నిరవధీనయై మనునొకవ
క్షీయను వేఁగినపుడిలో, బాయనితమి మ్రొక్కి నిలువఁబడి యిట్లనియెన్. 43

ఉత్సా. కన్నవారివంకవారిఁ గానఁ బ్రాణనాథుఁడున్
మున్నెచచ్చె యేను గుంకముండ నెట్టు లేగుదున్
మున్ను వెన్క లేదు లేఁడు మూఁడుగాళ్ళవృద్ధనా
యున్నలాతకీని నీవె యంచు వేఁడె మ్రొక్కినన్. 44

మ. అరసొన్నగ్రహణాపికేశవతశోభాక్ సౌఖ్యకృత్తైలసం
స్ఫురణాభావజటీకృతాలకననీషద్దైన్యతామ్యన్ముఖం
బరుషప్రాక్పరిధానసంవృతనితంబ న్నిర్గతాలంబనా
జరతం గన్గొని యొండునాక నగరస్వాముల్ ప్రసాదించినన్. 45

క. వనిత పనిఁబూని వానిన్, దనయుని గాఁ బెనుచుకొనిన దత్సుకృతం బే
మని చెప్పవచ్చు విద్యా, ధనుఁడు గుణాకరుఁడు ధీరతరుఁ డతఁడయ్యెన్. 46

క. అతఁ డొకనాఁడు దారి, ద్ర్యార్తురుఁడై ధాత నొఁసి యలసి మహీశ
య్యాతలమున నిదురించి య,హో తేజోలాభమూల మొకళలఁ గనియెన్. 47

ఉ. చేరి శ్రుతీయమామమున సెట్టి గలంగి సదుల్లసన్మరు
ద్భూరుహభంగిఁ గెంజడలు భూతివళక్షితమైన మేన నిం
డారఁగ గావికావు మసివంటినమోము సటత్మశుభ్రరో
చీరుచి సేవగింప నొకసిద్ధుఁడు వచ్చి సదాదరాయతిన్. 48

చ. అనియె వహో కిరాటతనయా వినయాదిగుణంబులందు నే
మనుజుఁడు నీకు సాటి యలమాట లటుండెఁ బ్రభాతమైననీ
కనుఁగవకు న్ఘనక్షపణకత్రయము న్గనుపట్టు ముంగిటం
బనివడి దానిఁ జంపు మది భర్మనిధిత్రయమూర్తి నుండెడున్. 49

క. ఆనిధులఁ బుచ్చుకొని ధని,వై నీతిఖ్యాతిరీతు లమరఁగ మనుమం
చానిత్యసత్యుఁ డరిగిన,మానస ముదరం గిరాటమణి మేల్కనియెన్. 50

తే. మేలుకని భక్తిఁ బ్రణమిల్లి మేరనిలిచి,తల్లి యూరుజమహిళామతల్లికనియె
నమ్మ యిమ్మందిరంబున నలికి ముగ్గుఁ, బెట్టు మిపుడు శుభంబు లభించు మనకు.

క. వలదు విలంబన మన న,ప్పలితగృహం బలికి పూసి పసపొసఁగం గు
గ్గులుమృగ్గులు నిడి యుక్కు,థ, నలఘుమతిం దెలిపె సనయుఁ డగుతనయునకున్. 52

క. క్షౌరమువకు సమయంబగు, టారసి నాపితుఁడు వచ్చె నాలో దైవ
ప్రారంభమున నపూర్వవి, భూరూషక్షపణకత్రయంబును వచ్చెన్. 53

వ. వచ్చిన. 54

క. మే నుప్పొంగఁగఁ బెంజెర, కూన న్నగు లగుడమెత్తికొని ప్రాణంబుల్
పోనడఁచె సెట్టి యాలో, దీనత్రితయంబు బహో నిధిత్రయ మయ్యెన్. 55

వ. అయిన. 56

క. ఆనిధులఁ బుచ్చుకొని ధని,యై నాపితుఁ జూచి వణిజుఁ డాద్భుతి మెఱయన్
దీనారశతక మిడి మదిఁ, బూనినకౌతూహలమునఁ బొమ్మని పల్కెన్. 57

చ. వెఱగు జనింప నత్తెఱఁగు వెంగలిమంగలి నూచి కన్నుమి
న్నెఱుఁగక యింటి కేగి యటులేనును భూరినిధు ల్గడింతు నం
చతిమతి గొంచలేక లగుడాగ్రముఁ గైకొని యత్నమేమియున్
గరిపడకుండ నాక్షపణకత్రితయాగమనంబుఁ గోరఁగన్. 58

క. ఒకముగురు నిగురుగప్పిన, ప్రకటాంగారము లనంగ భస్మవిలిప్తాం
గకులు చనుదేర నారసి, తుకతుకపో నడచె నాపితుండు చేసేతన్. 59

క. లగుడంబున మస్తకముల్, పగిలి పడ న్వ్రేయఁ జచ్చిపడి రన్నఁగ న
మ్ముగురును మూగురు నిధిత్రయా, మగుటయు లే దవని మెఱసె నస్రము మెదడున్.

వ. అట్టి దుష్కృత్యంబునకుఁ జౌరులాహాకారంబు లొనర్చి రాత్మగంబ నరరక్షకులు. 61

చ. పటురభసంబున న్బ్రదివిపట్టి దురాత్మక యిట్టివారి నేఁ
డిటువలె జేసి చంపుటకు నెవ్విధి నీమన సోర్చె వీరు ని
ష్కుటిలచరిత్రు లన్యులకుఁ గోర రొకింతయు గీడు వీరిపైఁ
గటకట మచ్చరం బెటులఁ గల్గె వృథా యిది పోల దెయ్యెడన్. 62

క. నిటలలిఖితాక్షరంబులు, కుటిలాత్మ మసలు దేసల గొనబగు జటులం
జటులగతిఁ జంపితీవని, కటములు బొంగారఁ గ్రూరగతి వారంతన్. 63

క. ఆత్మునకుఁ దోడిపడ న, బ్భిత్తులపాదముల సరసఁ బెట్టి భుజాహో
తితుతి దునిమిరి ధరనప, రీక్షితకార్యులు భజింపరే యాపదలన్. 64

చ. ప్రశమనరేఖఁ బాదమునఁ బ్రామి యహో యవిశేషరోషసం
పదఁ దగుమన్ ధరాస్థలి నవారణ నెవ్వఁడు వేగిరించి సం
భృతతరకార్యము ల్సలుపఁ బెద్దయు వేయునునేల సర్వదు
ర్దశలు గలంచు వానిఁ దమ దా గుణలుబ్ధులఁ బొందుసంపదల్. 65

వ. కావున నీవును నాపితునకు దోడుబోయినవాఁడ వని ప్రాణేశ్వరుం దూరెఱ వారు సుఖస్థితి నుండి రని విష్ణుశర్మండు సెప్పిన విని నీతికథావర్ణనంబున సుదర్శనకుమారులు లబ్ధవర్ణులై పూర్ణులై తండ్రి నలరింపుచుండిరి. 66

మ. సతతశ్రీభృతరాగదేహకృతయోషాభాగరత్నాస్థిదా
మతటిత్తారకయుక్తవారిధరసమ్యక్కాయ చిద్గేయష
ణ్మతమోహాన్వితికర్తృకామహితగానప్రేమ గోపాంగనా
శతచామీకరచామరానిలచరాంచత్ఫాలలోలాలకా 67

క. హాటకమణినూపురన్యక, రోటీకమలాప్తచరణ రుచిరాగ్నిశిఖా
పాటీరధసితపల్లవ, పాటలమందారపాదపప్రతిమానా 68

మాలిని త్రిపురరిపునరస్త్రీ ప్రమానచ్ఛిదాఢ్య, నిపుణతరవిహారా నిత్యసంతోషపూరా
జపకరణచణార్యాసక్తముక్తాభిగమ్యా, త్రిపటుతనువిలాసా దివ్యధామైకవాసా. 69

గద్య. ఇది శ్రీవేంకటనాథ కరుణాలబ్ధ సరససాహిత్యనిత్యకవితావిలాస సకలసుకవిస్తుతిభాషణోల్లాస రాజకులపారావారపర్వశర్వరీరమణ నీతిశాస్త్రమార్గపరిశ్రమణ ధైర్యపర్యాయ ధిక్కృతనీహారపర్వత పర్వతరాజకుమార నిస్సహాయప్రబంధనిర్మాణ భోజభూజానిసుధామధుర భారతీసనాథ వేంకటనాథ ప్రణీతం బయిన పంచతంత్రంబున నసమీక్ష్యకారిత్వ మన్నది సర్వంబును పంచమాశ్వాసము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1924.